

‘‘ప్రోయగము’’

—చిత్రకారుడు: అల్లు సూర్యారావు.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై.


# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక


సంపుటము 52
సంచిక 54
3-9-58

Founder : K. NAGESWARA RAO

విలంబ శ్రావణ బహుళ పంచమి బుధవారం


### విషయానుక్రమణిక

## బెంగుళూరులో ఒకనాటి బందిఖానా

# నేటి బాలల విహారం

★ వార్కీ చెరియన్ ★

ఇటీవలి వరకు ఆడ నేరస్థులకు బందిఖానాగా ఉన్నచోట యీనాడు పాలబుగ్గల పసికందులు తిరుగుతూ యిలలో ఆటపాటలతో ఆనందంగా కాలక్షేపం చేస్తున్నారు. మహారాణి కాలేజీలో చదువుకొంటున్న విద్యార్థినులు ఈ బాలలకు సంరక్షకులు. ఆ ప్రక్కనే ఉన్న మరొక భవనములో ఈ విద్యార్థినులు బాలలకు కావలసిన భోజనాది సదుపాయాలు చేస్తూ, ఇదే తమ స్వర్గధామంగా భావిస్తుంటారు. ఈ భవనం కూడా ఇంతకుముందు ఆడవాళ్ళ జెయిలు!

బెంగుళూరు సెంట్రల్ జెయిలులో ఆడ నేరస్థుల విభాగాన్ని మహారాణి కాలేజీకి అప్పగించి, దానిలో బాల సంక్షేమ కార్యకలాపాలను నిర్వహిస్తున్నారంటే, మహిళామణులకు ఎటువంటి మహత్తర బాధ్యతలు అప్పగించబడ్డాయో వేరే చెప్పనవసరం లేదు.

ఈ మార్పుకంతటకు డాక్టర్ బి. సుశీల లింగయ్య అనే ప్రసిద్ధ విదుషీమణి కారకురాలు. ఆమె మహారాణి కాలేజీలో గృహనిర్వహణ శాస్త్రం బోధిస్తుంది. ఆమె ఈ కాలేజీ ప్రిన్సిపాల్ కూడా.

కాలేజీలో గృహనిర్వహణ శాస్త్ర శాఖను 1951 లో ప్రారంభించారు. ఈ శాస్త్రాన్ని నాలుగు సంవత్సరాలు చదివిన వారికి డిగ్రీ ఇస్తారు. ఆహారపదార్థాల మంచి చెడ్డలు; ఇంటిఖర్చులు, గృహాన్ని చక్కబెట్టుకోవడం మొదలైన విషయాలు బోధిస్తారు. ఈ శాఖను ప్రారంభించిన కొలది కాలానికే బోధనా సౌకర్యాల సమస్యల్నూ, విద్యార్థినులను చేర్చుకునే సమస్యలు మొదలైనవి వచ్చిపడ్డాయి.

వీటినన్నింటినీ పరిష్కరించి తీరాలని ఆమె భీష్మప్రతిజ్ఞ వహించింది. ఎందుకంటే అర్హురాలైన ఏ విద్యార్థినికి కూడా సీటు లేదనడం ఆమెకు ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత ఈ శాఖలో చేరే విద్యార్థినుల సంఖ్య నేడు విపరీతంగా పెరిగింది. మొదటి సంవత్సరంలో చేరిన విద్యార్థినులు 50 మంది మాత్రమే అయితే, ఈ సంవత్సరం చేరినవారి సంఖ్య 230 అయింది. ఇటువంటి శాస్త్రాభ్యాసానికి ఇంతమంది విద్యార్థినులు ఎగబడటం అపూర్వవిషయం.

విద్యార్థినులకు చెప్పే చదువు వారు కేవలం డిగ్రీలు సంపాదించుకోడానికి కాదు. వారు జీవితంలో విజయవంతులయేటట్లు బోధనా తరగతులు నిర్వహించబడుతున్నాయి.

నేను ఈ కాలేజి చూడడానికి వెళ్ళినప్పుడు డాక్టర్ లింగయ్య నన్ను నర్సరీ విభాగానికి తీసుకువెళ్ళింది. విద్యార్థినులు దానిలో శిశుపోషణాది విషయాలు నేర్చుకుంటున్నారు.

"స్కూలుకు వెళ్ళే వయస్సురాని పిల్లలను సక్రమంగా పోషించే జ్ఞానం ఆడవారికి సహజం కాదు. అంతేకాదు అది లభించదు," అని ఆమె నాకు చెప్పింది.

గృహనిర్వహణ శాస్త్రాన్ని మొదటి రెండు సంవత్సరాలు మిసెస్ పి. సి. రెడ్డి బోధిస్తూండేది. 1953 లో డాక్టర్ లింగయ్య ఈ భారాన్ని తను స్వయంగా స్వీకరించింది. మిసెస్ పి. సి. రెడ్డి న్యూయార్క్ స్టేటులో ఉన్న సైరాక్యూస్ యూనివర్సిటీలో పట్టభద్రురాలైంది. డాక్టర్ లింగయ్య ఈ శాస్త్రవిభాగాన్ని నిర్వహించాలనే తలంపుతో అమెరికాకు వెళ్ళి, అతిపురాతన వ్యవసాయ కళాశాలల్లో ఒకటైన మిషిగన్ స్టేట్ యూనివర్సిటీలో నాలుగు సంవత్సరాలు అభ్యసించి, ఆహారపదార్థాల విషయంలో ఎం. ఏ., పి. హెచ్. డి. డిగ్రీలు పొందివచ్చింది.

గృహనిర్వహణశాఖకు 1955 లో మరింత ప్రోత్సాహం కలిగింది. ఎలాగంటే, ఆ సంవత్సరంలో డాక్టర్ మేరీ ఎలిజబెత్ కెయిజర్ అనే ఆవిడ ఈ కాలేజీలో ఒక సంవత్సరంపాటు బోధించడానికి అమెరికా నుంచి వచ్చింది. ఇందుకు ఇండియాలో ఉన్న అమెరికా సాంకేతిక సహకార కార్యాలయంవారు ఇంటర్ యూనివర్సిటీ కాంట్రాక్టు కార్యక్రమాన్ని అనుసరించి సహాయపడారు.

శిశుపోషణలో డాక్టర్ కెయిజర్ సిద్ధహస్తురాలు. గృహనిర్వహణశాస్త్ర విద్యార్థినులకు లాబొరేటరీగా ఉపయోగించేనిమిత్తం పైన పేర్కొన్న బాలసంరక్షణాలయ స్థాపనకు ఆమె డాక్టర్ లింగయ్యకు సహాయపడింది.

గృహనిర్వహణశాస్త్రశాఖకు ముఖ్యావసరంగా ఉన్న పొయ్యిలు, ఓవన్లు, వాషింగ్ యంత్రాలు, ఫ్రిజిడెయిర్లు, మైక్రోస్కోపులు మొదలైన పరికరాలను సంపాదించడానికి డాక్టరు లింగయ్యకు ఆమె ఎంతో తోడ్పడింది. గృహనిర్వహణశాస్త్ర

(54- వ పేజీ చూడండి)



విహార ఆవరణంలో బాలలకు చిత్రలేఖన శిక్షణ ఇస్తున్న దృశ్యం. కుడిపక్కన నిల్చొనివున్నవారు మిస్. ఫాంగయా సెల్వదాస్.




# రాజధానిలో జలక్షామం

ఇటీవల ఒకానొక ఆదివారం మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో ఢిల్లీలో జరిగిన సంఘటన-మంచినీటి కుళాయిలు హఠాత్తుగా బంద్ అయ్యాయి. జలక్షామం మెరుపుదాడి చేసింది. ఆదివారం సెలవు రోజు. అందులో ఆ ఆదివారం హిందూ స్త్రీల పర్వదినం.

హఠాత్తుగా నీటికరువు మెరుపుదాడి చెయ్యటానికి కారణం-అధికారులు 'నీటి సరఫరా ఆపుచేస్తున్నా'మని ముందుగా ప్రజలకు తెలియపరచలేదు. ముందు హెచ్చరించకపోవటంవలన, అవాళ పండగ కావటం వలన చాలా యిళ్లలో ముందుగా నీళ్ళు పట్టి ఉంచుకోలేదు. సోమవారం ఉదయం జలాభావంవల వంట చేసుకోటానికికూడా వీలేకపోయింది. చాలా ఇళ్లల్లో పొయ్యిలో పిల్లి లేవలేదు.

నీటికరువునుగూర్చి సోమవారం ప్రొద్దున పార్లమెంటులో తుఫాను విజృంభించింది. భారత రాజధానిలో పౌర జీవితానికి సంభవించిన ఈ బ్రహ్మాండమైన ఉపద్రవాన్ని చర్చించేందుకు ప్రతిపక్షం విరామ తీర్మానాన్ని ప్రతిపాదించింది. ఈ ప్రతిపాదనను ఆమోదించటమా లేదా అని సభ చర్చించటం మొదలుపెటగానే, కొందరు సభ్యులు తమకు దీనివల్ల కలిగే ఇబ్బందినిగూర్చి ఆందోళన పడసాగారు. వీరి స్వార్థం చూసేసరికి శ్రీమతి రేణు చక్రవర్తికి ఒళ్లు మండింది. ఆమె లేచి "సొంతలాభం కొంత మానుకుందాం. వంట వండుకోటానికైనా వీల్లేక బాధపడుతున్న వేలాది కుటుంబాల సంగతి కాస్త ఆలోచిద్దాం," అన్నది. ఆమె మందలింపు సభ్యులకు సూటిగా నాటింది. అసలు విషయాన్నుంచి దృష్టి మళ్ళిద్దామనే ఉద్దేశంతో, 'మంత్రిగారు ఈ విషయమై ప్రకటన చెయ్యా'లని ఢిల్లీ ప్రతినిధుల్లో ఒకరైన లాలా రాధారమణ్ కోరారు. ఆయన్ని శ్రీ మహావీర్ త్యాగి తీవ్రంగా ప్రతిఘటించారు; "ముందు విరామ తీర్మానం సంగతి తేల్చమని ఆయన సభాపతికి విజ్ఞప్తి చేశారు. సభాపతి తీర్మానంపై చర్చకు అంగీకరించారు.

విరామ తీర్మానంపై జరిగిన చర్చ ప్రజాశ్రేయస్సుకంటె పార్టీప్రతిష్ఠే గొప్పదని ఋజువు చేసింది. ఒకవేళ వోటింగులో ప్రభుత్వపక్షం ఓడిపోతుందని భయపడ్డారేమో అనుకుంటే అదేంలేదు—పార్లమెంటులో ప్రభుత్వానికి ఉక్కిరి బిక్కిరిగా మెజారిటీ ఉంది. అయినా ప్రభుత్వం తన మీద వచ్చిన విమర్శలకు (కాంగ్రెసు పక్షానికి చెందిన డా॥ సుశీలానయ్యర్, శ్రీమతి సుచేతా కృపలానీ కూడా ఘాటుగా విమర్శించారు) సమాధానం ఇవ్వటంకూడాదండగన్నట్లు ప్రవర్తించింది. ప్రతిపక్షసభ్యులు సందు దొరికిందిగదా అని ప్రభుత్వాన్ని తూర్పారపటారని అనిపిస్తుంది గనుక ప్రతిపక్షసభ్యుల ప్రసంగాల్ని నేను ఉదహరించను. ఢిల్లీ రాష్ట్ర మాజీ ఆరోగ్య మంత్రిణి డా॥ సుశీలానయ్యర్ ప్రసంగంనుంచే ఉదహరిస్తాను. ఢిల్లీలో నీటికొరత తలవని తలంపుగా వచ్చిన తలవంపు కాదని ఆమె అభిప్రాయపడింది. ప్రతి ఏటా, యమునానదికి తాత్కాలికంగా ఒక కాలవను కొన్ని లక్షలు ఖర్చుపెట్టి తవ్విస్తూ ఉంటారు. అంతేగాని ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించే ఏర్పాట్లు చెయ్యరు. "ఏదన్నా ఇబ్బంది వచ్చినప్పుడు హడావిడిగా ఏదో చేసేస్తారు. ఆ ఇబ్బంది తీరిపోగానే సచివులు, సచివాలయ అధికారులూ మళ్ళీ యథాప్రకారం చేతులు ముడుచుకుకూర్చుంటారు. 'నజఫ్‌ఘర్ నలా' చాలా ప్రమాదకరమని అన్నారు. అది కొన్నివందల ఏళ్ళనుంచీ ఉన్నది. మరి ఉన్నట్టుండి అది ఎందుకు ప్రమాదకరమైంది? దాని ఒడ్డున ఇళ్లు కట్టుకోనిచ్చారు. ఆ ఇళ్ళవాళ్లు దాన్ని నానా భండాలం చేసి పెట్టారు. భారత ప్రభుత్వం శ్రద్ధ తీసుకుని ఉంటే ఈ విషాద సంఘటన జరిగి ఉండేది కాదు."

నీటి సరఫరా చెడిపోకుండా తీసుకోవలసిన చర్యలను సూచిస్తూ రెండేళ్ళ కిందట కామెర వ్యాధి విచారణ సంఘం ఇచ్చిన నివేదికలోంచి, ఢిల్లీ పురపాలక నివేదికలోంచి ఉదహరిస్తూ ఒకరి తరవాత ఒకరు అనేకులు సభ్యులు ప్రసంగించారు.

కాని......

ఆరోగ్య మంత్రి ఈ విమర్శలను విని దప్పరించేశారు. పైగా చాలా ఘనకార్యం చేశామని అన్నారు. ఆ పరిస్థితులలో చెయ్యటానికి వీలైనదంతా చేశారట. రెండే రెండు సమస్యలా గా-చెడిపోయిన నీటిని సరఫరా చేయటమా, అసలు నీటి సరఫరానే మానివేయటమా అనే సమస్య ప్రభుత్వాన్ని ఎదురొగా, నీటి సరఫరాను మానెయ్యడమే మంచిదని నిశ్చయించారట. అదీగాక, ఢిల్లీలో సరఫరా చేసే మంచి నీళ్ళున్నాయే అవి, ప్రపంచంలోకల్లా అంటే కొంచెం బడాయిగా ఉంటుందిగాని, నూయజీలాండ్ కొలవ కివతల దేశాల్లోకల్లా అద్భుతమైన శుభ్రాతి శుభ్రమైన జలమని ఆరోగ్యమంత్రి గొప్పగా చెప్పుకున్నారు!

ఇక రాజ్యసభలో జరిగిన తంతు. ఢిల్లీ ప్రతినిధి లాలా ఓంకారనాథ్ ప్రభుత్వ సామర్థ్యాన్ని, ఇప్పటి దాకా చేసిన గొప్ప పనులను మెచ్చుకుంటూ ఉపన్యాసం ఇచ్చారు. ఈయనగారి సభ్యత్వం ఆఖరు కావస్తోంది. మొన్నటి ఉపన్యాసం పునాది మీద మళ్లీ రాజ్యసభకి ఎన్నిక అవుదామని

ఆయన ప్రయత్నిస్తారో లేదో చూడాలి.

ఆగస్టు 19వ తేదీ "హిందూస్థాన్ టైమ్సు" లో ఈవార్త పడింది.

"గడచిన పదిరోజుల్లో నెత్తురు విరేచనాలకేసులు చాలా తమదగ్గిరికి వచ్చాయని ఢిల్లీ డాక్టర్లు చెబుతున్నారు. నజఫ్‌ఘర్ నల్లా మూలంగా మంచినీరు పాడై ప్రమాదకరంగా పరిణమించిందని సోమవారంనాడు కార్పొరేషన్ అధికారులు ప్రకటించారు. ఆస్పత్రులలో డీసెంట్రీ కేసు లెన్ని ఉన్నాయో ఇంకా అధికార సమాచారం తెలియకపోయినా, బాగా ఎక్కువగానే ఉండి ఉంటాయని డాక్టర్లు భావిస్తున్నారు.

గతవారం కలరాకేసులు చాలా సంభవించాయని, వ్యాధివ్యాపించిందని త్రినగర్ నుంచి వార్త వచ్చింది."

శ్రీ కర్మార్కర్ చెప్పుకున్న గొప్పలకు ఈ సమాధానం చాలనుకుంటాను. ఆయన ప్రసంగాన్ని విమర్శిస్తూ "నీటి సరఫరాను తిరిగి ప్రారంభించే భారం సైన్యానికి అప్పగించామని తప్పిస్తే మంత్రిగారు కొత్తగా మరేమీ చెప్పలేకపోయారు," అని హిందుస్థాన్ టైమ్స్ వ్రాసింది. ఢిల్లీ నీటి సరఫరాను సైన్యానికి ఎందుకు అప్పగించాల్సి వచ్చింది? రాజకీయ నాయకులు అన్నిచోట్లా క్రమశిక్షణ పాడుచేయటంలో కృతకృత్యులయ్యారుగాని సైన్యంలో మాత్రం పాడుచెయ్యలేకపోయారు - అందుకని.

మొత్తంమీద చర్చఅంతా చూస్తే ప్రభుత్వం పార్లమెంటులో గెలిచిందిగాని ఢిల్లీలో ప్రతిపక్షమే గెలిచిందనిపిస్తుంది. ఢిల్లీయావత్తూ ఈ విషయంలో ప్రతిపక్షాన్ని సమర్థించింది. అక్టోబరు రాబోతోంది. గాంధీజీనిగూర్చి మళ్ళీ ఉపన్యాసాలు వగైరా ప్రారంభమౌతాయి. కాని ఇప్పుడు జరిగిందిమాత్రం గాంధీమార్గానికి కేవలం వ్యతిరేకమైనది. గాంధీజీ తమతప్పులు తాము ఒప్పుకునేవారు. నీటిసరఫరా అపుదల విషయంలో ప్రభుత్వం తనతప్పును తాను ఒప్పుకోలేదు.

కాలచక్రంలో ఋతువుల క్రమగమనంలాగానే ఢిల్లీకికూడా ఒక క్రమపద్ధతిఉంది: వేసవిలో నీటిఎద్దడి; తరువాత వరదలు; తరవాత నీటిసరఫరా మారహాకావటం... ఆఖర్న ఉత్సవాలు. అక్టోబరు 58 నుంచి మార్చి 59 వరకూ ఢిల్లీఉత్సవాల జాబితా ఇదిగో:

(1) అక్టోబరు 1 నుంచి నవంబరు 30 దాకా "ఇండియా 1958" ఎగ్జిబిషను. (2) అక్టోబరు 13 నుంచి అక్టోబరు 21 దాకా భారతీయ కళాకేంద్రవారి రామ్‌లీలా. (3) అక్టోబరు 16,—18 వేషధారణ ప్రదర్శనం. (4) అక్టోబరు 19-20 శాస్త్రీయ

(54-వ పేజీ చూడండి)

# అమరా నిర్జరా దేవా...

"నమ్ర దిక్పాలసీమంతినీ కుంతల స్నిగ్ధ
నీలాలక శ్రేణి శృంగారితే లోక..."
లక్షసార్లు చెప్పాను.

ఆమాటకొస్తే లక్షా తొంభై వేలసార్లు చెప్పాను.

అయినా నీ తలకెక్కటం లేదు.

అసలు నీబుర్రలో నామాట పడుతోందా అని.

గోడకి చెపితే ఎంతో నీకు చెప్పినా అంతే అనిపిస్తోంది!

ఇంకా అనిపిస్తుందేమిటే—రూఢిగా కూడా అయితేనూ...

అనవసరంగా నాకు తెప్పించవద్దని నీకు మొదటి రాత్రి చెప్పాను. చెప్పానా? లేదా?

నేను పేరుకి భారద్వాజ గోత్రీకుడినే అయినా విశ్వామిత్ర దుర్వాసుల అనుచరుణ్ణి. ఏక్షణంలో మన ఆగ్రహం అంచులు దాటిపోతుందో మనకే తెలీదు.

సాయంకాలం ఆరు గంటల కల్లా ఇంటికొచ్చాను కదా. ఇప్పటికా ఈ బత్తాయిరసం తేవడం. చూడూ ఈ గడియారం కేసి

"ఉపశ్రీ"

చూడు ఆరు గంటల ముప్పై నిమిషాలయింది కదా...ఏ మొగుడన్నా...ఇదిగో...అసలు మొగుడనే వాడెవడన్నా.....వింటున్నావా.....మెడలో మూడు ముళ్ళు వేసిన మొగుడు, ఏనాడైన ఇంత ఆలస్యం సహిస్తాడా?

పైగా ఏమన్నా అంటే నేమో చంటిపిల్లాణ్ణి చూస్తానంటే సరదాగా సుబ్బలక్ష్మమ్మగారి కోడలు గారింటిదగ్గరకు తీసికెళ్ళావనీ, అప్రక్కనే కదా మా అక్కయ్య వేలు విడిచిన మేనమామగారి పెద్ద కోడలి చెల్లెలి ఆడబడుచుగా రుంటున్నారు కనక ఓ క్షణం అక్కడుండక పోతే బావుండదనీ వస్తూంటే దారిలో...న్నా...నాకు తెలీదూ నేను మాట్లాడడం మొదలు పెట్టేసరికి నీకు పాలు పొంగుతూంటాయి; లేకపోతే పోపు మాడిపోతూంటుంది అన్నం వార్చుకోస్తుంది చంటిపిల్లాడు ఉలిక్కిపడి లేస్తాడు. లేకపోతే సుశీలమ్మ కరివేపాకు రెబ్బకోసము నూతిగోడ దగ్గరనుంచి అరుస్తున్నట్లు నీకు వినబడుతుంది.

ఇంతకీ నిన్ను అనవలసిన పనేముందిలే. వాడి తల్లికడుపు బంగారం గానూ. అబ్రహ్మ దేవుడున్నాడే—వాడు చేశాడిదంతా. లేకపోతే ఆడదానికి ఆదిలో చనువిమ్మని ఎవడేడ్చాడే. కాస్తంత చనువిస్తే చాలు చంక ఎక్క....

ఇదిగో ఇలా ఒక్కమాట...అన్నం...చిమిడిపోతోందా...సరే కానియ్యి, కానీ మీ చెల్లి వంట నేర్చు చెప్పాలే. అనగున పలుకు పాలుంచగా పైన ఉండ్రాళ్ళ పాకం వచ్చేటట్లు వండుతుంది సుమీ. ఆ కీలకం ఏమిటో కాస్త తెలుసుకుందాం అన్నట్లు మరిచిపోతానేమో చెప్పడం...ఈ మధ్య మీ మేనత్తగారి మేనకోడలి మొగుడు కనిపించి ఏం చేస్తున్నావోయ్ అంటే చెగోడీలు తింటూ భారతం చదువుతున్నానన్నాడు. నాకప్పుడు నవ్వొచ్చింది సుమీ. కాని మానాన్న ఎకరాలకి ఎకరాలు అమ్మేసి ఇడ్లీలు వండించుకు తింటూ ఓ పుష్కరం పాటు పురాణాలు చదువుతూ కూర్చోవడం గుర్తుకొచ్చి మౌనంగా అభినందించాను.

నిజానికి నేను చెపితే శంఖంలో పోసిన తీర్థం అవటం లేదుకానీ అక్షరజ్ఞానం కలవాడికి చదవడం కంటె పనేమిటె నిరుద్యోగము నిరుద్యోగం అని వీధుల వెంబడి దరిద్ర మొహంతో కాళ్లు అరగదీసి కోవటం కంటె రెండుపూటల భోజనం మానేసి అయినా సుబ్రహ్మణ్యంలా ఓ పుస్తకం కొనుక్కుని చదువుకునే జ్ఞానం ఈ తరంవాళ్ళ కొస్తుందనే నమ్మకం నీకుందా...ఊరికే నీ యిష్టం వచ్చినట్లు అంటావు నాకు ఈ నౌకరీ రానప్పుడేం చదివానో అంతే...ఆమాటా నిజమే లే. నిన్ను కట్టుకున్నాక రాత్రిపూట పుస్తకం విప్పనిచ్చావా? ఊరికే గుసగుస లాడతావు. దేవుడు అనుగ్రహించి నువ్వు పుట్టింటికి వెళ్లావు కనక మళ్ళీ నాలుగు పుస్తకాలు చదవగలిగాను.....లేచాడా......వాడూ. ...వెదుకుతున్నా...వాడు నీకొడుకు కాదేమిటే" ★



'మమత'
—చిత్రకారిణి: శ్రీమతి శ్యామసుందరీ దేవి.]

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘం

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 1958 జులై 1-వ తేదీ నుంచి 'బాలలసంఘం' స్థాపించాము. జులై 1-వ తేదీ నాటికి 15 సంవత్సరాలవయస్సు నిండని, ఐదేళ్ళ వయస్సుకు తక్కువ గాని ప్రతి తెలుగుబాలుడూ, బాలికా సభ్యత్వం పొందవచ్చు. సభ్యత్వానికి రుసుమేమీ చెల్లించవలసిన పనిలేదు. తెలుగు బాలబాలికలందరూ వెంటనే సభ్యులుగా చేరి సచిత్ర వారపత్రిక అప్పుడప్పుడు నిర్వహించే చిన్న చిన్న పోటీలలో పాల్గొని "సంఘం" ఆశయాలను జయప్రదం చేయడానికి సహాయపడతారని ఆశిస్తున్నాము.

### గమనిక

పదకొండు మొదలు 15 సంవత్సరాలవరకూ వయస్సుగలవారిని 'A' వర్గంగానూ, ఆరు మొదలు 10 సంవత్సరాల వయస్సువరకూ గలవారిని 'B' వర్గంగానూ విభజించడం జరుగుతుంది

## ముఖ్య విషయాలు

సభ్యులుగా చేరదలచిన బాలబాలికలు చేయవలసింది ఒకటే. దీనితోపాటు ఒక సభ్యత్వపు దరఖాస్తును ముద్రిస్తున్నాము అందులోని ఖాళీస్థలాలను మీ వివరాలతో జాగ్రత్తగా నింపి (కొట్టివేతలు, తుడుపులు వుండకూడదు.) ఆ అచ్చు దరఖాస్తును తిన్నగా కత్తిరించి కవరులో:

సంపాదకుడు,

ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రిక,

తంబుచెట్టివీథి, మద్రాసు-1.

అనే చిరునామాకు పంపాలి. కవరుమీద వెనుకవైపు "సచిత్ర వారపత్రిక బాలల సంఘం" అని స్పష్టంగా వ్రాయాలి. మామూలు కాగితాలమీద వ్రాసిపంపే దరఖాస్తులను స్వీకరించము.

ఒక్కొక్క దరఖాస్తుమీదా ఒక్కొక్క సభ్యుని, లేదా, సభ్యురాలి పేరుమాత్రమే వుండాలి. సభ్యత్వపు దరఖాస్తును సచిత్ర వారపత్రికలో సాధ్యమైనంతవరకు వారం వారం ప్రచురిస్తుంటాము.

సభ్యులుగా చేర్చుకున్నట్లు ఒక్కొక్కరి పేరా విడివిడిగా ఒక్కొక్క సభ్యత్వపు కార్డును పంపుతాము. ఆ కార్డుమీద సభ్యత్వ క్రమాన్ని సూచించే ఒక సంఖ్య వుంటుంది. ముందు ముందు సభ్యులు గాని, సంఘం గాని జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ సంఖ్యను ఉదహరిస్తూండడం జరుగుతుంది.

పదిహేనేళ్ళ వయస్సు పరిపూర్తికాగానే, ఆ తేదీతో బాలల సంఘంలో సభ్యత్వం దానంతటదే రద్దయిపోతుంది.

## లక్ష్యాలు

(1) సభ్యులుగా చేరే బాలబాలికలను ఆరుమొదలు పదేళ్ళవరకూ ఒక వర్గంగానూ, (B), పదకొండు మొదలు పదిహేనేళ్ళ వరకూ మరొక వర్గంగానూ (A), విభజించి ఉభయ వర్గాలకూ విడివిడిగా అప్పుడప్పుడు రెండురకాల పోటీలు నిర్వహించి ప్రథమశ్రేణిలో నెగ్గేవారికి మాకు తోచిన బహుమతుల నివ్వడం. (ఈ విషయంలో పోటీనిర్వహణకర్తలదే తుదినిర్ణయం)

(2) సభ్యులలో వారివయస్సుకు తగినట్లుగా రచనాసక్తినీ, పఠనాసక్తినీ, కళాభిమానాన్నీ యథాశక్తి పెంపొందచేయడం.

(3) చిత్రలేఖనం, నృత్యం, అభినయం, గాత్రం వీణ, వయొలిన్ మొదలయిన లలిత కళలలోనూ, వ్యాయామక్రీడలలోనూ ప్రత్యేక అభిరుచీ, ప్రవేశం కనబరిచే బాలబాలికలను బహుమతులద్వారానూ, తదితర విధంగానూ ప్రోత్సహించడం.

(4) ఏ ప్రాంతంలో నివసిస్తున్నవారైనప్పటికీ తెలుగు బాలబాలిక లందరిమధ్యా స్నేహ సమైక్యభావాలను పెంపొందజేయడం

(5) ఉన్నత పాఠశాలలలో చదివే విద్యార్థులకు ఉచిత విద్యార్థివేతనాలను బహూకరించడం (దీనికి సంబంధించిన వివరాలను ముందుముందు ప్రకటిస్తాము.)



---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**బాలల సంఘం**

[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
**A లేక B**

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

ఏండ్లు : నెలలు :

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు ....

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ....

ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీథి నెంబరు] ....

* చదువుతున్న తరగతి, లేక, ఫారము ; ....

పాఠశాల పేరు ....

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) ;

ఆర్యా :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొనప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958]

(సంతకము)

* పరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **3-9-58** | ఈ దరఖాస్తు **6-9-58** నాటికి మాకు చేరాలి |

# ★ కొందరు సభ్యుల పేర్లు ★

[ఆంధ్ర సచిత్రవారపత్రిక బాలలసంఘంలో సభ్యులుగా చేరినవారిలో మరికొందరి పేర్లను ఇక్కడ ప్రచురిస్తున్నాము.]

1. గద్దం భాస్కర తాయారావు (ఏలూరు) 2. కె. నిర్మల (బళ్లారి) 3. నిమ్మగడ్డ లలితాప్రసాద్ (విజయవాడ) 4. చక్రావధానుల కామాక్షి (నర్సాపురం ప|| గో|| జిల్లా) 5. శాస్త్రి ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (ఏలూరు ప. గో. జిల్లా) 6. నూకల లక్ష్మీ శశికుమారి (గుంటూరు) 7. మన్నవ వసంతలక్ష్మి (గుంటూరు) 8. దద్దనాల విమలాజానకమ్మ (బొమ్మిడి ప. గో. జిల్లా) 9. అవ్వారి లీలాసావిత్రి (గుంటూరు) 10. తుమ్రి కృష్ణకుమారి (గుంటూరు) 11. ముద్దుల శ్రీ మహాలక్ష్మి (విజయవాడ) 12. కంభంమెట్టు సోమసుందరసాయిబాబు (ఏలూరు ప. గో. జిల్లా) 13. గోవిందరాజు కామేశ్వరరావు (విజయవాడ) 14. పల్ల సత్యవతి కామేశ్వరి (కొవ్వూరు ప. గో. జిల్లా) 15. పతిరాజు వెంకట మారుతి రామారావు (ఏలూరు ప. గో. జిల్లా) 16. చల్లపల్లి సత్యనారాయణమూర్తి (విజయవాడ) 17. కానకంచి ఉమాదేవి (కొత్తపూరు, అనంతపురంజిలా) 18. కందుల విశాలాక్షి అన్నపూర్ణ (ఏలూరు) 19. పెళ్లేటి పట్టాభిరామిరెడ్డి (పేదూరు, నెల్లూరు జిల్లా) 20. పిలలమర్రి నాగమణి (రేపల్లె)

21. బూదూరి వెంకటేశ్వరులు (ఏలూరు) 22. ముద్దాలి పార్వతి (విజయవాడ) 23. కొండూరు వెంకట చినరామకృష్ణ (రాజాం, శ్రీకాకుళంజిల్లా) 24. మంత్రివాది రాధాకృష్ణ (తాడేపల్లి గుంటూరుజిల్లా) 25. గడియారం ఉదయభాను (మచిలీపట్నం) 26. గంధి సూర్యప్రభ (అనకాపల్లి విశాఖజిల్లా) 27. ముద్దుల వెంకటగోపాలరత్నం (ఏలూరు) 28. అవటపల్లి వెంకటసత్యనారాయణరావు (విజయవాడ) 29. యడవల్లి రామలక్ష్మి (ఏలూరు) 30. బొంతా వెంకటనరసింహమూర్తి (రాజాం శ్రీకాకుళంజిల్లా) 31. కల్లూరి విమలమ్మ (ముత్తుకూరు నెల్లూరు జిల్లా) 32. ఆర్. ఛాయ (విజయవాడ) 33. శివదాసం గౌరీశంకరయ్య (పేరాల చీరాల పోస్టు) 34. సూరిశెట్టి అహోబిల నారాయణరావు (కాకినాడ) 35. యేలూరి వెంకటశివరామకృష్ణరావు (ధవళేశ్వరం, తూ. గో. జిల్లా) 36. ఆత్రేయపురపు సీతాపతి (మడికి తూ. గో. జిల్లా) 37. ఎమ్. ప్రభాకరరావు (రాజమండ్రి) 38. తంగిరాల సీతారామమూర్తి (గుంటూరు) 39. మొదలి శ్రీరామప్రసాద్ (మద్రాసు) 40. మైలాబత్తుల ఫారెన్సు బెన్‌హర్ పాల్ (భీమవరం ప. గో. జిల్లా.

41. తడవర్తి శ్రీమన్నారాయణ (రేపల్లె (గుంటూరుజిల్లా) 42. తేజోమూర్తుల శ్రీరామమూర్తి (కాకినాడ) 43. కోట ఆళ్వారు (విజయవాడ) 44. చుండూరు పట్టాభి సీతారామ్ సాయినాధ్ (గుంటూరు) 45. జొన్నల సూర్యప్రకాశరెడ్డి (తెనాలి) 46. పులవర్తి సత్యనారాయణమూర్తి (అనకాపల్లి) 47. పూడిపెద్ది వెంకటరమణమ్మ (ఖర్గపూర్) 48. కోనేటి లక్ష్మీదేవమ్మ (తిరుత్తణి) 49 చిట్టూరి శ్రీరామమూర్తి (అనకాపల్లి) 50. మునుబోలు వరదరెడ్డి (గూడూరు) 51 మద్దాలి వెంకటలక్ష్మీనరసింహారావు (గూడూరు) 52. భాగవతుల కనకపద్మావతి (తుంగభద్రా డామ్ బళ్లారి జిల్లా) 53. కోడూరి పద్మిని (రాజమండ్రి) 54. గుంటుపల్లి వెంకట హనుమంతరావు (నరసరావుపేట) 55 కొంపెల భువనేశ్వరి (మదరాసు 21) 56. సయ్యద్ ఖాశింరజ్వి (సత్తెనపలి గుంటూరు జిల్లా) 57 అవ్వారి కామాక్షి (గుంటూరు) 58. అవసరాల అనూరాధ (అరకువాలీ విశాఖజిల్లా) 59. వి. వి. ఎల్. నరసింహారావు (బళ్లారి) 60. ఎస్. ఎజ్. బాషా (ఏలూరు)

61. బి. జి. భుజంగరావు (హైద్రాబాదు) 62. సుంకరపలి రాజేశ్వరరావు (బొబ్బిలి) 63. తోటలక్ష్మీ నాగేశ్వరమ్మ (వీరవాసరం, ప. గో. జిల్లా) 64. చెరుకూరి శివరామయ్య (ఆలమూరు) 65. గుత్తా వెంకయ్యచౌదరి (చాటపర్రు) 66. చావలిశర్మ (ధూళిపూడి) 67. గణపవరపురవీంద్రనాథ టాగోర్ (విజయవాడ) 68. కె. సంతానం (తిరుపతి) 69. అరవ శ్రీరామచంద్రమూర్తి (మచిలీపట్నం) 70. వేముగంటి తిమ్మాయమ్మ (విజయనగరం) 71. సీతంరాజు సుబ్రహ్మణ్యచక్రధర్ (ఏలూరు) 72 అమరవాదిశేషాద్రిప్రభాకర్ (పొద్దుటూరు) 73. ఎన్. లక్ష్మి (ఏలూరు) 74. సీతంరాజుజయభాగ్యలక్ష్మి (ఏలూరు) 75. పూడిపెద్ది బాలసుబ్రహ్మణ్యం (ఖర్గపూర్) 76. గార భారతమ్మ (వేణమ్మపేట శ్రీకాకుళంజిల్లా) 77. బలిరిశెట్టి వెంకటరత్నం (తాడేపలి గుంటూరుజిల్లా) 78. మల్లాది అన్నపూర్ణ (గుంటూరు) 79. వడకుదిటి మల్లికార్జునరావు (విజయవాడ) 80. తొటకూర రాఘవేంద్రరావు (పడమట క్రిష్ణాజిల్లా)

81. చుండూరి వసంతభాను (పెదపూడి తూ. గో. జిల్లా) 82. పాకం సత్యనారవిఠల్ ప్రసాద్ బాబు (బందరు) 83. గొల్లపూడి సురేష్‌బాబు (కొలకలూరు గుంటూరు జిల్లా) 84. చక్రావధానుల కాంచన (నర్సాపురం ప. గో. జిల్లా) 85. బత్తిన లక్ష్మీనరసమ్మ (రాజమండ్రి) 86. దేశిరాజు వెంకట అప్పారావు (గుంటూరు) 87. కనుమా సావిత్రీదేవి (అమలాపురం) 88. కంభంమెట్టు విజయశ్రీ (కొయ్యలగూడెం ప. గో. జిల్లా) 89. చాపలమడుగు రమాదేవి (రామానగరం, క్రిష్ణాజిల్లా) 90. కామర్సు నాగేశ్వరరావు (తణుకు ప. గో. జిల్లా) 91. గురుజాడ రాజ్యభారత సీతాలక్ష్మి (విజయనగరం) 92. పిలలమర్రి వెంకటభానుమూర్తి (రేపల్లె గుంటూరుజిల్లా) 93. అద్దంకి కామేశ్వరరావు (పిఠాపురం తూ. గో. జిల్లా) 94. (పోతూరి క్రిష్ణమూర్తి (కోడూరు, విశాఖ జిల్లా) 95. పానుగంటి రామారావు (మదరాసు) 96. వడ్డాది రామప్రసాదరావు (ఇచ్ఛాపురం, శ్రీకాకుళంజిల్లా) 97. పట్టిసపు విజయలక్ష్మి (మద్రాసు) 98. పరిమి విశ్వనాథశాస్త్రి (గంగవరం, గుంటూరు జిల్లా) 99. సింహాద్రి సుభాస్ చంద్రబోస్ (బందరు) 100. అడివి వెంకటశివప్రసాద్ (విజయవాడ).

101. వంకాయలరామం (ఇమ్మిడి వరప్పాడు, తూ. గో. జిల్లా) 102 వై. కృపావతి (నల్లకుంట, హైదరాబాదు) 103 బుస్సీ సోమేశ్వరరావు (బరంపురం, గంజాంజిల్లా) 104. అలాసె గిరీష్ బాబు (అనకాపలి) 105. మండవెంకట జానకిరాం ప్రసాద్ (న్యూఢిల్లీ) 106. ఎన్. జి. శ్రీధర్ (హిందూపూర్, అనంతపురంజిల్లా) 107. మైలవరపు హనుమంతరావు (రాజాం శ్రీకాకుళంజిల్లా) 108. టి. ఇందిరారాణి (సికింద్రాబాదు) 109. కంచర్ల గిరిజాశంకర్ (ఉప్పులూరు క్రిష్ణాజిల్లా) 110. మారిశు అరుణ (తిరువూర్, క్రిష్ణాజిల్లా) 111. చెరుకువాడ లక్ష్మీకాంతమ్మ (యండగండి, ప. గో. జిల్లా) 112. తాడేపల్లి సంపూర్ణకరుణ (మందపల్లి క్రిష్ణాజిల్లా) 113. దామోదర రాధాగోపాలకృష్ణదాసు (కోట, నెలూరుజిల్లా) 114. గుంటూరు జానకీదేవి (నున్న, కృష్ణాజిల్లా) 115. చాడ సుబ్రహ్మణ్యేశ్వరశర్మ (కాకినాడ) 116. కుమ్మరశెట్టి గోపాల

రావు (కాకినాడ) 117. లక్కరాజు రమాభానుమతి (సత్యనారాయణ అగ్రహారం గుంటూరుజిల్లా) 118. ఎర్రాప్రగడ బాల కామేశ్వరి (పాళర్లపూడి తూ. గో. జిల్లా) 119. పోతకూచి సత్యనారాయణ వర ప్రసాద్ (రేపల్లె గుంటూరు జిల్లా) 120. రావు వెంకటస్వరాజ్యలక్ష్మి (చింతపల్లి, విశాఖజిల్లా)

121 ఎస్. జి. ఉమ హిందూపూర్, (అనంతపురంజిల్లా) 122 అన్నవరపు సుగుణ సుశీల భారతీదేవి (తెనాలి గుంటూరు జిలా) 123 గొతిపాటి శ్రీమంతరావు (కపిలేశ్వరపురం తూ. గో. జిల్లా) 124. శిష్ట్ల వెంకట లక్ష్మణరావు (కాకినాడ) 125. బొడ్డు సూరప్పారావురాణి (పెద్దాపురం తూ. గో. జిల్లా) 126. ఎలాప్రగడ సుబ్రహ్మణ్య పుండరీకాక్షుడు (రాజమండ్రి) 127 కొండవీటి లక్ష్మి ప్రసాదరావు) ఏలూరు ప. గో. జిల్లా) 128 ఎస్. కమలాకరలక్ష్మి (వాకతిప్ప, తూ. గో. జి.) 129. ఎస్. విజయశ్రీ (కర్నూలు) 130. ఇవటూరి ప్రసాదరావు (బరంపురం గంజాం జిల్లా) 131. పాటపిరెడి చిన సన్యాసిరావు (ఆలమూరు తూ. గో. జిల్లా) 132. తాళ్లూరిచిన కామేశ్వరి (పెద్దాపురం, తూ. గో. జిల్లా) 133. బులుసు సురంజనీదేవి (బొబ్బిలి) 134. ఎస్. లావణ్య (నెల్లూరు) 135. దశిక సుబ్బలక్ష్మి (విశాఖపట్నం) 136. కొంతి సీతామహాలక్ష్మి (చానమిల్లి, ప. గో. జిల్లా) 137. పులుగుర్తి కామేశ్వరరావు (దాక్షారామం తూ. గో. జిల్లా) 138. వేపాపార్వతి (కొత్తపేట) 139. ఎస్. శ్రీరాంరావు (ఎల్కతుర్తి కరీంనగర్ జిల్లా) 140. వంకా సుబ్బారావు (రాజమండ్రి)

141. టి. సత్యవాణి (చేబ్రోలు, తూ. గో. జిల్లా) 142. పి. సి. రాజగోపాలకృష్ణ (కాకినాడ) 143. యలవర్తి కృష్ణకుమారి (కేసరి, శ్రీకాకుళంజిల్లా) 144. ముదిగొండ ఇందిరసుప్రభా (తోటరావులపాడు, కృష్ణా జిల్లా) 145. మల్లాది సావిత్రి (హైదరాబాదు) 146. వబిలిశెట్టి రత్నమాల (భీమవరం ప. గో. జిలా) 147. శారద (కాకినాడ) 148. శ్రీకృష్ణకుమారి (చింతకుంట కరీంనగర్ జిల్లా) 149. వెలువోలు జగదీశుబాబు (తెనాలి గుంటూరుజిలా) 150. గుమ్మలూరు అప్పలసూర్య నృసింహేశ్వర వైదేహి (న్యూఢిల్లీ) 151 ఇవటూరి వీరభద్రరావు (విజయవాడ) 152. ఎ. ఇందిరారాయ్ (హైదరాబాదు) 153. మొగిలిసెట్టి మెహర్ శోభ (భద్రాచలం తూ. గో. జిల్లా) 154. వేతవోలు వెంకటసత్యమహాలక్ష్మి (కొవ్వూరు ప. గో. జిల్లా) 155. పి. రాఘవులు (భోనగిర్, నల్లగొండజిల్లా) 156. శెట్టిపల్లి మురళీధరరావు (సంగం జాగర్లమూడి, గుంటూరుజిల్లా) 157. డి. వెంకట సోమసుందరి (మద్రాసు) 158. కృష్ణ నాగేశ్వరరావు మద్రాసు) 159. దర్భా సుబ్బారావు (కాకినాడ తూ. గో. జిల్లా) 160. ఎ. ఉమారాణి (సంగారెడ్డి మెదకుజిల్లా)

161. చెరువు సూర్యనారాయణమూర్తి (కొండాపురం. శ్రీకాకుళంజిల్లా) 162. వరహారి వరలక్ష్మి (కర్నూలు) 163. గరిమెళ్ళ వెంకటరమణయ్యరాజా (చోడవరం, విశాఖజిలా) 164. జిన్న లక్ష్మణ (హైదరాబాదు) 165. కందిబండ రామమూర్తి (సూర్యాపేట, నల్లగొండజిల్లా) 166. అందవోలు హనుమంతరావు (సంగారెడ్డి మెదక్ జిల్లా) 167. అడిదం రామకృష్ణ (హైదరాబాదు) 168. ఇంగువ జనార్దనశర్మ (గుంటూరు) 169. ఎ. వి. కె. జోగేశ్వర శాస్త్రి (పెద్దాపురం, తూ. గో. జిల్లా) 170 పొన్నూరు ధనలక్ష్మి (తెనాలి, గుంటూరు జిల్లా) 171. బొడ్డు పిచ్చిరెడి (రాచూరు, ప. గో. జిల్లా) 172. వబిలిశెట్టి విజయజగన్నాధగుప్త (భీమవరం, ప. గో. జిల్లా) 173. కొత్తూరి పూర్ణచంద్రరావు (తెనాలి, గుంటూరుజిలా) 174. ఎమ్. ఎస్. కె. ఎస్. శర్మ (గుండుగొలను, ప. గో. జిల్లా) 175. అకునుమిల్లి జితేంద్రనాథ్ (బందరు) 176. కె రాజరాజేశ్వరి (చీరాల, గుంటూరుజిల్లా) 177. తుమ్మలపలి ఉమాదేవి (కడప) 178. తూనిభొట మార్కండేయశాస్త్రి (బందరు) 179 కొడాలి సుభాస్‌చంద్ర ప్రసాద్ (పొతునూరు, ప. గో. జిల్లా) 180. పేరి కనకదుర్గాదేవి (విజయవాడ)

181. అయ్యగారి సుందరలక్ష్మి (హుబ్లీ మైసూరు) 182. పోలురమాదేవి (నెల్లూరు) 183 ఎస్. అబ్దుల్ ఖాదర్ (వెంకటగిరి టవున్ నెల్లూరుజిల్లా) 184 చోడవరపు ఆనందకుమార్ (ఏలూరు) 185 మాకేటి రత్నకుమారి (బందరు) 186 పాలంకి కృష్ణకుమారి (నర్సాపురం ప. గో. జిల్లా) 187 తియ్యగూర మల్లేశ్వరీరెడ్డి (కలకత్తా) 188 రాళ్ళపల్లి సన్యాసిరావు (నాగరాజుపేట, కడపజిల్లా) 189 అనంతాత్ముల సుబ్బారావు (మాచర, తూ. గో. జిల్లా) 190 బొడ్డపాటి వేదాద్రి నరసింహారావు (హైదరాబాదు) 191 కొగంటి విజయకుమార్ (తెనాలి, గుంటూరుజిల్లా) 192 పినపాల హరకుమార్ (గుంటూరు) 193 అమాం సూర్యనారాయణరావు (విజయవాడ) 194 శ్రీగిరిరాజు మధుసూదనరావు (గుడివాడ, కృష్ణాజిల్లా) 195 ఆనాల సుబ్బారావు (సాలూరు, శ్రీకాకుళంజిల్లా) 196 ఎస్. ప్రభాకరరావు (కొన్నె, వరంగల్ జిల్లా) 197 దయితా గుణసుందరి (గుంటూరు) 198 క్రొా సత్యనారాయణ (యలమంచిలి, విశాఖజిల్లా) 199 పి. సర్వలక్ష్మి (విశాఖపట్నం) 200 గంటా వెంకటరావు (సోమిదేవరపాలెం,) తూ. గో. జిల్లా).

201. ఇంకూలు రామారావు (పార్వతీపురం (శ్రీకాకుళం జిల్లా) 202 కుప్పిలి ఆర్యమాల (గుణుపురం కోరాపుట్టిజిల్లా) 203 కాకుళవరకు వెంకట సత్యహాయగ్రీవమూర్తి (హైదరాబాదు) 204. వి. రాజగోపాల్‌రావు (విజయవాడ) 205. యల్లంశెట్టి లక్ష్మజ్ఞానేశ్వరి (విజయనగరం) 206. గాడి జగన్ మోహిని (కాకినాడ) 207. వాడ్రేవు కాశీ అన్నపూర్ణ (పామేశ్వరం, తూ॥ గో॥ జిల్లా) 208 పన్నాల శ్రీరామచంద్ర (నిడదవోలు, ప: గో. జిలా) 209. కె. పావనీదెవి (నరసన్నపేట), శ్రీకాకుళంజిల్లా) 210. తిలువర్తి విశ్వేశ్వర రామలింగనాగరాజ భూషణం (అనపర్తి. (తూ. గో. జిలా) 211 మేడూరి వెంకటనాగప్రసన్న (కోట, కర్నూలుజిలా) 212 ఎస్. సి. కృష్ణమాచార్యులు (కర్నూలు) 213 ముండపాక శ్రీరామశర్మ (జంషెడ్‌పూర్) 214. చింతా జగన్నాధరావు (గజపతినగరం, విశాఖజిల్లా) 216. పొన్నలూరి లక్ష్మీపతిరావు (తిరుపతి) 216 ఉప్పులూరి వెంకటలక్ష్మి సత్యనారాయణమూర్తి (విజయవాడ) 217. పి. ఎమ్. రామకృష్ణశాస్త్రి (మద్రాసు 1) 218. చిర్రాపూరి విశాలాక్షి (న్యూఢిలీ) 219. కప్పల గోతియ్య (పెంటపాడు, ప. గో. జిల్లా) 220. జి లక్ష్మీనరసింహారెడ్డి (సిరిసిల్లాగోడ్, కామారెడ్డి తాలూకా).

221. దశిక రుక్మిణీదేవి (హైదరాబాదు) 222. పసల వీణ (మద్రాసు) 223 జె. లక్ష్మణరావు (మదనపల్లి చిత్తూరుజిల్లా) 224 మంగు వెంకటసుభద్రాదేవి (నరసన్నపేట శ్రీకాకుళంజిల్లా) 225. జి. లక్ష్మీనారాయణ (కామారెడ్డి) 226. అరిమండ శివనాగేంద్రారెడ్డి (రంగనాయకులపేట) 227 చుండూరి రామలక్ష్మి (తణుకు ప. గో. జిల్లా) 228. యడవలి రామకృష్ణ (కటక్) 229. మందుల రమేశ్ (కామారెడి నిజామాబాద్ జిల్లా) 230. ఇందర్‌కరణ్ (హైదరాబాదు) 231. అల్లాడి రాజేంద్ర (నెల్లూరు) 232. బి. నాగయ్య (కామారెడ్డి నిజామాబాద్ జిల్లా) 233. చర్ల సూర్యప్రకాశరావు (పిఠాపురం తూ. గో. జిలా) 234, సుంకర స్వామిబాబు (రాజమండ్రి) 235. గోగులపాటి వెంకటసుధాకర్ (కర్నూలు) 236.

(48-వ పేజీ చూడండి)

# ఆకాశరామన్న ఏవేయి?

భద్రాచలానికి తనను బదిలీ చేశారని విన గానే సీతాపతికి ప్రాణాలు పోయినంత పనైంది. బదిలీని తప్పించుకోడానికి చేయ గలిగిన ప్రయత్నాలన్నీ చేసాడు. కాని పురుషకారం వీగిపోయింది. గ్రహచారం అజయ్యమైనది. చివరికి...ప్రభుత్వం తాఖీదుకు విధేయుడయ్యాడు సీతాపతి!

భద్రాచలం బదిలీఅంటే...సాధారణంగా ఏదో తప్పుచేస్తేనేగాని వేయరంటారు. అది పనిష్‌మెంట్ సెంటరట! భద్రాచలం అంటే, మరేం భయంకరమైన ప్రదేశం కాదుగాని, దూరప్రాంతమని, మన్యప్రదేశమని, ఒకభయం ఉద్యోగుల్లో పాతుకుపోయి ఉండచ్చు అనుకున్నాడు సీతాపతి. అయితే...తనను బదిలీ చేయడానికి తను చేసిన తప్పిదమేమయినట్టు?

ఈ బదిలీకి సంతోషం ప్రకటించింది సీతాపతితల్లి ఒక్కతే! "పోనీలేరా, నాయనా! అంతా భద్రాద్రి రాముడిదయ. ఈ ఘటం అక్కడ బుగ్గయితే చాలు. నా ప్రాణాలు అంతం అక్కడ ఉండికాబోసు!" అంది ముసలావిడ. సీతాపతి నవ్వాడు. నవ్వుతూ, అన్నాడు.

"నా చావుకేనట్ట...ఈ బదిలీ!"

సీతాపతితల్లి రెండు చెవులూ మూసుకొంది. "బాగుంది నాయనా నీవరస. ఇందుకేకాబోసు పెదవచదువు వెలగబెట్టింది. తప్పుకదూ! భక్తిఉంటే, ఎప్పటికయినా పయికివస్తావు. శ్రీరాముని దయఉంటే" అంటూ మందలించింది.

సీతాపతికూడా నాలిక కరుచుకున్నాడు. తనువెళ్ళేది పవిత్రమైన పుణ్యస్థలం. తనకా ఊరు తనమంచికే అయ్యిందేమో! అయినా శ్రీరాముని దయఉంటే, తనకు ప్రమోషన్ వెంటనే రావచ్చును. తనకు దాశరధీ కటాక్షం కంతతా వచ్చుకూడా!

సీతాపతి భద్రాచలంలో కాపురంపెట్టాడు. కాపురంపెట్టిన పదిరోజుల్లోపలే, సీతాపతితల్లి మంచంమీద పడిందుకుపోయి చలి పడుపుకు తట్టుకోలేక..."సీతాపతీ!" అని అస్తమానమూ పిలిచేది.

ఇంట్లో అందరినీ, పక్షపాతం లేకుండా, మన్యజ్వరం కౌగలించుకొని, పలకరించి చక్కిలిగింతలు పెట్టేది. సీతాపతిభార్య ఈ కషాయాలు అవీ తీయలేక, ఏక విసుక్కునేది. చాకిరీ తట్టుకోలేక బాధపడేది. చాకిరీతో, మన్యజ్వరంతో చిక్కి శల్యమయ్యింది. సీతాపతిమీద విసుక్కుంది: "ఈ మాయదారిఊరు తీసుకువచ్చారు. పిల్లలం... మేమూ చచ్చిపోతున్నాం. పెద్ద పెనవకు ఇంకా జ్వరంతగ్గలేదు." సీతాపతి బాధపడాడు. తాను కావలసివచ్చాడా? ఏం చేసాడు? ఇదంతా విధిత్రిప్పట! కష్టాలు వచ్చినప్పుడే ధైర్యంగా ఉండాలి. అదే

## వల్లూరి కృష్ణారావు

అన్నాడు..."నాకుమాత్రం ఇష్టమాలక్ష్మీ! ఏంచేస్తాం. గ్రహచారం. మనం చేయగలిగిందంతా చేశాం. విధి ప్రతికూలించినపుడు..." సీతాపతిభార్యకు అక్కజేవస్తుంది సీతాపతినిచూస్తే. ఏక విధి విధి అంటాడు! సీతాపతీ చూస్తూనే ఉన్నాడు పిల్లలంతా, ఎండిపోయి పరుగుల్లా అయిపోయారు. ఎంతడబ్బూ డాక్టరు ఫీజులకు చాలు!

సీతాపతి ఇంటిపరిస్థితి అధ్వాన్నంగా ఉందనుకున్నాడు. "ఈ ఊరు ఎప్పుడు వదిలిపోతామోగాని..." అన్నాడో లేదో సీతాపతితల్లి "అలా అనకనాయనా!" అని అంటుకుంది. సీతాపతి ఇంక ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఒకరోజురాత్రిసీతాపతిభార్యదొడ్లోంచి కెవ్వున కేక పెట్టింది. "ఏమయింది లక్ష్మీ!" అంటూ అరుస్తూ ఒక్కదూకులో దొడ్డిలోకి వెళ్ళాడు. సీతాపతి దొడ్డిగుమ్మంమీద సీతాపతి భార్యబోర్లాపడిఉంది. భర్తవంక బెదురుగా, దెబ్బతిన్న లేడిలాచూసి...అతి నింపాదిగా, నీరసంగా, "పాము" అంది. పాము చెవులకు భయపడికాబోలు దూరాన దొడ్డిఅవతలకు జరజరా, ఠీవిగా, ప్రాకిపోతున్న ఫణిరాజును చూశాడు సీతాపతి.

భార్యను లేవదీసి, ఇంట్లో మంచంమీద పడుకోపెట్టి పరిచర్యలు చేశాక, ఆమె భయాన్ని పోగొట్టడానికి ప్రయత్నిస్తూ, "లక్ష్మీ! ఈ ఊళ్లో పాములు కరవ్వు." అన్నాడు. సీతాపతిభార్య అంతమనిషీ లుంగచుట్టుకొని లేచింది ఒక్క విసురున. సీతాపతివైపు గుర్రుగా చూసింది. చూసి, దెప్పుతున్నట్లు,

"ఊహు!కరవ్వు, ముద్దుపెట్టుకుంటాయి!" అంది.

సీతాపతి మాట్లాడలేదు. సీతాపతిభార్య, ఆరోజు ప్రొద్దున్నే దాసి చెప్పగావింది, "ఈ ఊళ్ళో మాయదారి పాము లెక్కువండమ్మా! కాళ్లకు పెనవేసుకుంటాయి... తాడనుకుంటామా...అది పాము!"

దీనికితోడు సీతాపతిభార్య నాగరాజు ఆటపాటల్ని స్వాంతంగా చూసింది. దానితో సీతాపతిభార్యకు కొత్తజబ్బు వచ్చింది. ప్రతిరోజూ రాత్రి, అర్ధమం రెండుమూడు సార్లయినా, కెవ్వన కేక పెడుతుంది. ఏ తాడుముక్కను చూసినా, పామని భ్రమించి పెద గోడవచేస్తుంది.

సీతాపతికి రోజురోజుకూ మతిపోతోంది. హెడ్డాఫీసువాళ్లకి, తనకు బదిలీ కావాలన్నట్లు, రోజుకొక అప్లికేషన్ పెట్టుకుంటున్నాడు, తను పడుతున్న యమయాతనలను వివరిస్తూ. చెవిటివానికి శంఖనాదం వినిపించినట్లే. ఒకరోజున తానే బయలుదేరాడు. తోడుగా 'ముడుపుకుంక' కూడా ఉన్నాడు. ఏమీ లాభంలేకపోయింది. ఇంకా పోగా, ఆఫీసరు మందలింపులు మిగిలాయి.

"ప్రతీ వాళ్లూ ఇలా అంటే, భద్రాచలం ఎడారి అవుతుంది. ఇదొక అలవాటు అయిపోయింది. భద్రాచలంగురించి నాకు చెప్పక్కర్లేదు. నేను అక్కడ పదిహేను ఏళ్లు పనిచేశాను."

సీతాపతి ఇంక ఆఖరి అస్త్రం ప్రయోగించాడు...

"వీణ్ణి చూశారా!" అన్నాడు సీతాపతి. ఆ అనడంలో ఎంతో బాధ. దైన్యం ఇమిడి ఉన్నాయి. ఆఫీసరు ఆ కుఱ్ఱాణ్ని చూశాడు. అస్థిపంజరాన్నిగూర్చి పాఠం చెప్పవలసివస్తే వాణ్ణి చొక్కావిప్పి బల్లమీదనుంచోపెడితే ఉపాధ్యాయుడికి చాలా తేలిక.

(55 వ పేజీ చూడండి)




రాజు, ఆవలించి 'హేయ్ రాజ్' అనుకుని పడుకుని, అందమైన కలలు చూడడానికి "వారదిగా కళ్లు మూసుకుని పగటికలలు తయారు చేయడం మొదలు పెడుతున్నాడు. శ్రావ్యగానంలో అపశ్రుతిలా, చిక్కటి వెచ్చటి చీకటిలో హఠాత్తుగా వెలుగు వెలింది. ఆ ధాటికి అతని మేడలు అదిరి కలలు విరిగిపోయాయి. త్రుళ్ళిపడి 'ఎవరూ' అన్నాడు.

"నేనండి...అమ్మగోరు మిమ్మల్ని పిల తెమ్మన్నారు ఉపాయంపడుకోడానికి. బయ్యంగా ఉందంట" అంది పనిపిల్ల సాధ్యమయినంత నవ్వకుండా.

"సాయం! నేనూ?...ఏ అమ్మగారూ." అన్నాడు రాజు.

రాయుడుకూడా మేలుకున్నాడు. "ఏ అమ్మగారైతే మీకేమండి. ఆడది...అబల! నిస్సహాయురాలు. చీకటిలో ఒంటరిగా చలి భరించలేక సాయం పిలిస్తే వెళ్ళవంటారు... ఇదేం న్యాయం...మీకు ఎద లేదా? దయ లేదా?? లేపోతే రాదా??? లేదా సేవ లేదా? అన్నాడు అతను వీరావేశంతో.

రాజు విసుక్కున్నాడు. "నువ్వు కాస్త ఆగవయ్యా......ఎవరో పరాయి ఆడది గామోసు. ఏయ్ పిల్లా...ఇపుడు నిదరోస్తాం దిటా, కావలిస్తే పొద్దున్న వస్తారుటా, అందాకా ఆంజనేయదండకం చదువుకో అని చెప్పు. కావలిస్తే రాయుడు వస్తాడు. నువ్వు కూడా వుండు. ఇంకా భయమయితే" అన్నాడు.

ఆ పిల మళ్ళీ దక్కొచ్చి, "దవడ పల్లు ఊడగొడతా రంటండి" అంది.

"ఎవరివీ" అన్నాడు రాజు బద్ధకంగా.

"కనుక్కొత్తా నుండండి" అంది పిల్ల. అప్పటికి రాజు ఉలికిపడి 'ఏయ్' అని గర్జించి ఆపిల్లని ఆపాడు.

'ఎవరే మీఅమ్మగారు?'

'అక్కడదాకా వచ్చారన్నమాట అయ్యగారు. పిల్లాన్లోవ్! ఈ మొద వేషాలన్నీ నాకాడెయ్యమోక' అని కొత్తకంఠం వినబడింది.

'ఎవరీ ఆకాశవాణి' అని విస్తుపోయి తలెత్తిచూశాడు రాజు.

ఎదురుగా గుమ్మంమీద చీకటి ఇవతలగా వెలుగుకు అవతలగా, రెండింటికీ సరిహద్దుగా నిల్చుంది లక్ష్మీ వరసు. ఐశ్వర్యానికి ఔదార్యంలాఉన్న నల్లంచు తెల్లచీర కట్టుకుంది. చేతకానిదాని అబద్ధంలా పల్చగానూ ఎదటిమనిషి ప్రజ్ఞని అణగద్రొక్కేవాడి ప్రయత్నంలా నల్లగానూ ఉన్న ఆరండీ రవిక తొడిగింది. అమాయకత్వంలా తెలగావున్న కళ్ళకి నల్లటికాటుక పెట్టుకుంది. కాటుక చక్రాలమధ్య రెండుదీపాలు వెలిగించింది. అవి మరీ హైపవర్ లాంపులు కాకపోయినా కాటికమధ్య ఉన్నందువల్ల రాజుకి దివ్యజ్యోతుల్లా కనిపించాయి. పాండ్స్ క్రీంతో నిగనిగలాడుతున్న ఆమె ముఖానికిమరీబంగారంతో పోటీచేసేసోమతు లేకపోయినా, వెనకాలఉన్న చిక్కటి చీకటి, వెలుతురుమూలాన ఆచీకటికోచాయ తక్కువైనానల్లగా మెరుస్తున్న జుట్టూ కలసి యధాశక్తి ఆముఖాన్ని ఆకర్షణీయంగా చేస్తున్నాయి. మొత్తానికి, ఆడదాని తెలివితేటలమీద అట్టే నమ్మకంలేని బ్రహ్మచారి, ఓమోస్తరుగా వేసిన అసంపూర్ణ వర్ణచిత్రంలా ఉంది వరసు.

'నువ్వా' అన్నాడు రాజు.

'గాపకం వచ్చానా?'

'లేదు. సారీ...ఎక్కడో చూసినట్టుండి గాని—'

'వోర్నీ నాయనో! అప్పుడే కళ్లు నెత్తిమీనకెక్కినాయే...లచ్చివ్వరసునే మరిచిపోనావు...ఆ?' అని గదమాయించిందివరసు.

రాజుకి అంతా గుర్తొచ్చింది. వరసుని మరిచిపోయినందుకు ఒళ్లు భచ్చిపోయి నట్టయింది.

'నన్ను క్షమించు వరసూ...నన్ను క్షమించు. ఏదో ప్రొడక్షన్ హడావుడిలో మర్చిపోయాను. మనం అసలు తిరపతి వెళ్ళి పెళ్ళి చేసుకోవలసిందికదూ...మీబాబాయి కూడా—అన్నట్టు మీబాబాయేరీ?'

'వతాడు...నూటింకొల్లాడులే గాని...దా. అల్లో కూకుందారి. నువ్వేవేం సేసినావో అంతా సెప్పాలి దా' అంటూ ముందుకు వచ్చి రాజుని లేవదీసి తీసుకుపోయింది వరసు.

రాయుడు తెల్లబోయాడు. 'వోర్నీ బాబోయ్. మనవాడికి హీరోయిను గూడా ఉందే' అనుకుని.

'నాకు భయం వేస్తోంది. నీకు సాయం ఉండనా' అన్నాడు అందంబే ఉన్న పనిపిల్లని చూసి.

'పల్లు రాలగొడతాను...ఈ సారి ఒప్పురియో కనుక్కురావక్కలేదు బుల్లోడా' అని గిరుక్కునతిరిగి చక్కాబోయింది ఆపిల్ల.

* * *

హాల్లో, సోఫామీద వరసు తిల్లో పూల పరిమళం మధ్య, పల్చటిచీకటిమధ్య కూర్చుని గత రెండు రోజులూ తానెక్కడెక్కడి కెళ్ళాడో, ఏమేం చేశాడో చెప్పాడు రాజు. చెబుతున్నకొద్దీ, తన కథ అతనికే వింతగా కనబడుతోంది. అక్కడక్కడ అది తన కథ కాసే కాదన్న అనుమానం వేసింది. అనుమానం కలిగినపుడల్లా, ఈ సిరి, వరసు తనకు దక్కకుండా అంతర్థానం కావచ్చునన్న అధైర్యం పట్టుకుంది.

'నే నెవరు?...(రాజుని) నాకే దక్కొక్కడిది...(లక్ష్మీవరసు నవ్వుతుండగా)...ఎవరు చెప్పారు? (లక్ష్మీవరసు బాబాయి). వాడెవరు?...,

'వాడెవరు. అసలు మీ బాబా యెవరు? వరసూ' అని అడిగాడు రాజు. ఆ ప్రశ్న

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

చీకట్లో చాలాసేపు తారట్లాడింది.

'ఎవరైతే నేనేం' అంది నరసు అతని జుట్టును సముదాయిస్తూ.

రాజుకి ఆ ప్రశ్నకి జవాబు తెలుసుకోవాలన్న పట్టుదల సడలిపోతోంది. నరసు మెత్తని చేతులు సముదాయిస్తూ ఉంటే, ఆమె మెత్తని మాట ఉపశ్రుతిగా వినిపిస్తూంటే, మెల్లిగా కళ్ళు మూసుకుని తనకి యిష్టమైన కలలు అల్లుకోవడానికి మళ్లీ మొదలుపెడుతున్నాడు.

"బాబాయి అంటే మా బావే లే..." అంటోంది నరసు...

...బొంబాయికి ఇదివరకు చాలా డబ్బుండేది. నాటకాలవాళ్ళతో తిరిగేవాడు. నరసుతల్లి, ముత్యాలును చూసి ఒకప్పుడు సరదాపడ్డాడు. నాటకాల్లో వేషాలేయించి సినిమాల్లోకి ఎక్కించేస్తానన్నేవాడు. ఈ వైనం ముత్యాలు తమ్ముడికి తెలిసింది. ముత్యాల్ని పెళ్ళాడకపోతే, ఇతని డొక్క చీల్చిడోలు కట్టించి, ఇలాంటి 'యెదవ నాయాళ్ల' కథలను ఆ డోలుమీదే దండోరా వేయించాలని ప్రోగ్రాం వేసుకున్నాడు ముత్యాలు అన్నదమ్ముడు.

'దాన్ని కనక పెళ్లాడితే ఆస్తి యివ్వనని ఇతగాడి తండ్రీ, నూతిలో దూకుతానని తల్లీ ప్రకటించారు. తల్లిదండ్రుల కార్యక్రమాలకన్న, బావమరది దేకొంచెం ఎక్కువ యిబ్బందిగా ఉన్నందువల్ల నరసుతండ్రి, అప్పట్లో ముత్యాలును వెంటబెట్టుకు చెన్నపట్నం వచ్చేశాడు. ఐదేళ్ళు నానా అవస్థపడ్డారిద్దరూ. ఆనక తండ్రి హరీమన్నాడు, తల్లి ఇంకో నెల్లాళ్ళకి కళ్లుమూసింది. అప్పుడు, ఇతగాడు స్వగ్రామం వెళ్ళి ఇల్లూ వాకిలీ ఆస్తి చిక్కబట్టుకుని, పూటుగా డబ్బు చేత బట్టుకు చక్కా వచ్చాడు. దరిద్రంలో ఉండగా, ముత్యాలు చాలామంది మాటలు నిజమని...నమ్మేస్తోందని అనుమానం కలిగినందువల్ల ఆమెమీద అతని ప్రేమ దిన దిన ప్రవర్ధమానంగా పెరగలేదు. చేతికి డబ్బు వచ్చేసరికి అతగాడికి, ముత్యాలుమీద మనసు పూర్తిగా విరిగిపోయింది. బుద్ధిలేదు విశ్వాసం లేదు అని తనకితనే నచ్చచెప్పుకుని, చెన్నపట్నంలో రైలుదిగేసరికి మనసు ఖరారు చేసుకుని, అతను యింటికి వెళ్ళకుండా ఇంకో పేటలో సుభ్భరమైన యిల్లు తీసుకుని సినిమా తీసే వ్యాపారంలో దిగాడు. ఐదేళ్ళ దరిద్రం వల్ల, కష్టాలు అవమానాలూ పడినమీదట రాటుదేలాడేమో, డబ్బువచ్చిన మీదట తెలివిగా మనుష్యుల్ని ఉపయోగించుకోవడం అవసరం లేని వాళ్ళని వదుల్చుకోడం నేర్చుకున్నాడు. అతడు కొత్తింట్లో దిగిన నెల్లాళ్లకి, ముత్యాలు అతని ఎడ్రసు సంపాదించి, వెళ్ళి మొత్తుకుంది. అప్పటికి నరసు నాలుగేళ్ళ పిల్ల.

ఆమె దుఃఖాన్ని వ్యాఖ్యానించడానికి 60 వయొలిన్‌లూ, 600 క్లారియొనెట్‌లూ కూడా చాలవు. లక్షమంది ఎమ్మెస్ రాఘూరావులు అనరు...

'పిల్ల మొకం సూడు' అని కాళ్ళావేళ్ళా పడి ఏడిచింది.

'చూశాకనే ఈ నిర్ణయానికి వచ్చాను. అది నా కూతురు కాదు......నీకూ నాకూ ఋణం తీరిపోయింది...' అని దులిపేశాడు.

ముత్యాలుకు రోతపుట్టింది.

ఆ స్థితిలో మళ్ళీ తన తమ్ముణ్ని పిలిపించి మొగుడికి ఒళ్ళు హూనం చేయించాలని ఊహపోయినా ఛీ ఎందుకులే అనుకునేటంత అసహ్యం వేసింది.

తరవాత ముత్యాలు, మనసు రాయిచేసుకొని పిల్లని పెంచడమే తనకి ముఖ్యం అని నచ్చచెప్పుకుని, అందుకోసం తనకు చేతనైన పద్ధతిలో జీవితాన్ని వినియోగించుకుంది.

ఆమెని కాదని కాదని కాలదన్నిన, అబ్బికి కూడా రోజులు అంతబాగా కలిసిరాలేదు. అతడు వాటాకలిపిన సినిమా దివాళాతీసింది. అయితే తలకాయలు యథాశక్తి మార్చి, ఎలాగో అలా ఓ మేడా కారూ నిలుపుకునే తెలివితేటలు మాత్రం గడించాడు.

ముత్యాలు ముసలిదై, నరసు పెద్దదైంది.

ఓ రోజున, సినిమాలో వేషానికి నరసు కావాలని ఒక షాఫరుద్దీన్ వచ్చి ఆమెను కంపెనీకి తీసుకెళ్ళాడు.

నరసు తొలిసారిగా తండ్రితో మాట్లాడింది అక్కడే. అంతకుముందు చాలాసార్లు ముత్యాలు అతన్ని దూరంనించి చూపించి అదిగో ఆయనే నీ బాబు అని చెప్పింది. కాని దగ్గరకి వెళ్ళి పలకరించనివ్వలేదు. ఈసారి అనుకోకుండా ఈ దౌర్భాగ్యపు సన్నివేశం తటస్థపడగానే...నరసు నిలువెత్తున లేచిపోయి అతన్ని తిట్టిపోసి, ఆనక తల్లితో చెప్పేసింది. తండ్రి దాదాపుగా కూతురు కాళ్ళమీద పడ్డంతపనిచేశాడు. 'నేను మహాపాపిని, నాకు ప్రాయశ్చిత్తం లేదు' అనికూడా అన్నాడు.

నరసు, 'మా యమ్మని మళ్లీ తెచ్చి యింట్లో బెట్టుకో' అని ప్రాయశ్చిత్తం సూచించినా అతనికి నచ్చలేదు...

ముత్యాలుకీ నచ్చలేదు. "కాళ్ళరగ్గొడతాను...ఆడు ఈడకొచ్చినా, నువ్వాడకెళ్లినట్టు తెలిసినా" అంది కోపంగా.

'ఆడు ఈడకి' రాపోయినా నరసుమటుకు అడపాతడపా వెళ్ళి పలకరించి వచ్చేది. కొన్నాళ్లు, ఎవరైనా ఉన్నపుడు నరసుని పలకరించడానికి భయపడేవాడు తండ్రి. 'బాబాయ్ అని పిలవకు' అని సలహాకూడా యిచ్చాడు. కాని మెల్లిగా ధైర్యం తెచ్చుకొని ఆప్యాయంగా చూసుకునేవాడు కూతుర్ని. ఒకటి రెండు పత్రికలు వాళ్ల 'కథ'ను సీరియల్ గా రాయబోయాయి. 'డొక్క చీల్చేస్తాను' అని, చిన్నవాడు తన బావమరిదీ కట్టిన డైలాగుని ఆపేపరు వాళ్లముందర వల్లించి వెళ్లాడతడు. ఇది చూచి నరసూ భయపడింది. 'ఫరవాలేదమ్మా' అన్నాడు తండ్రి. ఫరవాలేకపోతే అడపా దడపా డబ్బిచ్చేవాడు. ముత్యాలు ఒప్పుకోలేదు.

'యాదవేషాలెయి మోక. డబ్బిత్తే చేదాయేం. వద్దంటానికి మనమేం సినిమాలో యేసాలం అనుకున్నావా?' అని నరసు తల్లిని కోప్పడింది.

ఈ నరసు ఆర్జన ఆరంభించాక హాయిగా ఆమెకే యిచ్చేసింది ముత్యాలు; గాణిగె వాక్యమినహా. వారంరోజులనాడు, నరసు, నరహాల రాజుకి ఆశ్రయం ఇచ్చిందని వినగానే, బాబాయి మండిపడ్డాడు. ఆనక, వాణ్ణొదిలెయ్‌మన్నాడు. నరసు వినలేదు. తన కథలాగే కూతురు బతుకూ భయంకరంగా అవుతుందని భయపడి 'ఎల్లుండి తిరపతెళ్ళి పెళ్ళాడెయ్యండి' అన్నాడు. తన విషయంలో ముత్యాలు చేసిన పొరబాటు కూతురు విషయంలో జరక్కుండా ఉండాలని...

మగతలో ఉన్న రాజుకి ఈ కథలీలగా వినిపించి, లీలగానే అర్థం అయింది. తనకి డబ్బెలా వచ్చిందీ అన్న అతని మొదటి ప్రశ్న ఇంకా చీకట్లోనే తారట్లాడుతోంది. అది తేలక అతను మథనపడుతున్నాడు. ఇపుడు నరసు కథ విన్నాక భయంకూడా వేసింది. జీవితం ఇంత గంద్రగోళంగా ఉంటుందని అతనికి నమ్మకం కలగకపోయినా అనుమానం వేస్తోంది. తన సిలుకుచొక్కా, పరుపూ, నరసూ, కారూ, సినిమా, డైరెక్టరు అన్నీ పోతాయేమోనని భయం వేసింది.

నరసు దగ్గరగా ఉండడం, ఆమె చెయ్యి తన చెంప నిమురుతూ ఉండడం మాత్రమే అతనికి నచ్చాయి. చుట్టూరా వెచ్చని చీకటి కొంచెం ధైర్యం కలిగిస్తోంది. ఇంకా తెల్లారాలిగదా. ఈలోగా ఏం జరగదు. అందాకా ఫరవాలేదు అనుకుని, మళ్ళీ పగటికలల ఉత్పత్తికి ఉపక్రమిస్తున్నాడు.

* * *

హఠాత్తుగా ఆ చిక్కటి వెచ్చటి చీకట్లో –

చెరువులో రాయిలా, నిశ్శబ్దంలో గావుకేకలా, దాంపత్యంలో ద్రోహంలా, అబద్ధంలో నిజంలా, దరిద్రంలో డర్బీస్వీప్‌లా, ఆకలిలో విరాకలా, మబ్బులో మెరుపులా, వీణాగానంలో తీగతెగడంలా, మామూలు పత్రికలో యుద్ధప్రకటన వార్తలా, మృత్యువులో జీవితంలా, స్నేహంలో వంచనలా ప్రభుత్వంలో కుట్రలా, ఈ ఉపమానాల గంద్రగోళంగా వికలిగా వింతగా భయంకరంగా సహజంగా అద్భుతంగా హఠాత్తుగా ఆ గదిలోపలి చీకటిలోపలి అతని ప్రశ్నకి జవాబులా నూరుకొవ్వొత్తుల వెల్తురు బద్దలయేసరికి రాజుకి ఒళ్ళు ఝల్లుమంది. గుండె గుభేలుమంది.

నరసు తుళ్ళిపడిలేచి, చీరసర్దుకొని నిలబడి, 'ఎవరది' అంది. (సశేషం)

సీరియల్ నవల......



...మూలం...

మానిక్ బంద్యోపాధ్యాయ

...అనువాదం...

మద్దిపట్ల సూరి



(గతసంచిక తరువాయి)

## 2

శశీ స్వభావంలో రెండు సుస్పష్టమైన విభాగాలున్నాయి. అతడిలో ఒకవైపున ఊహాశక్తి, భావోద్వేగం, రసావేశాలకేంతక్కువ లేదు. అలాగే మరోకవైపున సామాన్య సాంసారిక ప్రవృత్తి-సిరిసంపదలమీద ఆసక్తి కూడా సమృద్ధిగా ఉన్నాయి. అతడి ఆలోచనలుమాత్రం అతిరహస్యం. అవి పైకివ్యక్తం కావు. అతడితో ఎంతో సన్నిహితంగా ఉండేవాళ్ళకి తప్ప - అతడిలో కూడా జీవితపు సౌందర్యం - జీవితపు దౌర్భాగ్యాల విషయంలో సానుభూతిపూర్వకమైన ఆలోచనా పద్ధతి ఉన్నట్లు తెలియదు. అతడి తెలివితేటలు, సంయమనం, వివేచనాపద్ధతిమాత్రమే సాధారణంగా అందరికీ కన్పించేవి. లోకంలో మనటానికి అవసరమైన ఈ గుణాల్ని గురించే అందరూ శశీ అంటే భయభక్తులు చూపుతూంటారు.

శశీ స్వభావం ఒకవైపున తీర్చిదిద్దినవాడు అతడి తండ్రి గోపాలదాసు.

గోపాలదాసు వ్యాపారం - గొంతులు కోయటమే అని లోకులు అంటారు. కాని అతడు అసలు చేసేది అప్పులు ఇవటం - అమ్మటం - అప్పులివ్వటమే. అంటే కమీషన్ వ్యాపారం, వడ్డీవ్యాపారం అన్నమాట. ఒకప్పుడతడు మూడు నిండు ప్రాణాల్ని అమ్మి కమీషన్ కొట్టాడనికూడా చెప్పుకుంటారు - అంటే ముగ్గురు ముసలివాళ్ళకి పిల్లల్ని తెచ్చి కట్టబెట్టి అన్నమాట. అది ఈనాటి మాట కాదు. ఆ ముగ్గురు ముసలివాళ్ళలో ఇద్దరు చచ్చిపోయారు. ఇహ యామినీ కవిరాజ్ కూడా చచ్చిపోతే ఆ గాథ యావత్తూ చరిత్ర గర్భంలో అడుగున పడిపోతుంది. కాని యామినీ కవిరాజ్ భార్య - [శశీ ఆమెని 'సేన్‌దిదీ' అని పిలుస్తూంటాడు - అపురూపవతియైన ఆమె శశీ అంటే ఎంతో ఆపేక్షగా ఉంటుంది.]

అంత ఆదరంగా భర్త ప్రాణాల్ని కాపాడుకుంటూ రావటం చూస్తే యామినీ కవిరాజ్ ఇప్పట్లో చచ్చిపోయే సూచనలేం ఉన్నట్లు కన్పించవు. కాని యామిని మాత్రం చావుని కోరుకుంటూ ఉంటాడు. ఊళ్ళో అపవాదుల్ని వ్యాపింప చెయ్యటంలో ఉత్సాహవంతులైనపనీపాటూ లేని యువకులు కావలసినంతమందిఉన్నారు. ఎక్కడైనా రవంత వ్యత్యయం జరిగిందంటే చాలు-ఇహ ఊళ్ళో ఆడవాళ్ళనిగురించి వున్న అపవాదుల నన్నిటినీ దిగంతాల వరకు క్షణంలో చాటెయ్యగలరు. కొందరు విశ్వసిస్తారు, కొందరు విశ్వసించరు. విశ్వసించే వాళ్ళూ, విశ్వసించని వాళ్ళూ ఎవరూ అందులో నిజమెంతో-అబద్ధమెంతో ఆరాతీసి తెలుసుకోరు. విశ్వాసావిశ్వాసాల ప్రశ్న వారివారి సరదాలమీద ఆధారపడి వుంటుంది. ఊళ్ళో ఇలాంటి అపవాదు ఉన్న స్త్రీలలో సేన్‌దిదీపేరే ఎక్కువ వ్యాప్తిలో వుంది. చాలాతరవు గోపాలదాస్ పేరుతోనే ఆమెపేరుని జత చేర్చి చెప్పుకుంటూవుంటారు. లోకులు రకరకాల కథలు చెపుతారు. వాళ్ళని గురించి శశీ విశ్వసించడు కాని యామినీ విశ్వసిస్తాడు. మూడుకాళ్ళ ముసలి అతడు. అనుమానవిషం అతడ్ని దహిస్తూ వుంటుంది. భార్య ఇరుగుపొరుగు ఆడవాళ్ళ ఇళ్ళకు వెళ్ళినా, కోపంతో, దుఃఖంతో అతడు ఒక్కొక్కప్పుడు కావురుమని ఏడుస్తూ కూడా ఉంటాడు. కాయస్థులయింటికి పేరంటానికి వెళ్ళివచ్చానని సంజాయిషీ చెప్పినా నమ్మడతడు. కాని, సేన్‌దిదీ చెప్పే సంజాయిషీలో అసత్యం ఏమీ వుండదు. వెనుక ఎప్పుడైనా ఆమె ఏదయినా అన్యాయం చేసివుంటే, అది అప్పటి సత్యాసత్యాలు - పాపపుణ్యాలతో మిళితమైవుంది. ఉన్మాదులుతప్ప సేన్‌దిదీని మరెవరూ అనుమానించరు. ముసలివాడైపోవడంతో యామినీ కవిరాజ్ బుర్ర చెడిపోయింది.

గోపాల్ కన్పించాడంటే అతణ్ణి తిట్టిపోస్తూవుంటాడు-"వందీ రూపాయలు తీసుకుని నాకు మా దక్కని ఉపకారమే చేశావులే గోపాల్. నువ్వు సర్వనాశనమైపోతావ్ లే! నీ యిల్లు వల్లకాడుగాను" అని తిడుతూవుంటాడు.

'యామినీ కవిరాజ్ భార్యతో గోపాల్‌కి సంబంధం ఉన్నది' అన్నమాట బహుశా అబద్ధమే కావచ్చు. అయినా గోపాల్ మంచిమనిషి కాదు. వరకటి కోసి రూపాయలకోసమని బంగారబొమ్మలాంటి పడుచుపిల్లని యామినీ కవిరాజ్‌కి అంటకట్టాడు.

శశీ ఒక్కడే కొడుకు గోపాల్‌కి. కూతుళ్ళు మాత్రం ముగ్గురున్నారు. పెద్దకూతురిపేరు వింధ్యవాసిని. 'బజితా' గ్రామంలోని జమీందారు ఏకంటయాన శాఖ చరణ్ పెద్దకొడుకు కాకాన్‌కిచ్చి పెళ్ళి



# జీవనలీల



బెంగాలి నవలా సారస్వతంలో శరత్ బాబు పెట్టిన ఒరవడిని అధిగమించి, పురోగమించిన ప్రముఖ రచయితలలో మానిక్ బంద్యోపాధ్యాయ అగ్రగణ్యులు. సమకాలికసంఘజీవితాన్ని, ముఖ్యంగా బతుకుబండికిందపడి చితికిపోయే సామాన్య సంసారాల్ని చిత్రించే వీరి రచనల్లో విశాలమైన మానవాభ్యుదయ దృక్పథం స్పష్టంగా గోచరిస్తుంది. గత సంచికనుంచీ మా వారపత్రికలో సీరియల్‌గా వెలువడుతున్న "జీవనలీల"కు మాతృక "పుతుల్ నాచేర్ ఇతికథా". ఆధునిక వంగ సాహిత్యంలో సాటిలేని నవల అని సాహితీప్రియులు దీన్ని ప్రశంసించారు.

దామిని. మోహన్‌కి ఓ కాలు కుంటి. రెండో అమ్మాయి బిందువాసినిని కలకత్తాలోకే ఇచ్చాడు—బౌబజారులోని నందలాల్ అండ్ కో కి చెందిన నందలాల్‌కిచ్చి చేశాడు. గోపాల్‌కి అదో పెద్ద కీర్తి అని చెప్పవచ్చు.

నందలాల్‌కి జనపనార వ్యాపారం. నాలుగుచోట్ల కొన్న నారను ఒకచోట నిలవచేసి, అక్కడినుంచి ఎగుమతి చేసేందుకు వీలుగా మధ్యగా ఉండే ఊరేదయినా ఉంటే బావుండునని అన్ని ఊళ్ళూ చూసుకుంటూ ఏడేళ్ళ క్రితం ఈ ఊరు వచ్చాడు నందలాల్. గోపాల్ అతడిని తన ఇంటికి ఆహ్వానించి తీసుకు వెళ్ళాడు. అతడి కెంతో మర్యాదచేసి, ఇంట్లో వాడినిలాగానే చూశాడు. తర్వాత ఏదెలా జరిగిందో ఎవరికీ తెలియదు—ఓవేళ నందలాల్ వలనే తప్పు ఉంటే ఉండొచ్చు, ఉండకపోనూ వచ్చు మూడు రోజులు గడిచిన పిమ్మట—గోపాల్ చెప్పుచేతల్లో ఉండే గ్రామస్థులంతా కర్రలు పట్టుకు నిలబడి, బిందూని నందలాల్ కిచ్చి పెళ్ళిచేసేశారు. నందలాల్ నౌకరు రాత్రికి రాత్రి బాజిత్‌పూర్ పారిపోయాడు. మర్నాడు తన యజమానిని విడిపించుకోటానికి ఏకంగా పోలీసుల్ని వెంటపెట్టుకు వచ్చాడు. నందలాల్ తలుచుకుంటే అందరికీ అంతో యింతో శాస్తి చెయ్యగలవాడే. గంభీర విషణ్ణ ముఖంతో పోలీసుల్ని అతడే పంపించి వేశాడు. తర్వాత భార్యని తీసుకుని కలకత్తా వెళ్ళిపోయాడు; అంతే. ఇంక గాంవాదియా గ్రామంతో సంపర్కం ఏమీ ఉంచుకోలేదు.

ఏమయితేనేం—నందలాల్ దగ్గర బిందువాసిని సుఖంగా ఉండి ఉండవచ్చు. ఊళ్ళోవాళ్ళకి అక్కడి కబుర్లు సరియైనవేమీ తెలియవు. ఈ ఏడేళ్ళ మధ్య బిందు ఒక్కసారిమాత్రం పుట్టింటికి వచ్చి, మూడు రోజులుంది. ఊళ్ళో చిన్నలూ—పెద్దలూ ఆమెకేసి ఈర్ష్యగా చూశారు. మూలువానీ ఖాళీఅయినా లేకుండా ఆమె మెడనిండా నగలున్నాయి—అయినా ఒకవేళ బిందుకి సుఖం లేదేమో! నందుడికా వయసు చెల్లింది. అతడికి మరోక భార్య కూడా ఉంది. అతడి చరిత్ర కూడా అంత మంచిదయి ఉండదు. గాంవాదియా గ్రామంలోని ఆడపడుచుల్లో—ఒకకంట తడిపెడుతూ కాపురం చేసేవాళ్ళంతా—బిందు సుఖపడటం లేదని భావించుకుని తృప్తిపడుతూంటారు. కొంతమంది ఆ మాట పైకి కూడా అనేస్తూ ఉంటారు. అది గోపాల్ చెవిని పడ్డప్పుడు మాత్రం అతడు వాళ్ళని "ఒక్క దౌర్భాగ్యపు మూక" అని అనేస్తూ ఉంటాడు.

ఇలాంటి తండ్రి అదుపాజ్ఞల్లో పెరిగినవాడు శశి. కలకత్తా మెడికల్ కాలేజీలో చేరటానికి వెళ్ళేప్పటికి హృదయం సంకుచితంగానూ, ఆలోచనాశక్తి స్తబ్ధంగానూ, రసాస్వాదనశక్తి శూన్యంగానూ ఉండేవి అతడికి. భవిష్యత్తులో తన జీవితం ఎలా ఉండేదీ ఊహించుకున్నప్పుడతడికి ఊళ్ళో గృహస్థులందరూ ఎలా సంకుచిత జీవితాలు గడుపుతున్నారో—ఆ చిత్రమే కన్పించేది. కలకత్తాలో ఉంటున్నప్పుడు అతడి అనుభూతులకు మెరుగులు దిద్దినది పుస్తకాలూ—మిత్రులూ. వారిలో ఒక మిత్రుడి పేరు కుముద్. 'బారిసాల్' అతడిది. నల్లటి కోలముఖం—ఎవర్ని లెఖ్ఖ చెయ్యని స్వభావం. మధ్య మధ్య కవిత్వంకూడా రాస్తూ ఉండేవాడు కుముద్. సాధారణంగా కాలేజీకి వెళ్ళేవాడే కాదు. హాస్టల్లో—తన గదిలో పక్కమీద పడుకుని, ప్రపంచంలో ఉన్న బెంగాలీ—ఇంగ్లీషు నవల లన్నిటినీ చదివి పారేస్తూండేవాడు. వాటి నన్నిటినీ ఒంట జీర్ణించుకుని, ధర్మానికి—సంఘానికి, భగవంతునికి—పదహారేళ్ళ పడుచులకి విరుద్ధంగా నోటికి వచ్చినట్లలా వాగుతూండేవాడు. శశిదగ్గిర డబ్బు అప్పుతీసుకుంటూండేవాడు. శశి మొదట్లో ఆడపిల్లలాగానే కుముద్ ప్రేమలో పడిపోయాడు. అతడికి అప్పు యివ్వగలిగితే తాను కృతార్థుడైనట్లు భావించుకునేవాడు. కుముద్ మొదట్లో అతడికి అంత చనువు యివ్వలేదు, కాని ఎంతో కష్టపడి, అభిమానాన్ని చంపుకుని అవమానాన్ని సహించీ, చివరికి ఎలా అయితేనేం శశి అతడికి ఆత్మీయుడవ గలిగాడు.

అది సహజంగా ఇతరులను అనుకరించే వయసు. ఈ మిత్రుడి ఒక్కడి ప్రభావం వల్ల శశి పూర్తిగా మారిపోయాడు. శశి హృదయాన్ని ఇన్నాళ్ళూ గోపాల్ దుర్గంలో బంధించి, తలుపులకి సీళ్ళుకూడా వేశాడు. కుముద్ ఆ సీళ్ళను, తలుపులనూ పూర్తిగా పగలకొట్టలేకపోయిన మాట నిజమే అయినా—ఆ దుర్గంలోని కిటికీలు అవీ పూర్తిగా తెరిచేసి, లోపలికి కావలసినంత గాలిని, వెలుగును తీసుకురాగలిగాడు. చీకటి మురుగున ఉన్న మనస్సుకి బయట స్వేచ్ఛగా విహరించటం నేర్పాడు...

మొదట్లో శశి కొంచెం దిగ్భ్రాంతుడయినాడు. మానవుడు బుర్రంతా కరిగించి, బుద్ధి అంతా వెచ్చించి, జీవితాన్ని విస్తృతం చేసి ఇంత బ్రహ్మాండమైనదానినిగా చేశాడా? తెలుసుకోదగినవి ఇన్ని విషయాలూ, అనుభవించటానికిన్ని ఉపాయాలు సృష్టించాడా? విజ్ఞానాన్ని—కావ్యాన్ని మేళవించుకున్న ఇంత క్లిష్టమూ, ఇంత దుస్తరమయినదీనా మానవజీవితం! తర్వాత ఊళ్ళో ప్రాక్టీసు ప్రారంభించినపుడు మొదట్లో కొంచెం ఉక్కిరిబిక్కిరి అయినాడు. కలకత్తాలో ఉండగా మిత్రుడిపెళ్లి బాజాలా మోగిన జీవితం, ఇక్కడికి రాగానే చటుక్కున స్తబ్ధమైపోయింది. అశిక్షితులైన ఈ స్త్రీ పురుషులు, ఈ దొరువులు - చెరువులు, ఈ తుప్పలు - తుప్పలూ; వీటిమధ్య గడవాల్సిందేనా మిగిలిన జీవితం? అరిభగవంతుడా, ఓ పుస్తకభాండాగారమైనా లేదే ఈ ఊళ్ళో! క్రమక్రమంగా శశి మనస్సు కుదురుకుంటూ వచ్చింది. తానెటూ పల్లెటూరిబిడ్డ. పల్లెటూరి స్త్రీపురుషులమధ్య - ఆ నేలనే దొర్లి, అక్కడి నీటినే త్రాగి, ఆ గాలినే పీల్చి పెరిగినవాడు. తన హృదయం - మనస్సు వస్తుతః పల్లెటూరి ఫక్కీకి చెందినవే. బస్తీ తన మనస్సుమీద వేసిన ముద్ర సులభంగా చెరిగేది కాదు. ఏమయినా, అది ముద్రేగాని, మచ్చ కాదుగా. బస్తీ అలవాట్లు వీలైనన్ని ఉంచుకుని, మిగిలినవి విసర్జించేశాడు. కుముదుని దయవల్ల, పుస్తకాలచదువవల్ల పొందిన బృహత్తర ఆశయాల్ని, ఆకాంక్షల్ని క్రమక్రమంగా అతడు ఆలోచనల్లోనూ - ఊహల్లోనూ మాత్రమే ఉంచివేసుకున్నాడు.

పియానో కోయిలలు, ఎసెన్సు సూ

పసలు, పంకాల మందమారుతాలతో కూడిన ఆ వసంతఋతువు - సుదూరాన ఉన్న ఈ పల్లెటూరికి బహుశా ఎప్పటికీ రాకపోవచ్చు. అయినా శశి మనస్సును ఎవరు బంధించి ఉంచగలరు? బోలెడంత ప్రపంచం ఉంది. చాలినంత జీవితమూ ఉంది ఇంకా. ఇవాళ శశి కామినీ కుంజం ప్రక్కన పడకకుర్చీలో కూర్చుని. వెదురుటాకుల కదలికలలో మురికి గుంటమీదినుంచివచ్చే పిల గాలులకే ఉద్రిక్తుడవచ్చు! - తాను కాంక్షించిన జీవితం అతడిబల్లో పడిఉన్న పుస్తకపు రెండు బైండు అట్టల మధ్యనే ఇరుక్కుపోయి ఉండొచ్చు - కాని ఎప్పటికైనా - చుట్టూ చిన్న మదురుగోడఉన్న పూలతోట మధ్య ఎర్రపెంకుల బంగళాలో కూర్చుని, పంజరాల్లో కొనితెచ్చిపెటుకున్న పక్షుల కేరింతల్ని వినగలడు. ఏ మఖమల్ బ్లౌజ్ లో పలి హృదయమో-శశి హృదయానికి సన్నిహితమై స్పందితం కాకపోదు. అప్పుడిహ అతనికి సంగీతంలో - సంతోషంలో, ఆనందంలో - అభిజాత్యంలో ఎందులోమాత్రం వెలితి ఉంటుంది?

కాయస్థులవీధిలో మూడువందలదూరం వెళ్లాక అక్కడా ఉన్నది. శశి యిలు! హోరూయిలు ఆ వీధికి చిట చివర. అదే, ఆ హోరూ ఘోష్‌ది. కాలవ ఒడ్డున మర్రిచెట్టుకింద ఆనాడు అపరాహ్ణవేళ పిడుగుపడి చచ్చిపోయాడే, అతడిది...

మతికి జ్వరం తగ్గలేదు. సాయంత్రం శశి ఆమెని చూడటానికి వెళ్లాడు. ప్రొద్దుటినుంచీ శశికి తీరిక లేకపోయింది.

సందెవేళ హోరూ యింట్లో దీపం వెలగటంలేదు. హోరూ భార్య మోక్షదా-కోడలు కుసుమమీద చాలా కోపంగా ఉంది. "చూడండిది - సంసారంచేసే ఇల్లు - సందెపడింది. ఇంట్లో కోడలుంది, సందెదీపం మాత్రం పెట్టలేదు. ఎందుకు గొంతుకి ఉరిపోసుకుని చావరాదా కోడలు."

కుసుమ నీళ్ళకి వెళ్ళింది. తిరిగివచ్చి, బిందె దింపి, తాపీగా ఆ చీరవిడిచి, మరోచీర కట్టుకుంది. తర్వాత దీపం వెలిగించబోయింది. జంకూ-గొంకూ లేకుండా ఆమె చేసేజాప్యానికి మోక్షదాకి ఒళ్ళు మండుకొచ్చింది. కుసుమచేతిలోంచి దీపాన్ని లాక్కుని, వంటింటోకివెళ్లి, పొయ్యిలోని గోగుపుడకతో దీపాన్ని వెలిగించిందామె. తర్వాత గబగబా అవతలి వైపుకు వెళ్ళబోయి, ఎండి ఎండిఉన్న మెట్లాలో ఎలా పడిందో ఎవరికీ తెలియదు.

కుసుమ ఫక్కుమని నవ్వింది. తర్వాత ఇహ కొంగు నడుముకి బిగించి, మోక్షదాని ఎత్తుకు తీసుకెళ్ళి, ఆమె పడుకునే గది ముందు వసారాలో దింపింది. ఇరవై మూడేళ్ళయువతి-అందులోనూ పిల్లా జెల్లా లేనిది. ఆమె ఒంట్లో సత్తువశం తక్కువలేదు.

కొంతసేపటివరకు ఇంట్లో ఇహ చెవులుమూసుకు కూర్చోవలసిందే... మోక్షదా గొంతెత్తి శాపనార్థాలు పెట్టటం మొదలెట్టింది. చిన్నపిల్ల బూంచి ఏమిటో అని వచ్చి, ఆమెయేడుపు మాన్పించటానికి ప్రయత్నించింది. అటువైపు గదిలో మంచంలో పడిఉన్న బూంచీ పింతల్లి - లేచి కూర్చుని, ఆర్తకంఠంతో - "ఏమిటే అది? బూంచీ? ఒసేయ్ కుసుమా! ఏమయిందే? ఆరిదేవుడా! ఒక్కరూ పలకరేమ్రా?" అంటూ విలవిలలాడింది...

సావిట్లో చీకట్లో పడుకునిఉంది మతి. ఆమెకి దగ్గరగామాట్టాడే ఓపిక లేకపోయినా సాధ్యమైనంతదగ్గరగా "ఏమిటి? ఏంజరిగిందీ?" అని అడిగింది.

తొణక్కుండా ఉన్నది కుసుమఒక్కతే. కాసేపు మెదలకుండా వసారాక్రింద నుంచుని, ఆమె మోక్షదా రాగాలెట్టడం విన్నది.

తర్వాత వంటింటోకి వెళ్ళి, కాలుతూ కాలుతూఉన్న కట్టెఒకటి పట్టుకుని, ఆమె పడుకునే గదిలోకి వెళ్ళబోయింది.

మోక్షదా తన దెబ్బను, బాధనూ కూడా మరిచిపోయి, లబలబలాడింది.

"అదేమిటే? అయ్యయ్యో ఏమిటది? కొంప కాస్తా అంటిస్తావాయేం?" అన్నది.

"కొంప ఎందుకంటిస్తాను తియ్యా? దీపం ముట్టిస్తా."

"పొయ్యిలో కొరవి పట్టుకొచ్చి దీపం ముట్టిస్తావా? చూడు బూంచీ. చూడు. అప్రాచ్యరాలు వడికొప్పున చిచ్చుపెట్టటానికి బయలుదేరింది చూడవేతల్లీ చూడు!"

కుసుమ కళ్ళెర్రచేసి "ఇదిగో తిట్టొద్దు. వేవిధాల చెపుతున్నా, తిట్టొద్దు......" అన్నది.

మోక్షదా గొంతు తగించి, 'నిన్ను నేను తిట్టలేదమ్మ తల్లీ! బూంచీని తిట్టాను" అన్నది.

కుసుమ అంటే ఇంట్లో అందరికీ హడలే. ఈ ఇల్లూ-వాకిలీ తప్ప హోరూఘోష్ ఆస్తి యావత్తూ కుసుమ తండ్రిదగ్గిర ఏళ్ళనుంచి తాకట్టులోఉంది. ఒక్కసారి వెళ్ళి తండ్రి దగ్గిర కంట తడిపెట్టుకుందంటే చాలు, అతడు దావా అంటించి ఊరుకుంటాడు. అప్పుడు వీళ్ళగతి యేమవుతుంది? అలా అని కుసుమ ఈ యింట్లో అందరినీ బెదిరిస్తూ ఉంటుందనుకుంటారేమో-అదికాదు. పైగా అసలామె ఇలాంటివేమీ పట్టించుకునే రకంకూడా కాదు; ఎన్ని తిట్టిపోస్తున్నా యిప్పుడూ చెవినికూడా పట్టించుకోదు. తనపనేదో తాను చేసుకుపోతూ ఉంటుంది. తనిమీదికి మనస్సు పోకపోతే-దొడ్డిగుమ్మపు తాటితోపులోకి వెళ్ళి—కింద పడిఉన్న తాటి బొందులమీద కూర్చుంటుంది మెదలకుండా.

పొయ్యిమీది పప్పో ఏదో అడుగంటిపోతూ ఉంటుంది. ఆ మాడువాసన రావటంతో కుసుమ ఇంట్లో లేదన్న సంగతి అందరికీ స్పష్టంగా తెలిసిపోతుంది.

ఆమె తత్వం ఏమిటో ఎవరికీ అంతుపట్టదు. ఆమె ఎంతవరకు సహించి ఊరుకుంటుందో, ఎప్పుడు రేగిపోతుందో ఇప్పటివరకు ఇంట్లో ఎవరికీ అంతుపట్టకపోవటం పెద చిక్కుగా పరిణమించింది.

 

# జీవనలీల



"మీ కోడలికి కాస్త పిచ్చి ఉందనుకుంటాం, కాదుటమ్మా మోతుదా?" అంటూంటారు ఇరుగు పొరుగువాళ్ళు.

"కాస్తేం ఖర్మమమ్మా! పూర్తిగానే వుంది పిచ్చి. అసలు వాళ్ళది పిచ్చివాళ్ళ వంశమేగా! వాళ్ళ నాన్నకి పిచ్చి ఎత్తినప్పుడు సంకెళ్లు కట్టిపడేసి ఉంచలా" అనేది మోతుదా.

సావిట్లోకి వచ్చి కుసుమ దీపం వెలిగించింది. బుగ్గలు పూరించి అప్పుడే మూడు సార్లు శంఖం ఊది అక్కడ పెట్టింది. ఇంతలో మెల్లాలో శశి గొంతు విన్పించింది.

కుసుమ మతి పక్కదగరకివెళ్ళి— "సంజె పడిందో లేదో చూసిపోదామని వచ్చాడు మతీ!" అన్నదామెతో.

మతి రేమీ మాట్లాడలేదు. మళ్ళీ కుసుమ "ఇదిగో మతీ! వినపడటంలా? ఇంకా సంజె దీపం పెట్టామా లేదో అప్పుడే చూసిపోదామని వచ్చాడు. ఎంత అపేక్ష!" అన్నది.

కుసుమ ఓ పెద్ద కుర్చీపీట వలా అవలీలగా తీసుకెళ్లి వసారాలో వేసి, "జ్వరం తగ్గింది. నిద్దరోతోం దిప్పుడు" అన్నది.

"ఆఁ. మతి అప్పుడే నిద్దరోతోందా! ఇప్పుడేగా, దాని గొంతు విన్పించింది!" అన్నది మోతుదా.

"నువ్వు శంఖం ఊదిన ధ్వనికైనా మతికి నిద్ర మెలుకువ రాలా కుసుమా?" అంటూ శశి కుర్చీ పీటమీద కూర్చుని, సావిట్లోకి చూశా డొకసారి. "పరాన్ సాయంత్రం వచ్చి, ఈ పూట జ్వరం ఎక్కువయిందని చెప్పాడే!"

"ఆయన చెప్పింది అబద్ధం చినబాబూ! కాస్త కంగారుగా వుంది, అంతే. జ్వర మెక్కడ?"

"అర్థం లేకుండా వాగుతా వేమిటి? నువ్వు వంటింట్లోకి వెళ్ళు" అన్నది మోతుదా.

కుసుమ మారుమాట్లాడకుండా వంటింట్లోకి వెళ్లిపోయింది. ఆమె ముఖంలో వెలాకోళపు నవ్వూ లేదు. గాంభీర్యమూ లేదు.

"పొద్దున్నే మందు పంపించానుగా! తాగలేదూ అది?" అని అడిగాడు శశి.

"నాకేం తెలియదుబాబూ! పిల్లని మాత్రం కనిపెట్టుకుని ఉంటున్నాను అంతే" అన్నది మోతుదా.

కుసుమ వంటింట్లోంచి-"మందు తాగిందండీ, తాగింది. ఒట్టి అరుపులతో ఆ అమ్మాయి నిద్రందుకు చెడగొడతారూ!" అన్నది.

"నేను మందు తాగలేదమ్మా?" అన్నది మతి లోపల్నుంచి నీరసంగా.

మోతుదా కళ్ళెర్రచేసి వంటింటికేసి చూస్తూ-"చూశావా బాబూ! చూశావా! కోడలు చెప్పేది ఎంత పచ్చిఅబద్ధాలో?" అన్నది.

శశి చిరునవ్వునవ్వాడు. ఏమీ మాట్లాడలా. కుసుమ ఇలా అప్పుడప్పుడు ఉత్తినే అబద్ధాలాడుతూండటం అతడు గమనించాడు. పట్టుబడతామని తెలిసీ కూడా ఎందుకో ఆమె ఇలా అబద్ధాలుచెపుతూ ఉంటుంది. ఆమెకిదొక రకమైన పరిహాసం! నల్లగాఉన్న వస్తువుని తెల్లగా ఉన్నదని బుకాయించి, చాటుకు పోయి నవ్వుకుంటుంది.

శశి సావిట్లోకి వెళ్ళి "నీ కిప్పుడేమిటి బాధగాఉంది మతీ?" అని అడిగాడు.

తన బాధేమిటో తెలియదు మతికి. ఆమె ఉజ్జాయింపుగా "ఒళ్ళంతా నొప్పులు చినబాబూ! దాహం వేస్తూంటుంది" అన్నది.

పిన్నిని కుదుటపరిచి, బూంచి వచ్చి "ఇవాళ రోజల్లా తెగదగ్గింది చినబాబూ!" అని చెప్పింది.

చెవుల్లో గొట్టంపెట్టుకుని, మతి గుండెను పరీక్షించి చూశాడు శశి. ఈ పరీక్షంటే మతికి మాచెడ్డసిగ్గు. గుండె దడదడకొట్టుకుంటుంది, స్టెతస్కోప్ తీసి చెవుల్లో పెట్టుకుంటూ "ఊపిరి బిగపట్టమని ఎవరు చెప్పారు నీకు మతీ? గట్టిగా ఊపిరి పీల్చాలి" అన్నాడు. బూంచి లాంతరుఎత్తి పట్టుకుంది. శశి మతిముఖంకేసి చూశాడు.

పొగబారిన లాంతరుదీపం యొర్రరంగులో మతిరంగు కూడా కలిసిపోయినట్లుంది.

అడుగులు చప్పుడుకాకుండా-కుసుమ ఎప్పుడు వచ్చినుంచుందో - "అవిడకి గుండెల్లో ఏముంది? అంత పరీక్ష చెయ్యాల్సినంత ఏమొచ్చిందీ?" అన్నది...

"కొంచెం శ్లేష్మం పేరుకున్నట్లుంది కుసుం! నూనె వెచ్చచేసి కాస్త మర్దన చెయ్యి"

కుసుమ భయపడుతూ—"శ్లేష్మం మాట నిజమేనా చినబాబూ? ఆ పరీక్ష చెయ్యటం ధోరణీ అదీ చూస్తే నా గుండె దడదడలాడింది—క్షయ ఏమైనా పట్టుకుందేమో అని. ఇదుగో మతీ! చెప్పలా నీకు నేను? జ్వరంతో గాలిలోకి వెళ్ళి కూర్చోకు, వాతం కమ్మి ఛస్తావ్ అని చెప్పలా?" అంది.

శశి బయటికివెళ్ళి కాసేపు కూర్చున్నాడు. మోతుదా తానుపడిన సంగతి అంతా సవిస్తరంగా చెప్పింది. "కోడలే నన్నిలా చేసింది బాబూ! దీంతో చావుగా ఉంది నాకు," అన్నది గొంతు తగ్గించి. మోతుదా చాలా



"...ఎందుకొస్తారో ఇంతమంది జనం ఇలాంటి నాటకాలకి! నేను మాత్రం వచ్చినా కాను!"

# జీవనలీల

పేర్లు ఏవేవో గొణిగింది. హారీ చచ్చిపోయి ఏడు రోజు లయిందిప్పటికి. అరడి సంగతి యిలితే ఇప్పుడామె రాగాలెట్టటం మానేసింది. మాటిమాటికీ పమిట చెంగుతో కన్నీళ్లు మాత్రం ఒత్తుకుంది. మాట్లాడబోతే ఆమె గొంతు పట్టుకుపోయింది. భర్త దుఃఖంతో గద్గదమయిన కంఠంతో ఉండి, ఉండి ఆమె కుసుమని ఎన్నో అడి, అది వింటూంటే అంతా నిజమే నేమో అనిపించింది. బూంచి మొదలనుండా అంతావింది. ఏం మాట్లాడలేదు. బదులు కూడా చెప్పలేదు. కాదనీ ఖండించలేదు. వంటింట్లోంచి కుసుమ మాత్రం శశికి వినిపించేట్టుగా పాట కాల్లో పాటలు కూనిరాగాలు తీయటం మొదలెట్టింది. కుసుమ నిజంగా పిచ్చిదేనా యేం?

తర్వాత కుసుమ వంటింట్లోంచి బయటికి వచ్చి, ఎక్కడికి వెళ్ళిందో ఎవరూ ఎరగరు.

శశి కాసేపుండి వెళ్ళిపోయాడు. హారీ యిల్లు సరిగ్గా కాయస్థులవీధి చివర కాదు. అటూ యిటూ ఉన్న వంగతోట మధ్య నుంచి—ఓ మూడు బారలు ఖాళీగా ఉన్న స్థలందాటి రావాలి, ఆ వీధికి రావాలంటే...

శశి గబగబా ఆ దారినే వెడుతున్నాడు. కుడివైపున ఉన్న వంగతోట కంచె అవతలి నుంచి "చినబాబూ! మాట" అని పిలిచింది కుసుమ.

"నువ్విక్కడేం చేస్తున్నావ్? ఏ పామైనా కరిస్తే?" అన్నాడు శశి విసుపోతూ.

"పాములూ అవీ నన్ను కరవవు చినబాబూ! నాకు చావురానీ పెట్టలా భగవంతుడు" అన్నది కుసుమ.

శశి నవ్వుతూ — "అయితే మరి ఏమని రాసి పెట్టాడు పరాన్ భార్యకి?" అన్నాడు.

"పరాన్ పెళ్ళామని పిలుస్తున్నారా నన్ను? అలా పిలిసే నాకు మా చెడ్డకోపం వస్తుంది. అత్త—బూంచీ మేనత్త—ముందటేడు చచ్చిపోయిందే-ఆవిడ నన్నలాగే పిలిచేది-ఒకరోజున పట్టుకుని, నాలుగు తిట్టేశాను-"

"పోనీ నన్నూ తిట్టు రెండు"

"అలా అన్నానా? నేను మిమ్మల్ని తిడతానన్నానా చిన బాబూ? మీరు పూజ్యులు. మిమ్మల్ని పూజిస్తే పుణ్యం వస్తుందిమాకు." గబగబా నోటికి వచ్చినట్లల్లా ఎదుటివారిని ఉబ్బించే మాటలన్నీ మాట్లాడేసింది కుసుమ. అవి వింటూంటే శశికి బాగానే ఉంది. ఈ కుసుమ వైరితనం మళ్ళీ ఎన్నాళ్ళకి చూడగలిగాడు! సందర్భం లేని ఆమె మాటల్లో కూడా ఓ ఛందస్సులాంటి దేదో ఉంది.

"ఇంటికి వెళ్లు కుసుమా! అక్కడపొయ్యి

(42-వ పేజీ చూడండి)

# "గుత్తి వంకాయ కూరోయ్ బావా!"

నా జీవితచరిత్రకారుడి పనిని కష్టతరం చెయ్యడం నా కిష్టం లేదు. ఇప్పటికే ఆ వెర్రినాయన పడాలిసిన పాట్లు తలుచుకుంటే నాకు జాలేస్తుంది. అయినా అదంతా నా తప్పు కాదులెండి. నా జీవితమంటే మాటలా, మరి లక్ష వ్యాపకాలూ, కోటి ఘట్టాలతో క్రిక్కిరిసి కిటకిటలాడిపోయిన చరిత్ర. సాహిత్య రంగంలో నే నాక్రమించుకున్న స్థానం అల్లాంటిదైతే ఏం చెయ్యగలం చెప్పండి. పైగా నా అసలు కథ అల్లా ఉండగా నన్ను గురించిన అద్భుత కల్పనలూ, ఆ భాణకాలూ ఎన్నున్నాయనుకున్నారు? నేనంటే పడిచచ్చే పల్లికి గొప్పలు చెప్పుకుందుకు నన్నుగురించి కోసే కోతలు కొల్లలు. అభిమానం అల్లా చేయిస్తుంది లెండి. ఇంక నేను స్వయంగా పలికిన సూక్తులూ, చమత్కా-రాలూ లక్షలుండగా. జనం "కథకుడు గారువాచ" అని నా పేరు మీదుగా చెలామణీ చేసే సరుకు సవాలక్షుంది.

....ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే. నా జీవిత చరిత్రకారుడు నిర్వహించాలిసిన భారం అల్లాటప్పా వ్యవహారం కాదని తెలియ జేయడానికి. ఈ కల్లోల సముద్రంలా గందరగోళంగా పడిఉన్న సామగ్రిని పరిశీలించి. అసలునుంచి అబద్ధాన్ని. ఆణిముత్యాల నుంచి ఆలిచిప్పలనీ వేరుచేసి. నిసలైన చరిత్ర రాసే టప్పటికి గుడ్లు మీదకొస్తాయి. ఒస్తే ఏమంటా? నెగ్గుకొచ్చేదంటే. నిత్యమైన కీర్తి సంపాదించుకున్నాడన్న మాటే! అనాలనిపిస్తే బోస్వెల్‌ను వోన్ బొమ్మన గలిగాడన్నమాటే!

అల్లాని చెప్పేసి అతడిపనిని మరీ కల్లోలం చేస్తానా మరి? అందుకనే ఎక్కడి కక్కడికి నేనే నా జీవితాన్ని గురించిన విశేషాలు తీర్చిదిద్దినట్లు రాసి పడేస్తుంటాను, అతడికి పనికొస్తుందని. నా సాహిత్య జీవితానికి



సంబంధించినంతవరకూ నా ఉద్దేశాలూ, అభిప్రాయాలూ గట్రా రెండు పుస్తకాలలో రాసి పడెయ్యదలిచేను. "ఆధునిక పద్ధతిలో నేను కథలు రాయకపోవడానికి అరదస్తా కారణాలు." అన్న పుస్తకం పూర్తయింది. "అనగనగా కథలు రాయక పోవడానికి అరదస్తా కారణాలు" అన్న పుస్తకాన్ని రాయడం మొదలుపెట్టేను. ఇంక గృహజీవనం విషయంలో కూడా నా జీవిత చరిత్రకారుడికి సహాయపడడమే నా ఉద్దేశ్యం. నేనంటే పడిచచ్చే పల్లికు- ఈ విషయాలన్నీ తెలుసుకోవడానికి కుతూహలపడతారని నాకు తెలుసు. వాళ్లనెల్లా నిరాశా పూరితుల్ని చెయ్యను ! అందుకే, మొన్న నేను మా ఆవిడా ఎందుకు కలహించుకున్నామో, దానికి కీ. శే. బసవరాజు అప్పారావుగారెంతవరకూ బాధ్యులో, ఆవిజ వృత్తాంతాన్ని ఉంచడం మంచిదనిపించింది.

చెప్పేను కదూ, నా రెండో పుస్తకం రాసే ధోరణిలో ఉన్నానని. ఆవేళ ఆ ఆలోచనల్లో మునిగితేల్తున్నాను, ఏమిటీ అనగనగా కథలు ? ఓసారి అనగనగా ఈగ ఇల్లలుక్కుంటూ పేరు మరిచిపోయిందా? చివరికి గుర్రం కడుపులో పిల్ల చెప్పిందా ? భలే ! ఇంకోసారి అనగనగా రాజుకేడుగురు కొడుకులూ వేటికెళ్లి తెచ్చిన ఏడు చేపల్లో ఓ చేప ఎండలేదూ ? దానికి పెద్ద ఆరాలు తియ్యడమా ? ఏం ? పచ్చి చేప నేమీ చేసుకోలేరా ఏం? ఇల్లా ఆలోచిస్తూండగా మా ఆవిడ భోజనానికి పిలిచింది. బుర్రలో బ్రహ్మాండమయిన భావాలు తిరుగుతున్నాయి. నోట్లో మామూలుకంటె పసందుగా ఉన్న వంకాయకూర నలుగుతోంది. దాంతోటి మా ఆవిడ కూరని గురించి ఏమిటో చెప్తుతుంటే పరధ్యాన్నంగా ఉండి ఆలకించలేదు. ఏదో మామూలుగానే వంకలు చెప్తోందనుకున్నా.

"అయినా బాగుంది; భలేగా ఉంది." అన్నాను. మంచి తనానికి కాదు. నిజం కనుకనే అన్నాను. అయితే మాత్రం చూడండి. ఎల్లా లంకంటుకుందో !

"ఏమిటండి ఆ మాటలు ? కూరలో నా వలపంతా కూర్చి పెట్టినానోయ్ బావా ! అంటే అయినా బాగుందంటారు. వెళ్లండి !" అందావిడ, కళ్లనీళ్ల పర్యంతమై. విక్షేపంలాంటి పెళ్లాం ఉన్నట్లుండి కీ. శే. గారి "గుత్తి వంకాయకూర" గేయాన్ని నా మీదకి విసురుతుందని కలగన్నానా, చెప్పండి. ఆ మాటే అన్నాను. మరీ రెచ్చి పోయింది. సరే, అప్పైన అనునయాలూ, అభ్యర్థనలూ మొదలెట్టేను.

"చూడాసీ," అన్నాను. "ప్రేమెుందే... పిలవ్వీ... అప్పారావుగారేదో రాసేడనుకో. అయితేమాత్రం, ముఖాముఖీగా నిలబడి వంకాయకూరలో వలపుకూరేనంటా వేమిటే, వెర్రిదానా ! కొత్తరకం కారం కూరేనను, లేకపోతే, కొత్తరకంగా వండేనను. అల్లా అసలు సంగతేదో తెలిగించి చెప్పాలి !"

"చెప్పనిస్తే కదూ మీరు !" అందావిడ. "ఏదో మాట వరసకి మొదలెట్టేప్పటికి...."

మాట వరసలు పాట వరస నంటే, చూడెంత గొడవయిందో ! " అన్నాను నేను.

"మీరు అయినా, గియినా అని అడ్డురాకపోతే ఏ గొడవా రాకపోను," అందావిడ. "కొత్తరకం కారం కాదుగాని, కొత్తరకం వంటన్నది నిజమే. ఈవేళ నుంచి మనింట్లో వంటంతకీ డాల్డా వనస్పతి వాడకం ప్రారంభించేను. 'డాల్డా' పదార్థాలలోని అసలైన రుచిని బయటకు రప్పిస్తుందని రమణమ్మగారు చెప్తే, దాఖలా చూసి వచ్చి నేను వాడకం ప్రారంభించేను."

"ఆ మాట ఋజువు పరిచేవు." అన్నాను నేను. "చూడు, ఎంత పరధ్యాన్నంగా ఉన్నా, కూర రుచిగా, భలేగా ఉందని చెప్పుకున్నాను."

"చెప్పుకున్నారు లెండి." అని ఒప్పుకుంది మా ఆవిడ. "పైగా 'డాల్డా' ఆరోగ్యకరం. దాంట్లో నేతిలో ఉన్నంత 'ఏ' విటమిను పదార్థమూ, అదనంగా 'డి' విటమిను పదార్థమూ కలుపుతారు. పరిశుభ్రంగా సీలు వేసిన డబ్బాలలో అమ్ముతారు. 'డాల్డా' వాడకంలో ఆదా కూడా ఉంది."

"అయితే అన్ని వంటలకీ 'డాల్డా' వాడవచ్చునంటావా ? " అన్నాను నేను.

"ఆ ! పోపుల్నించి వేపడాలదాకా, పిండివంటి పిండివంటలదాకా, అన్ని వంటలకీ 'డాల్డా' వాడవచ్చును" అందావిడ.

"అయితే అదన్న మాట వాళ్లా చేపకి చెయ్యవలసినపని !" అన్నాను నేను, సంతోషంతో గంతేసి.

ఏం చేప ? అంటుంది ఆవిడ. ఇంకేం చేప ? రాజుగారి ఏడో కొడుకు ఎండలేదని ఆఘోరించేదే. ఆ చేపను దాన్ని 'డాల్డా'లో వండమని వంటలక్కకిచ్చి, ఆరుగురన్నగార్ల మీదా విజయం సంపాదించే దంటే, కథ అదో తమాషాగా నడుస్తుంది. ఎల్లా నడుస్తుందో నా పుస్తకం అచ్చయ్యాక అందులో చదవండి.



# మనిషిలాగా మనిషి

(నాటకం)

ప్రఖ్యా శ్రీరామమూర్తి

## రెండో అంకం:

### రెండోదృశ్యం: స్వప్నం

[తెర లేచే సరికి రంగస్థలం అంధకారంలో వుంటుంది. ఒకే ఒక్క లైటు రఘుమీద పడి ప్రకాశిస్తూ వుంటుంది. రఘు స్టేజిమధ్యలో నిలబడి వున్నాడు—]

రఘు: యస్. మిలార్డ్, నో మిలార్డ్! అవును—అంతే మిలార్డ్! ఇదినిజం, అవును అది నిజమే మిలార్డ్! ముమ్మాటికీ నిజమే! మే యిట్ ప్లీజ్ యువర్ లార్డ్ షిప్, మెంబర్స్ ఆఫ్ ది జూరీ! నేను నిజం చెపుతున్నాను!.. నా భార్యను నేను హత్యచేశాను! నా భార్య ప్రియుణ్ణి కూడా హత్యచేశాను! చేసినందుకు పశ్చాత్తాప పడటం లేదు మిలార్డ్!...

[ఇటు తిరిగి] ఇదుగో ప్రాసిక్యూటరు మహాశయా! అర్థం పర్థంలేని లేకిమాటలు మాట్లాడటం కోసం ఎందుకలా దాకలాగా నోరు తెరిచి శ్రమపడతారు?...

[మళ్ళీ అటుతిరిగి]ఐయామ్ సారీ మిలార్డ్. కాని ఈ విచారణ పూర్తిఅయిన మరుక్షణంలో నన్ను వురితీయించమని కోరే ఈ పెద్దమనిషితో నేను మర్యాదగా ఎందుకు మాట్లాడాలి చెప్పండి? అయినా నేనన్న దాంట్లో అమర్యాద యేముంది? అసత్యం యేముంది? నేను నిజమే చెప్తానని ప్రమాణం చేశాను. వున్నమాట అనకూడదంటారా? ఒకళ్ళు ఉలుకుతారని అబద్ధంఆడమంటారా? నే నాడిన మాట మీకు నచ్చకపోతే నే నేం చెయ్యగలను-లేకపోతే యేమిటండీ ఆ కారుకూతలు?

[తన లాయరు భుజంమీద తట్టినదానికి సమాధానంగా] మైడియర్ ఫెలో! కోపంవస్తే గంగలో దూకమనవయ్యా నాకేం?

[ప్రాసిక్యూటరువైపు తిరిగి] అవును - వినకాముందూ ఆలోచించక కళ్ళుమూసుకుని హరోం హరహర మహాదేవ అంటూ గంగలో దూకవయ్యా!

ఐ బెగ్ యువర్ లార్డ్ షిప్స్ పార్డన్. నేనేం కంట్రోలు తప్పడంలేదు. ఐనా ఇంతమంది పెద్దమనుషులు తీరిగ్గా కూర్చుని ఓవ్యక్తిని ఈలోకంనుంచి రవాణా చేసెయ్యడానికి కుట్రపన్నుతుంటే వాడు ఢిల్లీ దర్బారులో ప్రధానమంత్రిముందు మొఘమల్ సింహాసనంమీద కూర్చున్నట్లు హుందాగా కంట్రోల్ గా వుండటం ఇంపాసిబుల్. ఇంపాసిబులే కాదు. ఇట్-ఇట్ ఈజ్ రిడిక్యులెస్. ప్రాసిక్యూటరుగా రేదో కలవిస్తున్నారు?...నో. నేనెప్పుడూ ఢిల్లీదర్బారుకు వెళ్ళలేదు. అలా అని నే నన్నదాంట్లో లేదు.

మిలార్డ్! ఈ ప్రాసిక్యూటరుగారి ప్రవర్తన నాకేం బాగులేదు. ఎక్కడికక్కడ నన్ను దిగ్బంధనం చెయ్యాలనిచూస్తారేమిటి? అడుగడుక్కీ నన్ను బోల్తాకొట్టిద్దామనే? నేను దీనికొప్పుకోను, ఒప్పుకోను. మిలార్డ్!

నే నేం నోరూ వాయీ లేని తెలివితక్కువ మొతక దద్దమ్మను కాదయ్యోయ్ - కళ్ళెర్రజేసి గద్దించినంతమాత్రాన బెదిరిపోవడానికి! నేను మహాకరుకుమనిషిని - కరుకు - వినిపించిందా - మహాకరుకు! నీ నర్మగర్భపు మాటలు నేపడను - తెలిసిందా? నర్మగర్భమే- లేకపోతే ఏమిటా అతితెలివిమాటలు? ఇందాకటినుంచీ చూస్తున్నాను - నేను పరమ దుర్మార్గుణ్ణనీ మంచి అనేది నాలో కొంచెమైనా లేదనీ చూపిద్దామనేగా నీ ప్రయత్నం!

నేను కొత్త పిటీకివెధవననీ అహంభావిననీ నిరూపిద్దామనికదూ నీ ప్రయత్నం. ఢిల్లీ దర్బారు మహామెరక్కపోయినా అక్కడి కెళ్ళానని గొప్పలు చెప్పుకునే వెధవననికదూ నువ్వనటం? నే నెప్పుడూ ఢిల్లీదర్బారు కెళ్ళలేదు. ఆఖరికి ఢిల్లీకూడా పోలేదు. అంతగా ఢిల్లీ సంగతులు తెలుసుకోవాలని నా కనిపిస్తే మాయింట్లో నే ఈజీఛైర్ లో కూర్చుని ఏశంకర్స్ వీక్లీయో చూసుకోగలను!

[జనాంతికంగా తన లాయరుతో-]
ఎవడయ్యా ఈ వుడుకుమోతు బైతు!?
[జడ్జివైపు తిరిగి]

అఁ-మా లాయరుగారితో మాట్లాడుతున్నాను మిలార్డ్. నే నన్నమాట కోర్టంతా వింది? (వెకిలిగా నవ్వుతూ) అయామ్ సారీ. కాని, యువర్ లార్డ్ షిప్! ఇంతమంది పెద్దమనుషులముందు-పబ్లిక్ కోర్టులో నా పరువు ప్రతిష్ఠలకు భంగకరంగా అవృద్ధజంబుకం వేసే ప్రశ్నల్ని నే నిహ సహించను. యస్. మిలార్డ్! అసమర్థపు అప్రయోజకపు గబ్బిలం! నోటివెంబడి మాట పెగల్దు-అవల్ల కోటు సరిగ్గా తొడుక్కోవడం కూడా చేతకాదు - భాగయ్యలాగా నాలుగో కాజాలో ఐదోగుండీ! అసమర్థుడివి కాదూ? మా నాటకాల్లో లాయర్లకంటే కూడా అప్రయోజకుడివి నువ్వు!

[తన లాయరుతో జనాంతికం—]

అఁ!-వీణ్ణి ఇంతకుముందెక్కడ చూశానో జ్ఞాపకం వచ్చిందయ్యా! అవును! లోకల్ ట్రెయిన్ లో ఓ లేడీ సంగతి చెప్పాను జ్ఞాపకం వుందా—గిల్లిందని చెప్పాను... నేను వెనక్కు తిరిగి- 'ఏమిటే నీ వుద్దేశం?' అని గద్దించాను? అదే! అదే వీడు! ఆ జెరిసీ పెర

వని రింగులు తిరిగినజుట్టు-ఆనల్ల చీరె-ఎఱ్ఱ బోర్డరు జాకెట్టు- అప్పుడు పక్క పిన్నులు కూడా వున్నాయి. అదే వెనక ఇకిలింపు-పకిలిం ఏవట్లు మాటలు!

(బిగ్గరగా—)నువ్వెవరో నాకు తెలుసు! నీ సంగతంతా నాకు తెలుసు—తెలుసా? ఇంకా సిగ్గులేక ఇక్కడి కొచ్చి నామీద నేరాలు మోపుతున్నావా? ఎంత ధైర్యం! ఎంతసాహసం! ఆల్ రైట్ మాడెం మాన్. విల్ యు కైన్డ్‌లీ అలా మిన్‌టు ఆస్క యు ఎక్స్‌ప్లెన్?... పదహారో తారీఖు రాత్రి ఎలక్ట్రిక్ ట్రైన్‌లో ఏం చేశావ్ నువ్వు? ఏం ఎరగనని ఎంత మొత్తుకున్నా ఏం లాభం లేదు. నీ బండారమంతా బయటపడింది. మిలార్డ్! ఈ పెద్దమనిషి ఆనాడు రాత్రి ట్రైన్‌లో నల్లచీరా ఎఱ్ఱంచుల జాకెట్టూ కట్టుకుని ... ఏమో — ఎందుకో ఆయనకే తెలియాలి...వాట్?—అప్రస్తుతం అంటు న్నారా? అప్రస్తుతం?

[తన లాయరుతో జనాంతికం—] నన్నడి గితే ఈ జడ్జీగారింకో పెద్దబోను!

సరళగొంతు: (మైక్రోఫోన్ లోంచి) కోసు...కోసు...కోసు...కోసు...

రఘు: (రెండు చేతుల్తో చెవులు మూసు కుని అరుస్తూ) షటప్, షటప్ సరళా!

సరళగొంతు: కోసు...కోసు...కోసు...

రఘు: ఇష్...కోసు — కోసు—మోస పోయిన మొగుళ్ళు ... నవ్వులపాలు నాగ మ్మలు...లోకం నవ్వుతోంది—ప్రపంచం పరిహసిస్తోంది— వేళాకోళం—ఎగతాళి...

సరళగొంతు: (దూరంనుంచి సన్నగా, స్వచ్ఛంగా) కోసు...

రఘు: ఊహుఁ — నే సహించను. అది నన్ను వదిలేసింది. నన్ను విశ్రి వెధవను చెయ్యాలని చూసింది—చంపేశాను దాన్ని! నన్నెవరూ ఎగతాళి చెయ్యలేడిహ. నే నేదో నాజన్మ ననుకుంది. నా సాహసం అది ఎరగదు. చంపేశాను కులటని!

అయామ్ సారీ మిలార్డ్! అడగండి. ఏం అడిగినా సమాధానం చెప్పడానికి రెడీగా వున్నాను.

[ప్రాసిక్యూటర్ తో—] వాట్? కొన్ని కారణాలవల్ల కాలేజీ వదిలేశాసుగదూ అనా నీప్రశ్న? ఓ—! నాగత చరిత్రకూడా తవ్విపోస్తున్నావన్నమాట! మట్టగుడిసె లాగా - బురదకొయ్యలాగా - పాతచెత్త అంతా పోగుజేస్తున్నావా!

మెంబర్స్ ఆఫ్ ది జ్యూరీ! అతని వుద్దేశం మీకు వ్యక్తమైందా? నాశీలం అశ్లీలం చేద్దా మని - నాపేరు పాడుజేద్దామని - నా ప్రతిష్ట భంగంచేద్దామని! కొన్ని కారణాలవల్ల కాలేజీ వదిలేశానా అని అతని ప్రశ్న! చాలా దారుణమైన భయంకరమైన కారణాలవల్ల నేను కాలేజీలోంచి వెళ్ళగొట్టబడ్డానని మీ రర్థంచేసుకోవాలని ప్రాసిక్యూటర్ గారి అభిప్రాయం! అవును - వదిలేశాను! కాని నాయిష్టానుసారమే-చదువంటే నాకు సరి పడకే మానేశాను. అంతేగాని అక్కడ నేనేం చెయ్యరానిపని చెయ్యనూ లేదు - నన్నెవరూ వెళ్ళగొట్టనూ లేదు. సరేనా?

(గర్జిస్తూ) ఏగోడ మీద - ఏంరాతయ్యా? (జ్ఞాపకం తెచ్చుకుంటూ) కాలేజీలోనా? అలాంటి గోడేంలేదే...వాట్? ఆ వయ స్సులో అమాట నేను వినికూడా యెరిగి వుండను!

మిలార్డ్, ప్రాసిక్యూటరుగారు ఓపెన్‌గా పబ్లిక్ కోర్టులో బూతులు మాట్లాడరాదని చెప్పండి. జూరీలో ఆ మహిళా మెంబరు గారు చూడండి సిగ్గుతో తలవంచుకున్నారు కూడానూ...

[మళ్ళీ ప్రాసిక్యూటర్ తో—]ఓ! ఓ ఇంకా కాలేజీ గొడవ పూర్తికాలేదా?... వాచ్ మేన్ కూతురా? నాకప్పుడు వయస్సు పద్దెనిమిదేళ్ళు. అంత చిన్న వయసులో నే అంత పెదపనులు నే చేసి వుంటే నన్ను ఎక్స్‌పెల్ కాదయ్యా చెయ్యా ల్సింది - స్కాలర్‌షిప్పిచ్చి విదేశాలకు పంపిం చాల్సింది!

నే నేం నేరం చేశాను? నన్ను తన క్రూరత్వంతో హింసించి నా ప్రాణాలు తీయదలచుకొన్న ఓ ఆడదాన్ని నేనే చం పాను. అంతేగా నే చేసింది! నా భార్యను నేను ప్రేమించాను. వున్నటుండి ఓ రాత్రి ఓ చీటిరాసి నన్ను వొదిలి లేచిపోయింది. అందుకు నే చచ్చినట్లు పడుండాలా? నేనూ నా ఐదుగురు పిల్లలూ ఇరుగు పొరుగు వాళ్ళ నవ్వులపాలై అవమానంతో క్రుంగి కృశించి చావాలా?......

మీరన్నది నిజమే మిలార్డ్. నాకు పిల్ల ల్లేరు ఓవేళ వుంటే అంతపనీ అయ్యేదే కదా అంటాను!

మీకేమైనా పిల్లలా మిలార్డ్? మిమ్మల్ని చూస్తూంటే లేరనే అనిపిస్తోంది.

మెంబర్స్ ఆఫ్ ది జ్యూరీ! ఇది కాస్త జాగ్రత్తగా - కాస్త సింపతీతో వినండి. నాగ్గానీ మన జడ్జీగారికిగ్గానీ పిల్లల్లేరు. మాకు పిల్లలేవుంటే బహుశా మా పెళ్ళాలు లేచిపోయేవాళ్ళే కాదేమో! కాని వాళ్ళ తత్వం అది! ఒకణ్ణి వదిలేసి వాడిగుండెల్లో కార్చిచ్చుపెట్టి అలా (జడ్జీని చూపుతూ) ఏకాకిగా జీవచ్ఛవంగాచేసి పోవడమంటే వాళ్ళకదో లెఖ్ఖలోదికాదు. ఆయనకిహ యీ ప్రపంచంలో ఏముంది చెప్పండి? ఎవళ్ళ సముదాయింపు కోరగలడు చెప్పండి? పిల్లలా - లేరు. పెళ్ళామా - వదిలేసి లేచి పోయింది. వొంటరిగాడు! ఏకాకి! మనిషి యమబాధ - చిత్రహింస పడిపోతున్నాడు - ఎలా జీవించగలడు? ఇంత దురన్యాయానికి గురైన ఆవ్యక్తి న్యాయ విచక్షణ చెయ్యడం ఎలా సంభవం? అతను క్రుంగాడు - కృశించాడు - నశించాడు! 'నాలుగురోజులు కళ్లు మూసుకో అంతా మర్చిపోతావ్' అని మీరెవరైనా అతన్ని ఓదార్చ గలరా? వొద్దు. అతనికా ఓదార్పు అక్కర్లేదు. ఆయనా నాలాగానే చాలా కరుకు! సాహసికుడు! మానవుడు గనక ఆ దుర్మార్గురాలి అతి సాహసాన్ని మన్నిస్తూ కూర్చోడు. అతను లేస్తాడు - వెళ్తాడు - డ్రాయరులాగి రివాల్వరు తీస్తాడు. —ఆత్మహత్యకోసం కాదు— దాన్ని చంపడం కోసం! - తాను దాన్ని వెంటనే చంపకపోతే అది తనకుచేసిన ద్రోహం తన్నూ తనపరువు ప్రతిష్టల్నీ ఖూనీచేస్తుం దని తెలుసుకుని దాన్ని చంపుతాడు! తను వదిలిపెడితే తననే చంపే ఆడదాన్ని చంపు తాడు! ఆత్మరక్షణకోసం చంపుతాడు! అలాంటివాడికి మరణశిక్ష వేస్తానంటారా మీరు? న్యాయం చూడాల్సినవాడు ఆయన! ఆయన న్యాయమే చేశాడు. హంతకుల్ని చంపడం ప్రభుత్వంపని. ఆ ప్రభుత్వ కార్యభారం తనమీదవేసుకుని తానే నెరవేర్చాడు—అంతే! ఇందులో ఆయన చేసిన నేరం ఏముంది? ఆయన్ను చూసి ప్రభుత్వం ఇంకా గర్వపడాలిగాని —వాట్ ఈజ్ ఆల్ దిస్ ట్రయల్ అండ్ టాక్ అబౌట్ కన్విక్షన్ అండ్ ఎక్జిక్యూషన్?

అవును ప్రాసిక్యూటరు గారూ - మీ ప్రశ్న వినిపించింది. విన్నాను - వింటు న్నాను! నాభార్య నన్ను వదిలేసి లేచి పోవాల్సినంత కారణం ఏమీ లేదు. అవును-లేదు...అవునూ...కాని-అదేం పెద్దపోట్లాట కిందికి రాదే. అది లేచేపోయే ముందు మేం



తాతగారు

—వేమూరి లక్ష్మి

# ★ మనిషిలో మనిషి ★

రోజో మాటా మాటా అనుకున్న మాట నిజమే - స్లైట్ మిస్ అండర్ స్టాండింగ్— అంతే! అంతకు మించేం లేదు.... ఎందుకో నా కర్చీఫ్ అడిగింది. సాయంత్రం ఆరింటికి జేబులోంచి తీసియిచ్చాను. తీరా చూస్తే ఆ కర్చీఫ్ నాది కాదు. అముందుకో జా నిప్పర్ షూటింగ్ కు వెళినప్పుడు హీరోయిన్ ది పొరబాటున ఎలావచ్చిందో నా జేబులోకి వచ్చింది.

శుక్రవారం.

(కోపంవచ్చి—) అవును - శుక్రవారం- సాయంత్రం - ఆరుగంటల వేళ! కంట్లో నలక తుడుచుకోడానికడిగింది.... విశుప్తాందా? ఎందుకూ? అంటే... నేను దాన్ని కొడుతున్నాననీ తిడుతున్నాననీ హింసిస్తున్నాననీ అందుకనే అది లేచిపోయిందనీనా నీవుద్దేశం? ఇదుగో అలాంటి అవాకులూ చవాకులే పేలవద్దన్నానిందాక!

[తనలాయరుతో జనాంతికంగా—] కోపగించుకోక ఇంకేం చెయ్యమంటారండీ ఈ కనిగాడితో!

[ప్రాసిక్యూటరుతో—] ఇదుగో— ఇలాగే అర్థంలేని అడ్డుసవాళ్లు ఇంకా నాలుగు వెయ్యి—ఈ బోను దిగొచ్చి నీ తల బద్దలు కొడతాను—జాగ్రత!...మరి లేకపోతేయేమిటా సిల్లీ కొశ్చన్స్—'ఎన్నింటికి' 'ఎక్కడ' 'ఏరోజు'? ఎందుకు నీకంత కుతూహలం? నీ ప్రైవేట్ లైఫ్ ని గురించి నేనెప్పుడైనా అడిగానా నిన్ను? ఐ ఆబ్జెక్ట్ టు ది రిబ్యూక్ మిలార్డ్! ఆ చేతిరుమాలు గురించి మేమిద్దరం మాటామాటా అనుకున్నాం. ఆ హీరోయిన్ కీ నాకూ అతి సాహసం ఎక్కువైపోయిందనీ—అసలు సినిమాల్లో నాటకాల్లో ఆడవాళ్లంతా అంతేననీ ఏమిటేమిటో అంది. దాని అనుమానాలు చూసి నాకు నవ్వొచ్చింది. నవ్వి వూరుకున్నాను. కాని మర్నాడుగాని దాని ప్రవర్తనలోని దారుణనిగూఢార్థం నాకు గోచరించలేదు. అది నన్ను తూలనాడుతున్నంతసేపూ తన ప్రియుడితో లేచిపోవడానికి పన్నాగాలు పన్నుతూనే వుంది మిలార్డ్!

ఇక హత్యజరిగిన రోజుకొద్దాం. నేను కొందరు మిత్రులతో కలిసి ఇంటికొచ్చాను—ఏదో చిన్న పార్టీ చేసుకుందామని. నా భార్య ఇంట్లో లేదు. ఎదురుచూశాం. రాలేదు. ఎలావస్తుంది—అప్పటికే ఆ ఆడంగి వెధవ యింట్లో కులుకుతూ కూర్చుంది! ఇంతలో దాని వుత్తరం దొరికింది. చదివాను. సత్యం బోధపడింది. వెంటనే డ్రాయరు తెరిచి బాకు తీసుకుని మేడదిగి సరాసరి వాడి యింటికి పోయి ఇద్దర్నీ కసిమసంగి వచ్చేశాను. నే చేసిన యీ ఘన కార్యానికి ఈ కోర్టే కాదు—యావత్ప్రపంచమూ కూడా నన్ను విధిగా గౌరవించాలి. నాకు ఘనసన్మానం జరపాలని నా ప్రతిపాదన!

ప్రపంచంలోని అందరు భర్తల తరఫు నా ఆఖూనీలు చేశాన్నేను. నూటికి తొంభైతొమ్మిది మంది భర్తలు ఊహించడానికైనా సాహసించని పనిచేశాను. స్వామిద్రోహియైన నావైఫ్ నీ దాని విటుణ్ణీ కూడా వెంబడించి వాళ్ళ మోసానికి తగ్గట్టు ఖూనీచేసి సరైన శిక్ష విధించాను. ఇందుకు ప్రతిఫలంగా మీరు వెంటనే నన్ను ఇక్కణ్ణుంచి తీసుకెళ్ళాలి—ఉరికంబం దగ్గిరికి కాదు—ఢిల్లీ దర్బారుకు! సుప్రీం కోర్టుకు! ప్రపంచ న్యాయస్థానానికి కూడానూ! తీసుకెళ్ళి విరుదులిచ్చి మర్యాదలు జరపాలి. ఇది నే కష్టించి ఆర్జించుకున్న హక్కు! నా స్వార్జితమైన హక్కు!

[ప్రాసిక్యూటరువైపు తిరిగి—] నువ్వొత్తి అబద్ధాలకోరు బడాచోరవి! ఆ చేతిరుమాలు మూలంగా నా భార్య లేచిపోయిందని ప్రూవ్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నావ్ నువ్వు! అన్నెం పున్నెం ఎరగని ఒక అమాయకురాల్ని చంపానని ఆరోపిస్తున్నావ్! ఇంకొక్క కారుకూతకనక అలాంటిది కూశావా...వాట్? ఇహ నే సహించను. వస్తున్నాను కాచుకో—

[బోనులోంచి దూకుతాడు—]

లేవండి నా కడ్డం రాకండి. వాడి తల పొగరు అణిగిస్తాను. యూ—యూ రాట్! (ముష్టియుద్ధం చేస్తూ) హుఁ— హుఁ—ఇదుగో ఇంకోటి— ఇది నీకు_ఇది నీ తాతకి_ఇది నీ ముత్తాతకి! (ప్రాసిక్యూటర్ కంఠం పిసుకుతూ, అతన్ని వెనక్కు వంగదీస్తూ) అప్పుడే వెందుకుంటున్నావా నీపనికిరానినోటికి తాళంవెయ్యేదూ అబద్దాలూ అన్యాయాలూ అనృతాలూ భండాలపు కారుకూతలూ తప్ప ఇంకేం మాటాడి యెరగని నీనోటికి_ఇదుగో ఒక్క బహుమానం!

(ఒకగుద్దు మూతిమీద గుద్ది అతన్ని నేలమీదకు విసిరేస్తాడు. అప్పటికే తన్ను చుట్టుముటిన పోలీసులతో ప్రారంభిస్తాడిహ యుద్ధం.)

వదిలిపెట్టండి నన్ను_వదలండి. (విదిలించుకుంటూ) ఇదుగో పోలీసులూ! మీరంటే భయమనుకున్నారేమో_రా నువ్వు కూడా రుచి చూద్దువుగాని! నువ్వూరా! నువ్వూ రావోయ్ మీ వాళ్ళకుతోడు! రండ్రా మీరంతా కూడా_నోళ్ళు తెరుచుకుని అల్లా చూస్తారేం" ముగ్గురు సఫా అయ్యారు! రండి!.

(జడ్జి కొయ్యసుత్తితో బల్లమీద కొడతాడు) ఆల్ రైట్ ఆల్ రైట్. క్లియర్ ది కోర్ట్. వెళ్ళండి. అంతా వెళ్లండి కోర్టు ఖాళీచేసి! కొటవయ్యా న్యాయమూర్తీ నీ కొయ్యసుత్తితో మొత్తటిదెబ్బలు మొత్తవయ్యా! మొత్తుకో. క్లియర్ ది కోర్టు. కోర్టు ఖాళీచెయ్. ఇప్పటికే చాలాదూరంపోయింది వెధవ విచారణ! అడుగో ప్రాసిక్యూటరుగారు ముక్కచెక్కలైపోయారు. ఊడ్చి అవతల పారెయ్యండి.

ఇహ నేనొక్క కునుకు తీస్తాను. మీరూ జూరీ అంతా కలిసి ఓ నిర్ణయానికొచ్చిన తర్వాత నన్ను నిద్రలేపండి. ఎంతసేపైనా ఫరవాలేదు. ఎంత లేటైనా ఫరవాలేదంటున్నాను.

[తలుపు తట్టిన చప్పుడు.]

ఆపవయ్యా ఆమోత- నేను నిద్రపోవాలి. నేను నిద్రపోవాలి...నిద్రపోతూనే

(47 వ పేజీ చూడండి)

# ఒక్కైపోతనం

కామరాజు అద్దంముందు నిలబడి గడ్డం చేసుకుంటున్నాడు. బుగలమీద, నుదుటిమీద ముడతలుపడ్డా శరీరం పాలబిళ్ళలాగే వుంది. నవ నవ తగ్గలేదు. రేజరు యెడంగా తీసి కనుబొమలెత్తి, గడంమీద యెడం చెయ్యి వేసి పరీక్షిస్తున్నాడు. తనలో యింకా చాలా బింకంవుంది. దేహపటుత్వం వుంది. కాని యెటొచ్చి జుట్టుకి యిరుపక్కలా రెండు వెండిపాయ లేర్పడ్డాయి. పెదవి విరిచేడు. మెడ ఎత్తి రేజరు మందంగా పోనిస్తున్నాడు. కళ్ళు మూతలుపడుతున్నాయి.

అసలు యీ జీవితం వొక పెద్ద సమస్య. 'క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గమ్ పథం...' అన్నాడు. ఉఫ్ ... ఎందుకు పుట్టాం? పుట్టి యేం చేశాం? చచ్చి యెక్కడికి కెళ్తాం? దేనికీ ఋజువూ సాక్ష్యం లేని కేసు నెగదని తన కెవరైనా చెప్పాలా. తను ప్లీడరువృత్తి ఆరంభించి నేటికి పద్దెనిమిదేళ్ళయింది. తన కిప్పుడు నలభై రెండు పడు పొంది.

పెద్దవాడు చస్తే ప్లీడరు చదువు చదవనన్నాడు. లెక్చరరవుతాట్ట. ఏం బతుకు! తిరగలిలా. పెదిమలు బిగబట్టి మీసం ప్రాంతంమీద దాడిచేస్తున్నాడు. అయినా యిప్పుడు వుపాధ్యాయుడి జీవితం పూర్వంలా అంత రసహీనంగా లేదులే. మా రోజుల్లో గర్ల్ టీచర్స్ గాని లెక్చరర్స్ గాని లేనే లేరు. 'వుమన్' అనబోయి నోరుజారి చిరునవ్వులో వొక చిన్న దగ్గులాంటి శబ్దం చేస్తూ.

గడ్డం బిగించి గీస్తూ అనుకొన్నాడు తిరిగి. అయితే చదువుకునే అమ్మాయిలు లేకపోలేదు. ముగ్గురుండేవారు. ప్రిన్సిపాల్ గారి కూతురు, హిస్టరీలెక్చరర్ కూతురు, వొక క్రిశ్చియన్ అమ్మాయి. వాళ్లవేపు చూసే మేష్టర్లు ఒళ్ళు హూనం చేసేవారు. తిరిగి రేజరు మెడదగ్గర శివానుగా బిరుక్కురుతూంది. అయితే వాళ్లూ చాలాయిదిగా వుండేవారు. ఇప్పట్లాగా! ఇప్పుడసలు లింగభేదం లేదు. ఎక్కడా యింతే—అసలు జీవితపు దృక్పథమే మారిపోయింది.

తిరిగి కళ్లిప్పి చూసేసరికి తలలో వెండిపాయలు యెదురొక్కన్నాయి. అయిపోతూంది జీవితం. విధవకాలం కొలగొట్టేస్తు అదేపోవడం ... వెనక్కి తిరగదు. ఇహ వొచ్చే యేడాదొచ్చేది నలభై మూడుగాని, నలభై వొకటికాదు కదా...పెద్దమ్మాయి స్కూల్ ఫైనల్ తప్పింది. దానికి సైన్సులో డౌటు. మనలాగే...మనకీ సైన్సు బాగా వస్తే...మెడిసిన్ చదివి ... అహో హో...ఆ ఆస్పత్రికి వెడితే సుతిపోతుంది—నిరుడు తన కొక ఆపరేషన్ వొక లేడీడాక్టర్ చేసింది... ఒళ్ళు చచ్చిపోయినట్టయింది. అయితే నేనం జంకానా... మర్నాడొచ్చి ఆవిడ హౌడుయూడూ మిస్టర్ అంటే ఒకే థ్యాంక్యూ డాక్టర్—అనేశా ధైర్యంగా... అని పకేలుమని నవ్వేడు...కాని వెంటనే దిగజారిపోయేడు ... విధవ కాలం విధవ కాలం—స్త్రీలకి కాదు మానభంగం పురుషులకి...

మూడోవాడు నాలుగోవాడు ప్రతియేడూ పరీక్షలు ప్యాసవుతున్నారు. వాళ్ళ తరవాత ఆఖరుపిల్ల మెరికలాంటిది. రేజరు

## అంగర వెంకటకృష్ణారావు

తుడుస్తూన్నాడు. అదెక్కడ! అది మళ్ళీ చాలా ప్లీడరవుతుంది. ఈ రోజుల్లో ఆడవాళ్ళు కూడా 'లా' చదువుతున్నారు కదూ...

నడికరాలుమంది. అసలీ నడి వెనకడం రెండేళ్ళ క్రితమే ఆరంభించింది. అప్పుడే అనుకున్నా లక్షణాలు బైటపడుతున్నాయని.

విజయనగరంలో బి. ఏ. పూర్తిచేసిన తరవాత మేనమామ మద్రాసులో 'లా' చదవమన్నాడు. తనకి బొంబాయి వెళ్లాలనుందంటే పడనిచ్చాడా? ఎందుకో అప్పుడదల అనుకున్నా. తనక్కడే వున్నాడు కదూ... ఇలా 'లా' చదువు ముగిసింది, అలా కట్టిపెట్టేడు గొంగళీపురుగులాంటి కూతుర్ని. సీతతో జరిపించే తన జీవితంలో కోమూన్నంతా...

మద్రాసులో చదువుకునే రోజులలో మేనమామ యింటిపక్క మళయాళీ డాక్టరుండేవాడు. అతని కూతురు అలిమేలు. మహా చెడ్డ చొరవగలది నవ్వితే మువ్వలు ఝుళిపించినట్టుండేది. ఒకటే వాగుడు. మేడమీద తన గది కెదురుగా వాళ్ళగది. కిటికీలు తెరుసే బరాబర్ గా వుండేది. చనువుగా మాట్లాడేది. నేనసలు అందంగా వుండేవాడిని. అందుకే మీదపడిపోయేది. కాని నా ఒణుకు జబ్బే నా అవకాశాలన్నీ పాడుచేసింది.

కామరాజు నీళ్ళు పోసుకుందికి లేవబోయేడు. గోడమీద గడియారం పదికొట్టింది. ఆదివారం. కోర్టుకు శెలవు. ఆఫీసు గది నిద్రపోతూంది. గుమాస్తా వెంకట్రామయ్యని అవాళ రావొద్దన్నాడు. కొన్ని అర్జంటు వాయిదాల కాగితాలు చూసుకుందికి వస్తానంటే ఒద్దన్నాడు.

'వాయిదాల్ట, విధవ వాయిదాలు. ఈ వాయిదాలతో మన జీవితంలో మరపురాని నిముషాలు నిత్య వాయిదాలవుతున్నాయి. ఇలు ప్రశాంతంగా వుంది. ఈ రాత్రి మన జీవితంలో వొక నూతన మధుమాసం పసిడి రెక్కలు విప్పుతూంది. ఈ మెయిల్ లో నే దిగుతున్నారు. పక్కింటి డైరెక్టరుగారి కుటుంబం. వాళ్లు దేశం వెళ్ళి నెలకావస్తూంది. ఈ నెల వొక యుగంలా గడిచింది. సుభద్రకోసం గుండెలు తల్లడిల్లిపోతూంటే ... ఉఫ్...గాలిలేదు. ఫాన్ ఆగిపోయిందా... ఈ యెలక్ట్రిసిటీ వాళ్ళెప్పుడూ యింతే, ఏవో తీయతీయని ఆలోచనలు తడుతూ మనస్సు ఆందోళన పడుతూన్నప్పుడే కరెంటు ఆపేస్తారు ... మన జీవితంలో కరెంటులాగే దీనికీ అప్పుడే బ్రేక్ పడుతుంది....

కూర్గుదేశస్థులు చాలా అందంగా వుంటారు. మద్రాసులో చాలా మందిని చూశా. కాని సుభద్రలా యెవరుంటారు.

# ★ బల్లిపతనం ★

ఆ కంపకు చేరవేసికళ్ళు ... ఆ గుజ్జులా రొత్తు...అ...అ...అచ్చి...వెనక యీగ ముక్కులో దూరిపోయింది. చచ్చినంతైంది ...తుమ్ముతే తల తిరుగుతూంది...ఇదికూడా లక్షణమే కాబోసు...

వాసుదేవయ్య ఎగ్రికల్చర్ డైరక్టరు. వాసుదేవయ్య కామరాజు యిరుగు పొరుగు. సుభద్ర వాసుదేవయ్యకూతురు. లిటరేచర్ ఆనర్సు చదువుతూంది. తను బి. ఎ. స్పెషల్ ఇంగ్లీషుతో చేసయి షెల్లీకీట్సుల్వాడి వడ బోసేడు. సుభద్ర తన దగ్గరకు తరుచు వొస్తూంటుంది. కామరాజు కబుర్లంటే సుభద్రకి సరదా. కామరాజుకి 'కలేజా' లేదుగాని లెక్చరు దంచేడంటే సమ్మోహనంగా వుంటుంది.

అలిమేలు మృగతృష్ణలా తిప్పి తిప్పి చేతి కందినట్టే ... జారిపోయింది. అసలా పిల్ల మళయాళీది. నాకోపక్క ఎదురుగానే వుండేది. ఏ కాఫీలోనో కిల్లీలోనో మందు పెట్టేస్తుందని భయంగా వుండేది. కాని... సుభద్ర ... దేవతలాంటిది. అ భలా పిల్ల నోటంట యింగ్లీషు వింటూంటే ... ఛీ!

ఏ దొరసాన్లు పనిచేస్తారు!... అతడు తల కొంచెం ఏరగాపెట్టి గోళ్లు కొరుక్కుంటూ చిరునవ్వుతో ఆలోచిస్తున్నాడు... ఆవేళ షేక్స్పియర్ దుల్లగొట్టినవాడు తన లెక్చర్కి సుభద్రకు నోటి మాటరాలేదు... ఇంట్లో చెంబులూ తప్పేలాలూ ప్రతిధ్వనించేయి. ఏ టాపిక్ యెత్తుకున్నాడు! చెప్పి చెప్పి... రేప్ ఆఫ్ ల్యుక్రీషియాలోకి దిగా...అందంఅంటే అది. రాక్షసుడిలో కూడా రమణీయమైన ఆలోచనలు మొలక లెత్తిసుంది... అసలు పతికి బుద్ధిలేదు... దానికి విషయాలేమైనా తెలిసేడిస్తేగా పిల్లల్ని కనడం తప్పితే... మెల్లిగా మాట్లాడండి అని కేక లేసింది. పిల్లలు లేచిపోతారట! అసలు నేనేమిటి మాట్లాడుతున్నా. ఎవరితో మాట్లాడుతున్నా. అసలా గొంగళీపురుగుకి నేను సుభద్రతో మాట్లాడ్డం యిష్టంలేదు. నేనేం చిన్నవాడినా... అయిదుగురు పిల్లలవాడిని... నన్నెవరను మానిస్తారు? అసలు మేం మాట్లాడుతున్నది సాహిత్యం... అసలు సీతకి యీ మధ్య నామీద అనుమానం లావయినట్లుంది... చంపేస్తున్నాది పులిలా అహర్నిశాలూ... దాని అనుమానం మండిపోనూ... అసలు మన జీవితమే ప్లెయింట్లు, దావాలు, వాయిదాలతో తెల్లవారిపోతూంది. మధ్య ఏదైనా యిలా వోక ఆకాలత చిగిరిస్తే... యీ సీత దాన్ని కాస్తా దుంప నాశనం చేస్తూంది... అందుకే పిలలతో సహా పంపేశా వాళ్ల చెల్లెలు కూతురు పెళ్ళికి... సరిగ్గా లెక్కవేశా వీళ్ళు వెళ్లిన మూణ్నాళ్ళకి సుభద్ర వాళ్లు దిగుతారు... సుభద్ర యివాళ రాత్రొస్తుంది... ఇవాళ వీనస్ అండ్ అడోనిస్ టాపిక్ యెత్తుతా ... ఆ దెబ్బతో... ఈ ఫ్యాన్ మరి తిరగదు...అబ్బ...యేదిటిది...టప్ మని పడింది భుజంమీద...కుడి భుజంమీద...వెధవ బల్లి ...కుడి భుజంమీద పడి టేబిల్ మీదకి దూకింది..ఈ తుల్లిపడడం కూడా ఒక లక్షణమే. తల వెంట్రుకలు నెరిశాయి...నడుం కరాలుమంటోంది ... ఈ తుళ్లడం పోటె...కుడిభుజంమీద బల్లిపడితే పడితే...దక్షిణ భుజే...దక్షిణ భుజే...ఏం చెప్పాడు శకునకారుడు...అదీ సంగతి. శకునం ఎలా ఫలిస్తుందని? రైట్ సుభద్ర దిగిందన్నమాటే...గడ్డం నున్నగానే వుంది. సీత లేదు...వెంకమ్మగారూ... అవ్వగారూ వంటైందా...ఇదిగో స్నానంచేసి నేనూ సిద్ధం అవుతున్నా...చూడండీ రాత్రి రాకండి... నేను భోజనం చెయ్యను. కడుపులో బాగులేదు...

కామరాజు భోజనంచేసి కచేరీచావడిలో కొచ్చాడు. వీనస్ అండ్ అడోనిస్ చదవబోతున్నాడు.

సీతమ్మా పిల్లలూ దిగారు. కామరాజు గుండె ఆగిపోయినట్టయింది. 'యేం వొచ్చేశారూ కబురూ కాకరకాయలేకుండా... పెళ్లాగిపోయిందా...'

'ఏం పెళ్ళి...సరోజ ఎవడినో ప్రేమించిందట. అదీ వాడూ ఎటో పారిపోయారు. వాళ్ళగొడవల్లో యిదౌతూంటే మధ్య మేముందుకని వొచ్చేశాం...'

కామరాజు నోరెళ్ళబెట్టి టేబిలుమీంచి కిందపడిపోయిన బల్లివేపు చూశాడు. 'నీ శకునం తగలెయ్యా' అనుకున్నాడు... ★




[ఆదిపర్వము — తృతీయాశ్వాసము]

చ. వనజభవప్రభావుఁ డగువాని వసిష్ఠు నపత్యశోక మ
న్వననిధిలోన ముంచినయవారితసత్త్వుఁడు నిన్నుఁ దొట్టియీ
యనిమిషు లెల్ల వానికి భయంపడు చుండుదు రట్టియుగ్రకో
పనుకడ కిప్పు డేఁగు మని పాడియె యిప్పని నన్నుఁ బంపఁగన్.

ఉ. అమ్ముని యల్గి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీ
ధ్రమ్ములు వ్రయ్యు నయ్యుసుము దక్కఁగ నంబుధు లింకు మూఁడులో
కమ్ములు దిర్దిరం దిరుగు గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం
బమ్మునియట్టికోపపరుపాలికి భామలు పోవ నోడరే.

వ. అయినను నానేర్చువిధంబున నమ్మునివరుచిత్తంబు మెత్తన చిత్తజాయత్తంబగునట్లుగాఁ జేసెద నని వాసవు వీడ్కొని మేనక తనకుమందమలయానిలంబు దోడుగాఁ జనుదెంచి హిమవత్పర్వత ప్రదేశంబునం దపంబు సేయుచున్న విశ్వామిత్రుతపోవనంబు సొత్తెంచె నంత.

క. చల్లనిదక్షిణమారుత, మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాధ
మ్మిల్లకుసుమాంగరాగన, ముల్లసనసుగంధి యగుచు మునివరుమీఁదన్.

చ. అనిమిషకాంతయుం దవలతాంతవిభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలసవిలాసగతిం జనుదెంచి ముందటం
గనియె మునీశ్వరప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్తభీతిసం
జననమహాతపశ్చరణ సంయతచిత్తు నిరస్తచిత్తజున్.

క. అంబుజలోచన గని విన, యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పావచయవ్యా, జంబున విహరించుచుండె సఖులుం దానున్.

చ. అలనత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభుమ్రోల నున్న నా
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి చాలపై
వలు వెడలం బయల్పడియె వల్దకుచంబులుఁ గక్షయుగ్మముం
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్.

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ గందర్పనిశాతసాయకంబులు వెలుచం
డెందముఁ గాఁడిన ధృతి సెడి, కంది మునీంద్రుండు దానిఁ గవయం దివిరెన్.

వ. మేనకయు విశ్వామిత్రునిష్ఠంబునకుం దగినకామోపభోగంబులం బెద్దగాలంబు రమియించిన నయ్యిద్దఱకు నిక్కన్యక పుట్టిన దీని మాలిని యను నొక్క యేటి పులినతలంబునం బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె విశ్వామిత్రుండును దపోవనంబునకుం జనియె నంత నమ్మునిప్రభావంబున.

ఆ. చెలఁగి లేవ నేడ్చు చిఱుతుకదానిఁ గ్రవ్యాదఘోరమృగము లశనబుద్ధిఁ
బట్ట కుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు, కొని శకుంతతతులు గూడియుండె.

వ. అంత నేము శిష్యగణంబులతోడ సమిత్కుసుమఫలాహరణార్థం బక్కడకుం జని యమ్మాలినీపులినతలంబున శకుంత రక్షితయై యున్నకూఁతు నత్యంతకాంతిమతి నవనీతలంబున నవతరించినతరుణశశిరేఖయుంబోనిదాని నెత్తికొని వచ్చి శకుంతరక్షిత యగుటం జేసి శకుంతల యను నామం బిడి కరంబు గారవంబునం బెనిచితిమి.

మధ్యాక్కర. తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత
యును ననఁగ నింతులకు మువ్వు రొగిన గురువులు వీర
లనఘ యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు.
ననఁగఁ బురుషున కియ్యేవు రనయంబును గురువులు.

వ. అనం బరఁగిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల మగుటంజేసి గురుల మిదియును మాచే నభివర్ధిత యగుటం జేసి మాకు హృదయానందనియైన కూఁతురని కణ్వమహాముని యమ్మునికిం జెప్పినవిధం బంతయు సవిస్తరంబుగా శకుంతల సెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున.

## దుష్యంతుండు శకుంతలను వివాహంబు సేసికొనఁ గోరుట

చ. ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్త్రి యని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద నెఱిఁగించినన్ మదనబాణపరంపర కిప్పు దుండ నా
స్పద మయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్.

వ. అనుచు మదనాతురుం డయి దుష్యంతుండు దనయం దక్కోమలియనురాగంబుపలక్షించి యిట్లనియె.

క. ఈవల్కలాజినములకు, నీవన్యఫలాశనముల కీవిటపకుటీ
రావాసములకు నుచితమె, నీవిలసితరూపకాంతి నిర్మలగుణముల్.

ఉ. ఈమునిపల్లె నుండు టిది యేల కరం బనురాగ మొప్పఁగా
భామిని నాకు భార్య వయి భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యముల మేలుగ నందు మనింది తేందుపా
దామలతుంగహర్మ్యముల హారిహిరణ్మయకుట్టిమంబులన్.

సీ. బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ బ్రా,జాపత్యమునురాక్షసంబు నాసు
రంబు గాంధర్వంబు రమణఁ బైశాచంబు, నను నెనిమిదివివాహములయందుఁ
గడుఁ బ్రశస్తములు సత్క్షత్త్రవంశ్యులకు గాం,ధర్వరాక్షసములు ధర్మయుక్తి
నీకును నాకును నెమ్మిఁ బరస్పర, ప్రేమంబు గాముండు పెంపఁ దొడఁగెఁ

ఆ. గాన యెడయుఁ జేయఁగా నేల గాంధర్వ,విధి వివాహ మగుట వినవె యుక్త
మనిన లజ్జఁ జేసి యవనతవదన యై, యాలతాంగి యిట్టు లనియెఁ బలికి.

క. కరుణానిరతులు ధర్మ, స్వరూపు లింతకు మదీయ జనకులు నను దెం
తురు వారు వచ్చి నీ కి,చ్చి రేని పాణిగ్రహణము సేయుము నన్నున్.

వ. అనిన దానికి దుష్యంతుం డి ట్లనియె.

తే. తనకు మఱి తానచుట్టంబు దానతనకు, గతియుఁ దన్నిచ్చుచోఁ దానకర్త యనఁగ
వనజనేత్ర గాంధర్వవివాహ మతి ర,హస్యమును సమంత్రకమును నగుచు నొప్పు.

వ. అని దుష్యంతుండు గాంధర్వవివాహస్వరూపంబు సెప్పి శకుంతల నొడంబఱిచిన నది యి ట్లనియె.

చ. నరనుత నీప్రసాదమున నా కుదయించిననందనున్ మహీ
గురుతరయౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమదాన య ట్లయిన నీకును నాకును సంగమం బగున్.

వ. అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దానికోరినవరం బిచ్చి గాంధర్వ వివాహంబున నభిమతసుఖంబు లనుభవించి యక్కోమలి వీడ్కొని నిన్నుఁ దోడ్కొని రా నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహామునిపాలికిం బుత్తెం చెద నని యూఱడ నొడివి దుష్యంతుండు నిజపురంబునకుం జనియె నిట శకుంతలయుఁ దనచేసినదాని మునివరుం డెఱింగి యలిగెడునో యని వెఱచు చుండె నంత నమ్మహాముని వనంబుననుండి కందమూలఫలంబులు గొని చను దెంచి లలిత శృంగారభావంబున లజ్జావనతవదనయు నతిభీతచిత్తయు నై యున్నకూఁతుం జూచి తనదివ్యజ్ఞానంబున నంతవృత్తాంతంబు నెఱింగి క్షత్త్రియులకు గాంధర్వవివాహంబు విధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కి ట్లనియె.



# ఏకోదరులు

## వేమూరి వేంకటసూర్యనారాయణ

"అరగంటనుండి చెప్తూన్నా, పుస్తకం తియ్యకుండా అలా ముడిచిపెట్టుకొని పడుక్కుంటావేమిరా?"

రంగారావుకి అన్న మాటలు వినబడుతూన్నా, తనను కానట్టే ముసుగు మరింత బిగించుకుని పడుకున్నాడు.

"వెధవ! చదవకుండా ఎన్నాళ్ళీ క్లాసులో కూర్చుంటాడు?" అని విసుక్కుంటూ జగన్నాధం తను చదువుతూన్న పుస్తకాన్ని అక్కడపెట్టి లేచి, తమ్ముడు పడుకున్న మంచందగ్గిరికెళ్ళి కప్పుకున్న దుప్పటిని లాగివేసి, రంగా[illegible]లేవదీసి మంచంమీద కూర్చోపెట్టాడు. [illegible]ఖమయమైన సుషుప్తికి భంగం కలిగినందుకు రంగారావు కొంచెం గొణుక్కున్నాడు.

"మొహం కడుక్కునికూర్చోరా, నిద్రమతువదిలిపోతుంది" అంటూ గ్లాసులో మంచినీళ్లుపోసి తమ్ముడిచేతి కందించాడు జగన్నాధం.

ఇంక తప్పదనుకుంటూ రంగారావు మంచంమీదనుండి లేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ వాకిట్లోకి వెళ్లి ముఖం కడుక్కుని తిరిగి వచ్చి దీపం ముందు కూర్చున్నాడు.

ఇద్దరికీ మధ్యనున్న హరికేన్‌లాంతరు జాజ్వల్యమానంగా వెలుగుతోంది. జగన్నాధం దీక్షగా చదువుతున్నాడు. రంగారావుకి మాత్రం చదవబుద్ధి కావడం లేదు. చేతులో పుస్తకం వుందికాని, బద్ధకంగా జోగుతున్నాడు. తల పైకెత్తి చూసిన జగన్నాధానికి తమ్ముడు బద్ధకంగా జోగుతూ వుండడం కనిపించింది.

రంగారావు తెలివైనవాడే. ఎంత తెలివైనవాడయితేమాత్రం ఒక్కసారైనా పుస్తకం ముట్టుకోకపోతే — ఆ చదువు అబ్బుతుందా? అతనికంటె తుంటలు 'నాబోంట్లో' అని యిరవైనాలుగ్గంటలూ పుస్తకాలు ముందువేసుకొని రంగారావుకంటె తెలివైనవాళ్ళుగానే ఉపాధ్యాయులదృష్టిలో చలామణీ అవుతున్నారు. రంగారావుమాత్రం ఒళ్ళువంచి చదివినా పరీక్షల్లో మంచిమార్కులు రావడానికి అవకాశముంది. కాని అతను పరమబద్ధకస్తుడు.

జగన్నాధానికి తమ్ముడి బద్ధకం చూస్తూంటే అమితమైన కోపమూ, నిష్కారణంగా పాడైపోతాడేమోననే భయమూ మనసులో పెనవేసుకున్నాయి. తనంటే వాడికెంతో అభిమానమూ, గౌరవమూ ఉన్నాయి. కాని భయంలేదు. వాడికి కొంచెం భయం కలిగించి లొంగదీసుకోవాలనే ఉద్దేశ్యంతో జగన్నాథం తమ్ముణ్ణి చూచి ఒక్క లెంపకాయ కొట్టేడు.

నిద్రమత్తులో జోగుతూన్న రంగారావు ఆవూపుతో వెలిగి వెలిగి బాగా వేడెక్కివున్న లాంతరుమీదపడ్డాడు. ఒళ్ళు చురుక్కున బాధతో మత్తు పూర్తిగా వదిలిపోయి 'అమ్మా!' అని కేకవేశాడు. ఈ హఠాత్సంఘటనకు జగన్నాథం రిచ్చపోయి గబగబా దీపంతీసి దూరంగా పెట్టాడు. తమ్ముణ్ణి కూర్చోపెట్టి కొబ్బరినూనె, సున్నపునీరూ కలిపి కాలినచోట పట్టించాడు.

చాలాసేపటినుండి వెలుగుతూ తీవ్రంగా వేడెక్కిపోయిన లాంతరుమీద జబ్బబలంగా మొయ్యడంవల్ల రూపాయికాసంత మేర కాలిపోయి చర్మం ఊడిపోయింది. తమ్ముడి చేతిమీద ఆగాయాన్ని చూడగానే జగన్నాథం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దీనంగా తమ్ముడి ముఖంలోకి చూస్తూ, 'తమ్ముడా ఇలా అవుతుందనుకోలేదురా. నువ్వు చదువుకోడంలేదనే బాధకొద్దీ, నీక్లాసులో చవటలంతా నీకంటె తెలివైనవాళ్ళుగా చలామణి అయిపోతున్నారనే యీర్ష్యకొద్దీ నీలోని పౌరుషాన్ని మేల్కొలుపుదామనే ఆశతో నిన్ను కొట్టేను. కాని యిలా అవుతుంది అనుకోలేదు" అన్నాడు మ్లానవదనంతో.

రంగారావు అన్న ముఖంలోకి ఆప్యాయంగా చూశాడు. తన అన్న తనగూర్చి మనసులో పడేక్షోభ ముందు తన చేతిమీద కాలిన గాయంవల్ల కలిగేబాధ యేమాత్రం? కేవలం విస్మరించతగినదే. అసలే తన అన్నది [illegible]మనసు. అందుకే యీచిన్న సంఘటనకు యిలా బాధపడుతున్నాడు. అక్షణంలో అన్నపైఉండే ప్రేమానురాగాలూ, భక్తిభావమూ ద్విగుణీకృతంగా అతని హృదయంలో విజృంభించాయి.

"అన్నయ్యా!" అంటూ జగన్నాధంమీద వాలిపోయాడు.

"ఇకముందు జాగ్రత్తగా చదువుకుంటానన్నయ్యా! నీమనసును కష్టపెట్టనన్నయ్యా" అన్నాడు.

జగన్నాథం ప్రేమతో రంగారావు శిరస్సును హృదయానికి చేర్చుకున్నాడు.

జగన్నాథం రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో బి. ఏ. పరీక్షకు చదువుతున్నాడు. రంగారావు వీరేశలింగం హైస్కూలులో స్కూల్ ఫైనల్ చదువుతున్నాడు. ఇద్దరూ అల్కాట్ తోట ప్రాంతంలో చిన్న యిలు తీసుకుని వుంటున్నారు. జగన్నాథం స్వశక్తివల్ల రెండు మూడు స్కాలర్‌షిప్పులు సంపాదించుకున్నాడు. వాటిమీద వచ్చే ఆదాయంవల్లనే అన్నదమ్ములిద్దరి చదువూ సాగుతూంది. లేకపోతే పల్లెటూళ్లో చెరెడు భూమిని సేద్యం చేసుకుంటూ బ్రతుకుతూన్న తల్లిదండ్రులు వాళ్లకెలాగూ ఉన్నతవిద్య చెప్పించలేరు.

స్వతహాగా జగన్నాథం తెలివైనవాడు. తన తెలివితేటలకు తోడు నిరంతరమయిన కృషివలన విద్యారంగంలో సానపెట్టిన వజ్రంలా తయారయాడు. తల్లిదండ్రులు తప్పితే తననూ, తమ్ముణ్ణీ స్వచ్ఛమయిన మనస్సుతో ఆదరించేవారే లేరు. ఆ తల్లిదండ్రులు ఉన్నవాళ్ళు కాకపోవడంవల్ల తాము జీవితంలో పురోగమించడానికి వాళ్ల ఆదరణ ఏవిధంగానూ చేయూతనివ్వలేదు. అందుకే జగన్నాధానికి చిన్నవయసులోనే బాధ్యతల బరువు తెలిసివచ్చింది. తాముండేపరిస్థితుల్ని అర్థం చేసుకోకుండా, తమ్ముడు తన కనీసపు బాధ్యతలను విస్మరించి ప్రవర్తించడం జగన్నాధానికి ఉద్రేకాన్ని కలుగజేసేది. కాని కొద్దికాలంక్రితం జరిగిన సంఘటనతో రంగారావు కొంచెం మారినట్టే కనిపించాడు. అతను అప్పుడప్పుడు ఏ పనిలోనయినా బద్ధకించినా, చేతిమీద శాశ్వతంగా ఏర్పడిన రూపాయి కాసంత మచ్చ తన బాధ్యతలను



[illegible] కొద్ది రోజులు మాత్రమే వున్నాయి. రంగారావూ, జగన్నాథం— యిద్దరూ పెద్దపరీక్షలకు హాజరు కావలసిన వాళ్ళే. అందుచేత మామూలుకంటె ఎక్కువ కాలాన్ని చదువుక్రింద వినియోగిస్తున్నారు. ప్రతిరోజూ తెల్లవారుఝామునే లేచి ప్రశాంత వాతావరణంలో చదవడం మొదలు పెట్టారు. ఒకనాడు మామూలుగానే లేచి వసారాలో కూర్చొని యిద్దరూ చదువు కొంటున్నారు. హరికేన్ లాంతరు విరజిమ్మే వెలుగు వసారా నిండా పరుచుకొంది. ఒకటి రెండు కాంతిరేఖలు వీధి మెట్లమీదకుకూడా ప్రసరిస్తున్నాయి. వీధి మెట్లమీద మిగిలిన స్థలమంతా చీకటిగా వుంది. ఇద్దరూ దీక్షగా చదువుతున్నారు.

వీధి మెట్లమీద ఏదో చప్పుడి అయింది: జగన్నాథం అటుతిరిగి చూశాడు. అక్కడ ఏదో ఆకారం కదుల్తున్నట్లు కనిపించింది.

“వెధవ కుక్కలు ఎప్పుడూ మనగుమ్మంలోకే ఏడుస్తాయి,” అన్నాడు రంగారావు యథాలాపంగా.

జగన్నాథం ప్రక్కనున్న రూళ్ళకర్రను తీసి, కుక్కను కొట్టే ఉద్దేశంతో కదుల్తున్న ఆ ఆకారంమీదికి బలంగా విసిరాడు. హృదయాలనుపట్టి పిండేసే దీనమైన ఆర్తనాదం, తేలుమీదపడ్డట్లు ‘దబ్బు’మనే చప్పుడూ ఒకదానివెంట ఒకటి వినిపించాయి.

అన్నదమ్ములిద్దరూ గాభరాగా లేచి దీపంపట్టుకొని గడపలోకి వెళ్ళారు. అక్కడ చూసిన దృశ్యానికి వాళ్ళు భయంతో కంపించిపోయారు. సుమారు ఏభైఏళ్ళ వ్యక్తి మెట్ల మీద ఏటవాలుగా పడివున్నాడు. అతని జీర్ణవసనాలూ, చంకనున్న జోలీ, వీపుకంటుకొనిపోయిన పొట్టా - అతడు ముష్టివాడై నట్లు సూచిస్తున్నాయి. జగన్నాథం విసిరిన రూళ్ళకర్ర బలంగా మర్మస్థానంమీదతగలడంవల్ల వెంటనే ప్రాణంవిడిచేశాడు. ఈ దృశ్యాన్ని చూసిన జగన్నాథం నిలువునా క ర [illegible] పోయాడు. శరీరమంతా కమ్మిన చెమటకు అతని దుస్తులు పూర్తిగా తడిసి ముద్దయిపోయాయి. నిర్లిప్తంగా, వెర్రిగా, భయం భయంగా చూస్తున్నాడేగాని అతనిలో చైతన్యం లేదు.

రంగారావు జగన్నాథంకంటె బాగా ధైర్యవంతుడు. చెదిరిన మనస్సును కొద్దిక్షణాల్లోనే కూడదీసుకున్నాడు. తరుణోపాయంకోసం అతని మెదడు విద్యుద్వేగంతో పనిచెయ్యడం మొదలుపెట్టింది. టాలున జగన్నాథం చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకు వెళ్ళాడు. “గత్యంతరం ఆలోచించాను,” అన్నాడు, రహస్యంగా.

జగన్నాథం వెర్రిగా చూశాడు.

“నే నిక్కడినుండి పరారీ అయిపోతాను. నేరం దానంతటదే నా మీదకు తోసుకు పోతుంది” రంగారావు నిశ్చలంగా చెప్పాడు.

“నువ్వా!!” అన్నాడు, జగన్నాథం బలవంతంగా లేచుకుని.

“అవును. నేనే. ఈ పరిస్థితుల్లో నేను పారిపోవడమే ఉత్తమం. నువ్వు నాకంటె ఎక్కువ చదువుతున్న వాడివి, తెలివైన వాడివిను, పైగా నాకు ఉచిత వేతనం సౌకర్యం ఉండడంవలన నీ చదువు సుళువుగా కొ సాగిపోతుంది. సంఘంలో ఉన్నత స్థానానికి చేరగల అవకాశాలు నాకు లేవు. త్వరగా చదువు పూ[illegible] కుని మన తల్లి దండ్రులను ఆదుకునే ఆ[illegible]కం నీ కెక్కువగా వుంది. అందుచేత ఈ పరిస్థితుల్లో నా కంటె నీకే ఎక్కువ రక్షణ కావలసి వుంది. ఏమీ తెలియనట్టే నువ్వు రోజులు గడిపి వెయ్యి. కొన్నాళ్ళకు పరిస్థితులు వాటంతటవే సర్దుకుంటాయి. ఈ తరుణంలో నీ భవిష్యత్తుకు గండిపడడం మన కుటుంబానికి క్షేమం కాదు. నేను వెళ్తున్నాను. బహుశా యిదే మనకు ఆఖరి చూపులేమో!”

“తమ్ముడూ! వద్దు. నేరం నీ మీద వేసుకుని నువ్వు పారిపోవడానికి వీలులేదు. నేరం నాది, శిక్ష నీదా? కాదు తమ్ముడూ?” అంటూ జగన్నాథం తమ్ముణ్ణి [illegible] కౌగలించుకున్నాడు.

రంగారావు ముఖ[illegible]

నుండి తప్పించుకుని, "నిన్ను బ్రతిమాలుకుంటున్నాను. నన్ను వెళ్లనీ అన్నయ్యా! నిదానంగా ఆలోచిస్తే నేను చెప్పినదాల్లో సత్యాసత్యాలు నీకే అర్థమవుతాయి. మనం యిప్పుడీ సమస్యను తర్కిస్తూ కాలయాపన చెయ్యడానికి వేళ లేదు. నేనింకా మైనర్ని గనుక పట్టుపడినా పెద్ద శిక్ష వెయ్యరు నువ్వు మాత్రం ధైర్యంగా వుండు. ఏ పరిస్థితుల్లోనూ నిజాన్ని వెల్లడి చెయ్యడానికి ప్రయత్నించకు" అంటూ తలుపు తెరచుకొని చీకట్లో లీనమయిపోయాడు.

"తమ్ముడూ!" అంటూ జగన్నాథంపిలుపు అక్కడికక్కడే గాలిలోలీనమై పోయింది.

రంగారావు వెళ్ళిపోయినతరువాత నిదానంగా ఆలోచిస్తే జగన్నాథానికి తమ్ముడు చెప్పిన మాటల్లో పరిస్థితుల్ని ఆకళింపు చేసుకొన్న పచ్చినిజం ఉన్నట్లు అనిపించింది.

తెల్లవారేసరికి ఆ యింటిముందు పోలీసు ఉద్యోగులూ, తమాషా చూడ్డానికి వచ్చిన జనమూ నిండిపోయారు. శవాన్ని పంచాయితీ చేసిన పెద్దలు అది 'హత్య' అని నిర్ణయించారు. పోలీసుద్యోగులు జగన్నాథాన్ని గంటలకొద్దీ తమ ప్రశ్నలతో వేధించారు. ప్రతి ప్రశ్నకూ ఓపిగ్గా "నాకు తెలియదు" అని జవాబిచ్చాడు జగన్నాథం.

అతని జవాబులతో విసిగిపోయిన పోలీసు అధికారి చివరిప్రయత్నంగా యిలా అడిగాడు—

"ఈ యింట్లో ఎవరెవరుంటున్నారు?"

"నేనూ, మా తమ్ముడూ."

"మీ తమ్ముడేడీ?"

"రాత్రినుండి కనబడ్డం లేదు."

ఆ ఉద్యోగి ముఖంలో ఏదో ఆలోచన తళుక్కున మెరిసింది. "ఇంకేం—ఆ తమ్ముడే హత్య చేసి పరారిఅయిపోయాడన్నమాట!" అనుకున్నాడు.

అంతటితో వాళ్ళంతా జగన్నాథాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయారు. ఇంక తన తమ్ముణ్ణి వేటాడుతారు కాబోలు అనుకున్నాడు, జగన్నాథం. వాడెటుపోయాడో, ఎక్కడున్నాడో!

ఇది జరిగిన రెండు రోజులకు ధవళేశ్వరం ఆనకట్టదగ్గర ఒక కుర్రవాడిశవం గోదావరిలో



ఇంతలో ఎవరో పెద్దమనిషి రావడంవల్ల జడ్జీగారు ఆయనతో మాట్లాడ్డంలో నిమగ్నులయి పోయారు. సోమయ్య చిన్నబోయిన ముఖంతో అక్కడినుండి కదిలాడు.

విశేష మేమిటంటే, సోమయ్య కదలకుండా తన యింటిముందే వుండడాన్ని జడ్జీగారు వరుసగా రెండురోజులు గమనించడమూ, మూడోనాడు అతన్ని పిలిచి తన దగ్గర బంట్రోతుగా నియమించడమూ జరిగింది. ఆరోజునుండి సోమయ్య జడ్జీగారి యింటిని కనిపెట్టుకునే వుండేవాడు. నాగులు ఊళ్లో కూలీనాలీ చేసుకునేవాడు.

కొద్దిరోజుల్లోనే సోమయ్య జడ్జీగారికి అభిమానపాత్రుడయిన నౌకరు అయాడు. ఆయనకు కావలసిన ప్రతిపనినీ భక్తితో నిర్వహించేవాడు, ప్రతి సదుపాయాన్నీ శ్రద్ధతో చేసేవాడు. ఇరవైనాలుగ్గంటలూ అయన్నే కనిపెట్టుకుని వుండేవాడు.

జడ్జీగారు సోమయ్యను గురించి అప్పుడప్పుడాలోచిస్తూ వుంటారు—ఎంతమంచివాడతను! తానంటే ఎంత గౌరవాభిమానాల్ని చూపుతున్నాడు! మొదట్లో తానతన్ని చూసినప్పుడు ఎవడో బిచ్చగాడని భ్రమపడ్డాడు గాని, పరిశీలిస్తే జీవితంలో పెద్ద దెబ్బతిని యీ స్థితికి వచ్చినట్టు కనబడుతున్నాడు. అందుకే కాబోలు తాను మొదట్లో రూపాయితీసి యిచ్చినప్పుడు తీసుకోకుండా ముఖం చిన్నపుచ్చుకున్నాడు. అతనిలో గతించిన అభిజాత్యపు వాసనలు యింకా ఆత్మాభిమానాన్ని కాపాడుతున్నాయి కాబోలు!

ఒకనాడు రాత్రి జడ్జీగారు క్లబ్బునుండి యింటికి వస్తున్నారు. ఆనాడు క్లబ్బు వార్షికోత్సవం గనుక అక్కడ బయలుదేరే సరికే సుమారు పదకొండు గంట లయింది. డ్రైవరు సాయంత్రమే యింటికివెళ్ళిపోవడం వలన ఆయనే కారు నడుపుతున్నారు. సోమయ్య వెనుకసీటుమీద అనీ అననట్టు కూర్చుని వున్నాడు. బందరులో రాత్రి ఎనిమిదిగంటలయితేనే రోడ్లన్నీ నిర్మానుష్యంగా వుంటాయి. పదకొండు గంటలవడంవలన మరీ శూన్యంగా వున్నాయి. జడ్జీగారు నడుపుతూన్న కారు మెల్లగా మెత్తగా తార్రోడ్డుమీద ముందుకి సాగిపోతూంది.

కారు మలుపు తిరుగుతూంది. చావుకేక వేసి ఒక మానవాకారం 'దబ్బు'మని నేల కూలడమూ, మరో వ్యక్తి మసగ చీకటో మాయమవడమూ క్షణంలో జరిగిపోయాయి. బలిష్ఠమయిన కండలు తిరిగిన వ్యక్తి మసగ చీకటో మాయమవడం జడ్జీగారికీ, సోమయ్యకూ కూడా స్పష్టంగా కనుపించింది.

జడ్జీగారు కారు ఆపారు. "సోమయ్యా! అలా వెళ్లి ఎవరైనా బీటుజవాను కనిపిస్తే ఈ స్థలానికి పంపి, నువ్వు ఇంటికి వచ్చెయ్యి" అని ఆయన కారు తీసుకుని యింటికి వెళ్ళిపోయారు.

హత్యానేరంమీద మర్నాడు నాగులు అరెస్టు చెయ్యబడ్డాడు. ఆ వార్త తెలిశాక సోమయ్య జడ్జీగారి ముందు వాపోయాడు, "వాడి కేం తెలియదు బాబూ!" అని జడ్జీగారు నిర్లిప్తంగా సోమయ్య గోడును ఆలకించి ఊరుకున్నారు.

నాగులుమీద మోపబడిన హత్యాభియోగం సెషన్సుకోర్టుకి పంపబడింది. జస్టిస్ జగన్నాథంగారి ఎదుట కేసు మూడు వాయిదాల్లో కూలంకషంగా చర్చింపబడింది. ప్రాసిక్యూషనువారు ముద్దాయిని హంతకునిగా ఋజువుపరచే బలవత్తరమైన సాక్ష్యలను ప్రవేశపెట్టారు.

"నేనేపాపం ఎరుగను బాబూ! నన్ను అన్యాయంగా పట్టుకుని కటకటాల వెనుక త్రోసేశారు బాబూ!" అని బోనులోనున్న ముద్దాయి నాగులు హృదయ విదారకంగా ఏడిచాడు. వాడి తరఫున ప్లీడరెవరూ లేరు. అందుచేత వాడి యేడుపు వాడు యేడ్వవలసిందే!

కోర్టులో అంతా నాగులు నేరం ఋజువైపోయినట్లూ, అతనికి శిక్షపడక తప్పదనీ రూఢిచేసుకున్నారు. అప్పుడే శిక్ష యేరూపంలో వుంటుందో తెలుసుకోవటానికి మాత్రమే కాచుకొనివున్నారు. కోర్టు హాలులో ఒకమూలగా నిల్చున్న సోమయ్య బలవంతంగా కన్నీటిని ఆపుకుంటున్నాడు.

కేసుయొక్క అంతిమ పరిష్కారం మరునాటికి వాయిదా వెయ్యబడింది.

ఆ రోజు జడ్జీగారు తన గదిలో ఒంటరిగా కూర్చొని కోర్టు కాగితాలు చూసుకుంటున్నారు. సోమయ్య అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి ఆయన ముందు నిలబడ్డాడు. అతని కళ్ళనుండి ధారాపాతంగా అశ్రుజలం స్రవిస్తోంది. అవనతవదనుడై వ్రాసుకుంటూన్న జడ్జీగారు తలఎత్తి సోమయ్య ముఖంలోకి జాలిగా చూశారు. నిస్తేజమయిన అతని ముఖంలో అంతులేని వ్యథ గోచరించింది.

"బాబూ! నాగులు నేరం చేశాడనే మీరూ అనుకుంటున్నారా?" అన్నాడు, సోమయ్య పెల్లుబికే దుఃఖాన్ని ఆపుకొంటూ.

జడ్జీగారు మాట్లాడలేదు. ఆయన ముఖంలో భావశూన్యత గోచరించింది. అవును. గురుతర బాధ్యతలు గలిగిన న్యాయాధికారిగా ఆయన అభియోగం పరిష్కారమయే వరకూ తన నిర్ణయాలను ఏవిధంగానూ బయల్పరుపకూడదు.

మనోవ్యగ్రతతో క్రుంగిపోతున్న సోమయ్యకు యిదంతా ఎందుకు? తన కొడుకు నిర్దోషి అని నచ్చచెప్పటందుకే అతను ప్రయత్నిస్తున్నాడు.

"ఏం జరిగిందో చెప్తాను. వినండి బాబూ! ఖూనీ చెయ్యబడిన మనిషి మా నాగులు స్నేహితుడే! మాయిల్లు కూడా హత్య జరిగిన స్థలానికి దగ్గరగానే వుంది. అప్పుడే పడుకోడానికి సిద్ధపడుతూన్న నాగులు చావుకేకను విని హడావిడిగా ఆ స్థలానికి పరుగెత్తేడట. తీరా చూస్తే దెబ్బతిని పడిపోయినవాడు తన స్నేహితుడే! ఇంకా ప్రాణం వుందేమోననే ఆశతో పరీక్షిస్తున్నాడు. ఈలోగా పోలీసువాళ్లు వాణ్ణి పట్టుకున్నారు...వాడలాంటివాడు కాడు. కాడు బాబూ! మీ కాళ్ళు పుచ్చుకుని ప్రమాణం చేస్తాను. పుణ్యానికిపోతే పాపం ఎదురయింది." సోమయ్య ఆగి జడ్జీగారి ముఖంలోకి చూశాడు. తను చెప్పే కథనాన్ని ఆయన నిశ్చలంగా వింటున్నారు. ఆయన ముఖకవళికల్లో ఏ మార్పూ లేదు. ఏ అర్థమూ లేదు

సోమయ్యలో ఉద్వేగం పెరిగిపోతూంది. ఆఖరి ప్రయత్నంగా జడ్జీగారి దగ్గరగా వెళ్ళాడు. తన కుడిచేతి మీదనున్న వస్త్రాన్ని తొలగిస్తూ ఆయన కళ్ళముందు ఆ చేతిని నిటారుగా చాపేడు. బిచ్చగాణ్ని మొదలు మహారాజును వరకూ శాసించే అధికారం కలిగిన జడ్జీగార్ని ఆయన నౌకరు సోమయ్య గంభీరంగా ప్రశ్నించాడు—"ఈ మచ్చ జ్ఞాపకముందా?"

ఆ చేతిమీద రూపాయి కాసంత కాలిన మచ్చ కనిపించింది జడ్జీగారికి. ఆయన కళ్ళముందు తన గత చరిత్రకు సంబంధించిన పుటలు గబగబా తిరిగి పాతిక సంవత్సరాల వెనుక ఆగాయి. ఆ సంఘటన ఆయనకింకా నిన్న మొన్ననే జరిగినంత వివరంగా జ్ఞాపకముంది. తను తమ్ముణ్ని లెంపకాయ కొట్టడమూ, వాడు వెలుగుతున్న దీపంమీద పడటమూ, వాడిచెయ్యి కాలి మచ్చ కటడమూ ఆ తరువాతి దుర్విధి తమను వేరుచెయ్యడం — వరుసగా ఆయన కళ్ళముందు ప్రస్ఫుటీకరించాయి. ఆయన తన జీవితంలో మరిచిపోలేని విషయాలు—ఇవి. ఆయన ఒకసారి సోమయ్య ముఖంలోకి తీక్ష్ణంగా చూశారు. కూర్చున్న కుర్చీలోంచి గబుక్కున లేచి, "తమ్ముడూ!......నువ్వేనా, తమ్ముడూ!"

(42-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[ 3-9-58 మొదలు 9-9-58 వరకు ]

| | | | |
|---|---|---|---|
| | కే | కు | |
| | తే 4 దీని శుక్రుడు సింహములో ప్రవేశించును. | | శు |
| | మేష, వృషభ, మిధున కర్కాటకములలో చంద్రుడు. | | ర బు |
| | శ | గురా | |

## *అశ్వని [చూ, చే, చో, లా]*

ఈ వారము రావలసిన డబ్బు సకాలములో చేతి కందకపోవడముచేతను అశాంతి. బంధువుల రాకపోకలవల్ల ఖర్చు ఎక్కువ. కోర్టుదావాలు కొంతవరకు అనుకూలిస్తవి. పరులకు సహాయము చేదామనుకొని సాగక పోవడముచేతను నిందలు పొందుతారు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలవల్ల కార్య భారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారము పట్ల పేచీలు, భార్యకు అనారోగ్యము. 3, 4, 5 కార్యభారము, త్రిప్పట, ఇంట్లోవారి అనారోగ్యము, వివాదములు, నిందలు. ఆపైని స్వల్పముగా ధనయోగము, కార్యసిద్ధి.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము అనుకున్నట్టుగా పనులు జరగవు. బంధువులకు సహాయము చేయబోయి జరగక మాట పడి మనోవ్యధ నొందుతారు. ధనాభావముచేత ఇబ్బంది కలుగుతుంది. ఎత్తైనస్థలమునుండి పడుటవలగాని, వాడి పనిముట్లవల్లగాని అవయవములకు గాయములు కలుగవచ్చును. యంత్రముల నడుపు నిపుణులకు, రసాయన శాస్త్రజ్ఞులకు, గనుల యజమానులకు, కష్టముతోకూడిన లాభయోగము. 3, 4, 5 ధనాభావము, ఆటంకములు, నిందలు. ఆపైని ప్రయాణము, సోదర సహాయము, కార్యలాభము కలుగును.

## * కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] *

గత రెండు వారములనుండి వచ్చుచున్న ఆటంకములను గడచి, అధికారుల సహాయముచేతను, మీ యుక్తి చేతను కార్యసిద్ధి పొందుతారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. 3, 4, 5 తొట్రుపాటువల్ల యేమి చేయుటకూ తోచదు. ఆ పైని కార్యక్రమము ఒక రూపములో నడుస్తుంది. ప్రయాణము, అధికారుల ఆదరణ, బంధుదర్శనము, ధనలాభము, కార్యసిద్ధి కలుగుతవి. డాక్టర్లకు, గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. విద్యార్థులకు మేలుగా వుంటుంది. కవులు నూతన రచనలు మొదలు పెడతారు.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము మీకు యోగకాలము. ఉన్న ఇబ్బందులు తీరుతవి. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అవుతవి. పురుష సంతానము లాభము కొరకు కొన్ని ఏర్పాట్లు చేస్తారు. కొత్త

బి. నరసింగరావు.

కార్యాలు ప్రారంభిస్తారు. ప్రభుత్వ సన్మానము జరుగుతుంది. పండితులతో జ్యోతిష గోష్ఠి జరిపి నూతన విషయాలు తెలుసుకుంటారు. 3, 4, 5 ఏమిచే సేందికి తోచదు. ఆపైని వారమంతా యోగదాయకముగా వుంటుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మేలు కాలము.

## * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు యోగదాయకమైననూ, మానసికాందోళనతో నిండివుంటుంది. ధనయోగము కలుగుతుంది. గానసభలు, కవితాగోష్ఠివంటి వినోదాలతో బంధుమిత్రులతో కలిసి పాల్గొంటారు. ఇదివరకు అనారోగ్యముతోవున్న దూరస్తులైన ఆప్తులు కోలుకున్నట్టు క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. కవులకు, గాయకులకు, నటీనటులకు వారమంతా యోగకాలము. నూలు, బట్టలు, వెండి నగలు, బియ్యము వ్యాపారస్తులకు లాభము. 3, 4, 5 మానసికాందోళన ఆపైని ధనయోగము, నీటిపై ప్రయాణము, కార్యసిద్ధి, శుభకార్యములలో విందు, వినోదము.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

గత వారము పూర్తికాకుండా వుండిపోయిన పనులు ఈ వారము లాభకరముగా ముగుస్తాయి. ధనయోగము అనుకున్నదానికన్నా ఎక్కువగా వృద్ధి అవుతుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. సాంఘిక సేవచేసి కీర్తి పొందుతారు. విద్యార్థులకు మేలుకాలము. నూతన గృహనిర్మాణమునకు ఆలోచనలు చేస్తారు. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికార హోదాలు పెరుగుతవి. వాహనయోగము కలుగుతుంది. 3, 4, 5 తేదిలలో తెమలని కార్యక్రమము. ఆ పైని ప్రయాణము, ధనలాభము, సంఘసేవ, స్త్రీలతోనూ, ఆప్తులతోనూ విందు, వినోదము. భార్యకు అలంకార ప్రాప్తి.

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము తలపెట్టిన కార్యములకు ఆటంకములు కలుగుతవి. కార్యభారమువల్ల తీరుబడి వుండదు. ఆర్థికస్థితి సరిగా వుండనందున గృహావసరములకు యిబ్బంది కలుగుతుంది. వేళ తప్పిన భోజనమువల్ల కడుపుమంట, తల పోటువంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందుట మేలు: వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్తులకు ఒత్తిడివున్నా అధికారుల మన్నన పొందుతారు. రాజకీయవాదులకు మేలుగా వుంటుంది. విద్యార్థులకు చదువు సరిగా జరగదు, 3, 4, 5 కార్యభారము, త్రిప్పట అనారోగ్యము. ఆ పైని అలజడిగావున్నా కార్యలాభము, ధనయోగము.

## *పుష్యమి [హూ, హే, హో, డా]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. నిరాశగా వుంటుంది. కాని క్రమేణా మిత్రుల సహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన ఉద్యోగస్తులకు బదిలీ అయే సూచనలున్నవి, వర్తకులకు మాంద్యము విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. ప్రభుత్వముచే రహస్యములను కనిపెట్టడానికి నియోగించబడతారు. 3, 4, 5 మనోవ్యధ, నిరాశ, గృహకలతలు, ధనలోపము ఆ పైని ప్రయాణము, మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయులతో, పరిచయము, విచిత్రవస్తు సంపాదన వంటి యోగములు కలుగుతవి. ఆప్తుల ఆరోగ్య చింత.

## * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము తలపెట్టిన పనులకు ఆటంకములు కలుగుతవి. ధనాభావమునకు తోడు బంధువుల రాకపోకలచే అధిక ఖర్చులవల్ల మనోవ్యధగా వుంటుంది. మతసంబంధమైన ఉపన్యాసములు వినుట, వ్యాసములు చదువుట, సాధు సాంగత్యము, ఆధ్యాత్మిక చింతచే మనోవికాసము కలుగుతవి. ఉద్యోగస్తులు కొంత శ్రమపడిన మీదట మేలు పొందుతారు. వర్తకులకు అకస్మాత్తుగా

ధనలాభము కలుగుతుంది. 3, 4, 5 అధిక ఖర్చులు, గృహకలతలు, ఆటంకములు. ఆప్తుల ఆరోగ్యము సరిగా వుండదు. ఆ పైని ధనలాభము, సాధు సాంగత్యము ఆత్మ విశ్వాసము.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము బుద్ధి మాంద్యము ఎక్కువగా వుంటుంది. యత్న కార్యములలో జయము లేక పోవుట, వ్యర్థముగా తిరుగుట, సజ్జన విరోధమువంటి చెడుఫలితాలు కలుగుతవి. పరోపకారమునకు పూనుకొని సాగక మాట పడి విచారము పొందుతారు. ధనలోపము తీరిందికి ఎక్కువ తాపత్రయము పొందుతారు. దావాలలో గెలుపు వుంటుంది. ఉద్యోగస్తులకు సెలవు పెట్టవలసి వస్తుంది. అపరదినుసులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభము. 3, 4, 5 వివాదము ఆటంకములు, భార్య ఆరోగ్యముచే చింత. మొత్తము మీద వారమంతా ఆందోళనగానే వుంటుంది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈ వారము రాబడికి మించిన ఖర్చులు కలుగుటచేతను అప్పుచేయవలసి వస్తుంది. మొదలు పెటిన పనులకు ఆటంకములు కలిగినా అధైర్యపడక ప్రయత్నించి తుదకు ఫలము పొందుతారు శరీరము పైని కురుపులు లేస్తాయి. అగ్నివలగాని, యంత్రముల వల్లగాని ప్రమాదము జరగవచ్చును. ఉద్యోగస్తులకు అధికారుల పోటు మాటలచే మనోవ్యథ. సోదర సహాయము కలుగుటవల్ల ఇదివరకు చేసిన అప్పు తీరుస్తారు. భూస్వాములకు, గనుల యజమానులకు వారమంతా శ్రమతో కూడిన లాభము. 3 4, 5, ఆటంకములు అప్పు ప్రమాదభయం. పోలీసుశాఖలో వారికి మేలుకాలము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### [టే, టో, పా, పీ]

ఈ వారము మీకు ధనయోగము. వ్యవహారములలో జయము, శుభకార్యములలో పాలొనుట, బంధుదర్శనము, విద్యాప్రాప్తి, నూతనకార్యయత్న లాభము. మంచి ఉత్తరములు ఈశాన్యదిక్కునుండి వచ్చుట, జ్ఞానమార్గ ప్రసంగము, యుక్తిగా ప్రసంగించుట, గణిత జ్యోతిషశాస్త్రచర్చలు సుఖ భోజనమువంటి మంచియోగాలు కలుగుతవి. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి కంచు మొదలగు సరుకుల వ్యాపారస్థులకు లాభము. కవులకు శిల్పులు చిత్రకారులు నటీనటులకు మేలుకాలము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు.

### * హస్త [పూ, ష, ణా, ఠ] *

ఈ వారము శుభకార్యములలో పాల్గొనుట, పుత్రప్రాప్తి సూచనలు ధనలాభము, బిరుదులుపొందుట, ఆకస్మిక ప్రభుత్వ సన్మానము, ఘనకార్యాచరణ ప్రయత్నములు దేవబ్రాహ్మణ భక్తి, పుణ్యకార్యములు చేయుట, పుణ్యకార్యములలో పాల్గొనుట, పుణ్యక్షేత్ర సంచారము, వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలువంటి రాజయోగాలు కలుగుతవి. విద్యార్థులకు మేలుగా వుంటుంది. న్యాయస్థానోద్యోగులకు న్యాయవాదులకు పండితులకు ఉపాధ్యాయులకు వారమంతా మేలుగా వుంటుంది.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీరు వినోదములలో పాల్గొనుట, దధి, క్షీర, మధుర పదార్థ సుఖభోజనము వెండిపాత్రలలో చేయుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము తెల్లనివస్తువులు కొనుటవంటి మంచియోగాలు కలుగుతవి. ప్రతి, దూది, నూలు తెల్లని వస్త్రములు వెండి బియ్యము, ద్రవపదార్థ వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు గాయకులకు నటీనటులకు మేలుకాలము. వారమంతా శుభయోగాలున్నా భయాందోళనలతో కూడి వుంటుంది.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము ధనధాన్యవృద్ధి, పశుసంపద కృషిమూలకముగా లాభము వివాహాది శుభ కార్యములలో పాల్గొనుట ఇష్టవస్తులాభము పరోపకారమువల్ల కీర్తి, ప్రభుత్వ కార్య నిర్వహణవల్ల గౌరవమువంటి రాజయోగాలు కలుగుతవి. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. వర్తకులకు ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు గాయకులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము. 3, 4, 5 కుటుంబకలహము. ఆ పైని శుభయోగములు.

### * విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరనందున స్పర్థలు. ఆరోగ్యము సరిగా లేని సూచనలు కనబడగానే ఔషధసేవ చేయుటే కాక గ్రహరాజైన రవికి శాంతి చేయుట మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. 3, 4, 5 కార్యభారము. త్రిప్పట, అనారోగ్యము, ఆ పైని పితృవర్గం నుండి సహాయము కార్యలాభము కలుగుతవి. రాజకీయవాదులకు ఆందోళన.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము అనుకొన్న సొమ్ము సకాలములో చేతికిరాదు. కార్యాచరణకు పాలుపోని అనిశ్చితస్థితిలో వుంటారు. చేదా మనుకున్న పనులకు మొదట్లో ఆటంకములు కలిగినా వారాంతమునకు మిత్రసహాయమువల్ల కార్యానుకూలత పొందుతారు. వర్తకులకు నిరాశగా వున్నా వారాంతమునకు లాభము. ఉద్యోగస్తులకు వనపర్వత ప్రాంతములకు బదిలీ అయ్యే సూచనలున్నవి. 3, 4, 5 అనిశ్చిత స్థితి, ఆటంకములు, ఆప్తుల ఆరోగ్యము గురించి చింత. ఆ పైని ప్రయాణము, విదేశీయులతో స్నేహము, విచిత్రవస్తుసంపాదన, మిత్రసహాయము, కార్యలాభము.

### * జ్యేష్ఠ [నో, యా, యి, యూ]

ఈ వారము మీకు మిశ్రమయోగము. ధనలోపము వుంటుంది. అనుకున్నట్టుగా పనులు జరగవు. కోరిన సహాయములభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారమువేసి కార్యసాధనకు ప్రయత్నించి ఫలమును పొందుతారు. వర్తకులకు చాలాకాలమునుండి వసూలు కాకుండా నిలిచిపోయిన పాతబాకీలు తిరు మానమవుతవి. ఉద్యోగస్తులు అధికారుల అనాదరణచే బాధపడతారు. 3, 4, 5 ధనలోపము, ఆటంకములు, ఇంట్లో వారి అనారోగ్యముచే ఆందోళన. అటుపైని పుణ్యపురుషుల సాంగత్యము, ఆత్మవిశ్వాసము, శాంతి, పుణ్యక్షేత్రసంచారము, దేవతాదర్శనము, నష్ట ద్రవ్యలాభము.

### * మూల [యే, యో, బా, బీ]*

మీ ఆలోచనల ప్రకారము కార్యక్రమాలు కొనసాగించుకొనడానికి కొందరు అడ్డువస్తూవుంటారు. కొన్ని సందర్భాలలో

### ధరలు:

నూలు, వస్త్రములు: తగ్గును.

నూనె దినుసులు: నిలబాటుగా వుండును.

బెల్లము, పంచదార, చింతపండు: మందముగానుండును.

ఆహారధాన్యములు: సమస్థాయిలో నుండును.

పప్పుదినుసులు: స్వల్ప తేడాలో నుండును.

వెండి. బంగారము: మందమగును.

సువృష్టిగా వర్షించును.

* * *

జన్మనక్షత్రము బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారి వారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు చూచుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమున్నా, హృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.



# నక్షత్రఫలితాలు



అశాంతి, బంధువిరోధము వస్తవి. ఇచ్చి పుచ్చుకొనడములలో వివాదాలు వస్తవి. కోర్టు వ్యవహారములు, అనుకూలముగా తీర్పు వున్నా మరికొన్ని కొత్తచిక్కులు కలుగుతవి. భార్య ఆరోగ్యము చెడే సూచనలున్నవి. కొర్రలు రాగులు వంటి అపరదినుసులు, మినుములు, ఉప్పు, నువ్వులు, నూనె సరుకుల వర్తకులకు లాభము. అన్యజాతి వారివల్ల గౌరవము కలుగుతుంది. 3, 4, 5 ఆటంకాలు, వివాదాలు, త్రిప్పట, శ్రమ, ఆపైని కొంత యోగదాయకముగా వుంటుంది.

### *పూర్వాషాఢ [భూ, ధ, భా, ఢా]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా కార్యసాధనలో అనేక ఆటంకాలు కలుగుతవి. సాహసము పట్టుదల కలవారగుటచేతను నిరుత్సాహము పొందకుండా కలిగిన చిక్కులను విప్పుకొని మేలుపొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. జాగ్రత్తగా వుండుటవల్ల అవయవములకు దెబ్బలు తగిలే ప్రమాదము తప్పవచ్చును. 3, 4, 5 కార్యభంగము, మనోవ్యథ, ప్రమాదము ఆపైని సోదరసహాయము, ధనలాభము, కార్యానుకూలత కలుగుతవి. గనులయజమానులకు, భూగర్భశాస్త్రజ్ఞులకు, లోహ, ఖనిజ వ్యాపారస్థులను, పోలీసుశాఖ ఉద్యోగులకు కష్టముతో కూడిన యోగము.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీరు ధైర్యముతో వృత్తి ఉద్యోగాలలో ముందడుగు వేసి హోదా, ఆదాయము పెంచుకోగలుగుతారు. కొత్త అనుకూలతలు యేర్పడుతవి. మీ బుద్ధి బలమువల్ల ఉపద్రవాలను సాధించుతారు. మీరు వేసుకున్న పథకం ప్రకారము అన్నివిధాలా డబ్బు చేతికందుతుంది. ఈశాన్య దిక్కునుండి బంధువుల కుశలవార్త విని సంతోషము పొందుతారు. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు యోగకాలము. కవులు నూతన రచనలు మొదలు పెడతారు. విద్యార్థులకు మేలుగా వుంటుంది.

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము మీకు యోగప్రదము. గత వారము అవకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము సుముఖమవుతవి. అధికారముతో పాటు ధనాదాయముకూడా పెరుగుతుంది. బిరుదులు పొందుట, సన్మానమువంటి రాజయోగములు గలవు. పండితగోష్ఠి, నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగుతవి. పిల్లల యోగక్షేమాలు విషయములో మీరు కొన్ని యేర్పాట్లు చేస్తారు. వర్తకులకు లాభయోగము. విద్యార్థులకు మేలుకాలము. న్యాయస్థాన ఉద్యోగస్థులకు, ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు మంచికాలము.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము లౌకిక వ్యవహార రంగములో చాలా జయప్రదముగా వుంటుంది. ఆదాయము ఎక్కువవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుపడుతుంది. నీటిపై ప్రయాణము చేయవలసి వస్తుంది. కవితాగోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో బంధుమిత్రులతో కలిసి పాల్గొంటారు. విద్యార్థులకు మేలు కాలము. దధిక్షీర మధుర పదార్థ యుక్త సుఖభోజనము చేస్తారు. బియ్యము, నూలు, బట్టలు, వెండి వ్యాపారస్థులకు లాభము, కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 3, 4, 5 మానసికాందోళన, ఆపైని శుభయోగములు.

### * శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము మీరు గౌరవ మర్యాదలు పొందగలుగుతారు. ఇతరుల శాంతి సౌఖ్యాల కోసము మీరు ఎంతైనా శ్రమపడి కీర్తి పొందుతారు. ఆప్తుల శుభకార్యాలలో పాల్గొని స్త్రీలతోనూ బంధుమిత్రులతోనూ కలిసి విందు, వినోదములతో సంతోషపడతారు. విద్యార్థులకు మంచికాలము. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ద్విగుణలాభము పొందుతారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 3, 4, 5 అధిక ఖర్చులు, ఆపైని శుభయోగములు.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారము కార్యభారము ఎక్కువ. రాజ వార్తా ప్రసంగములు, వింత మాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ధనలాభము, ప్రయాణము వుంటవి. అకాలభోజనమువల్ల వేడిచేసి కళ్లమంట, కడుపునొప్పి, బలహీనత వంటి సూచనలు కనబడగానే ఔషధ చికిత్స చేయించుకొనుట మేలు. ఉద్యోగస్థులకు బదిలీ అగుటగాని ఒత్తిడికి తట్టుకోలేక సెలవు పెట్టుటగాని జరుగును. విద్యార్థులకు చదువు సరిగా జరగదు. 3, 4, 5 ప్రయాణము, అనారోగ్యము. ఆపైన ఘనత, ధనలాభము, కార్యసాధన.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

ఈ వారము ప్రతిపనికి అనవసరముగా ఆలస్యము జరుగుతుంది. ఏపని చేసేందుకు సమాధానము కుదరక చికాకు పడతారు. ఆశాభంగము ఎక్కువ. వర్తకులకు లాభము తక్కువ. రహస్యభేదనోద్యోగములో చాతుర్యమువల్ల జయము పొందుతారు. ఉద్యోగస్థులకు వన పర్వతప్రాంతములకు బదిలీ అవవచ్చును. వారాంతమున అంతవరకూ తటస్థముగావున్న మిత్రుని సహాయమువలన కార్యానుకూలతను పొందుతారు. ప్రయాణములో కలిసిన విదేశీయులతో స్నేహము ఏర్పడి అపురూపవస్తుసంపాదన చేస్తారు. 3, 4, 5 ఆటంకములు, ఆత్మీయుల ఆరోగ్య చింత, ఆపైని మిత్రసహాయము, కార్యసిద్ధి.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము మీరు ఎవరిసహాయము పొంది కార్యములు చేసుకొందామనుకున్నారో ఆ వ్యక్తివల్లనే ఆటంకములు కలుగుతవి. ధనాభావం ఎక్కువగా వుంటుంది, ఆధ్యాత్మికచింతకలవారగుటవల్ల ఈశ్వరకృపచే అన్నికష్టములుతీరి క్రమేణా కార్యానుకూలత కలుగుతుంది ఇంట్లో వారిఆరోగ్యము ఆందోళన కలుగజేస్తుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి, వ్యాపారస్థులకు మొదట్లో నిరాశగా వున్నా వారాంతానికి కొన్నాళ్లనుండి రాకుండా నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. విద్యార్థులకు చదువు సరిగా జరగదు. 3, 4, 5 వ్యర్థముగా తిరుగుట, ఆటంకములు, ఇంట్లో అనారోగ్యము, ఆపైని కొంతవరకూ కార్యానుకూలత, నష్టద్రవ్యలాభము, పుణ్యక్షేత్రసంచారము, దేవతాదర్శనము. ★





# స్త్రీలు - ఉన్నత విద్య

కొన్ని సంవత్సరాల క్రితం మన సమాజంలో "స్త్రీలకు విద్య అసలు అవసరమా? కాదా?" అనునది చర్చనీయాంశంగా వుండేది. ఈరోజుల్లో స్త్రీవిద్యయొక్క ఆవశ్యకత సామాన్యంగా ఆమోదింపబడి, ప్రధానమైనదిగా గుర్తింపబడినది. చాలామంది బాలికలు హైస్కూళ్ళలో చదువుచున్నారు. అవకాశం కలవారు కాలేజిచదువులకు వెళ్ళి డిగ్రీలను పొందుచున్నారు.

వనితాలోకం శీర్షికలో శ్రీమతి టి. ప్రభావతిగారు స్త్రీలచదువుకు 75% సార్థకత లేదని సోదరీమణులు ఎందరు పై అభిప్రాయంతో యేకీభవిస్తారో అని వ్రాశారు. ఈ వ్యాసం చదివాక స్త్రీల వున్నతవిద్యపై నాకు తోచిన విషయాలను వ్రాయాలనిపించింది: స్త్రీల వున్నతవిద్యకు యెంతవరకు సార్థకత గలదు అను విషయాన్ని చర్చించేముందు, స్త్రీలు వున్నతవిద్యను పొందుటలోని లక్ష్యాలేమిటో వుపయోగాలేమిటో అవసరాలేమిటో తెలిసికోవడం యెంతైనా ముఖ్యం.

విద్యయొక్క ప్రధానలక్ష్యం విజ్ఞాన సముపార్జన అని అందరకూ తెలిసిన విషయం. విద్యాభివృద్ధియైనకొలది మానవదృక్పథం విశాలం కాగల అవకాశం వున్నది.

హైస్కూల్ చదువుతో సామాన్య లోకజ్ఞానంపొందగల స్త్రీలకు వున్నతవిద్య (అంటే డిగ్రీ చదువుగా అర్థంచేసుకోవాలని మనవి) భావస్వాతంత్ర్యాన్నీ, ప్రత్యేకమగు వ్యక్తిత్వాన్నీ, ప్రపంచ పరిసిథులను విశాల భావంతో అర్థంచేసుకొనగల శక్తినీ యిస్తుంది.

ఉన్నతవిద్యను గలిగిన స్త్రీ ఆర్థికంగా స్వశక్తిపై నిలబడగల సామర్థ్యాన్నిగలిగి, స్వతంత్రజీవనం చేయగలిగివుంటుంది. తల్లిదండ్రులు వృద్ధులై వేరు ఆధారంలేక యున్నప్పుడు వున్నతవిద్యను గలిగిన బాలికలు వుద్యోగంచేసి తల్లిదండ్రులపోషణ భారాన్ని నిర్వహించగలరు.

భర్త సంసార నిర్వహణకు తగు ధనం సమకూర్చలేని పరిస్థితిలో వుద్యోగంచేసి కుటుంబపోషణకు సహాయకరంగా వుండగలదు.

పరిస్థితుల ప్రాబల్యంవలన భర్త్రు తిరస్కృతగాని, భర్త్రు విహీనగాని అయిన ఉన్నత విద్యగల స్త్రీ, తన జీవనానికి పరులపై ఆధారపడు నగత్యం లేకుండా ధనార్జనచేసి స్వశక్తిపై జీవించగలదు.

ఇక వున్నత విద్య మన దేశంలో స్త్రీలకు యెంతవరకు అవసరం అనేది చూద్దాం.

మన దేశంలో తిండి, బట్ట, మొదలగు ముఖ్యమైన నిత్యజీవితావసరాలకు అనేక

**అన్నంరాజు రమణమ్మ**

**(గుంటూరు)**

యిబ్బందులకు లోనయేది హెచ్చుగా మధ్య తరగతి ప్రజలే. ఈ మధ్య తరగతి సంసారాల్లో, ఆడపిల్లలకు వున్నత విద్య చెప్పించడమనేది మిక్కిలి అధికమైనభారం. ఈ భారాన్ని మోయలేక కృంగిపోతున్న సంసారాలు అనేకంగా వున్నాయి. ఇంటిబాధ్యత అంతా పైనగలతల్లి పనులను ఇతరులచే చేయించుకునే తాహతులేక, చదువులకు పోయే ఆడపిల్లల సహాయంలేక వంటరిగా గృహ నిర్వహణ భారాన్నంతా వహించవలసి వస్తున్నది. పిల్లల చదువులకు, ఆయ్యే ఖర్చు భరించడంకూడా సామాన్యంకాదు.

వున్నత విద్యయొక్క ప్రధాన లక్ష్యం వుద్యోగం చేయగల సమర్థతను సంపాదించడం. ఈ నాడు మన దేశంలో డిగ్రీలను పొందిన స్త్రీలలో అనేకులు వుద్యోగాలను చేయడంలేదు. చదువు పూర్తి చేయగానే గృహిణులై సంసార బాధ్యతలను స్వీకరిస్తున్నారు. స్త్రీలు అత్యధికమైన స్వేచ్ఛా స్వతంత్రాలను గలిగి, పురుషులతో సమానంగా సంఘంలో మెలుగుతూ వుండే పాశ్చాత్య దేశాల్లోనే అనేకమంది స్త్రీలు పెండ్లి చేసుకొన్న వెంటనే వుద్యోగాలు మానివేసి గృహనిర్వహణలో స్థిరపడుతున్నారు.

స్త్రీలు వుద్యోగాలు చేయడంవలన కుటుంబజీవనంలోని పరిసితులు యెన్నో తారుమారవుతాయి ఇంటిపనులకీ, పిలల పెంపకానికీ ఇతరులపై ఆధారపడవలసి వస్తుంది. వుద్యోగంచేసి ఆర్జించిన ధనం పనిమనుషుల్ని పెట్టుకోవడానికీ, పిల్లల పెంపకానికి ఖర్చువుతుంది. దీనికి మారుగా స్త్రీలు తమ పనులు తామే చూసుకుంటే స్వయంగా చేసుకున్న తృప్తివారికి లభిస్తుంది.

వుద్యోగాలు చేసుకునే స్త్రీలూ, విద్యకోసం కాలేజిలకూ స్కూళ్ళకూ పోయే స్త్రీలూ, సంఘంలో అనేకుల అవహేళనలకూ విమర్శలకూ గురవుతున్నారు. శ్రీమతి ప్రేమలీలగారు వ్రాసినట్లు "సెనింక కాలేజికి పోనమ్మా" అనే పరిస్థితి బాలికలకు లేకుండా వుండాలి.

స్త్రీలు వున్నత విద్యను గలిగినవారై వుండుటకు మనదేశపు ఆర్థిక పరిస్థితి యెంతో అభివద్ధిని గాంచవలసి యున్నది. చదువుకునే స్త్రీలు సంసారాలకు ఆర్థికంగా భారంకానప్పుడే వారి చదువుకు తగిన అవకాశం కలగగలదు.

విద్యావతులైన స్త్రీల స్వతంత్రం, వారి వ్యక్తిత్వం, సమాజంలో గుర్తింపబడినప్పుడే వారి చదువు సార్థకం.

భారతస్త్రీ ప్రాచీనకాలంనుండి, వినయ విధేయతలకూ సచ్ఛీలానికీ, సాటిలేని వనితగా ప్రపంచ ఖ్యాతిని గాంచినది. మన

## స్త్రీలు ఉన్నత విద్య

గృహిణీ ధర్మం కుటుంబ జీవనం, ఆదర్శవంతమైనవిగా పరిగణింపబడినవి. ఉన్నత విద్యను గలిగిన ఈనాటి స్త్రీలు మనపూర్వపు సంప్రదాయాలనూ, ప్రాచీనజ్ఞానాన్ని విస్మరించక నూతన పరిస్థితులను తమ ధర్మ నిర్వహణకు సమన్వయపరచ గలిగినప్పుడే వారు తమవిద్యను సార్థకపరచుకొనగలవారవుతారు.

మన సంఘంలో స్త్రీకి గల స్థానం ఒక పురుషునికి భార్యగా, ఒక యింటి యిల్లాలుగా మాత్రమే. భర్త, భార్య, పిల్లలు మొదలైనవారంతా కలిసిన సమిష్టి కుటుంబానికి పురుషుడు యజమాని. సమాజంలో ఆ కుటుంబానికి అతడే ప్రతినిధిగా భావింపబడతాడు. స్త్రీకి ప్రత్యేకమైన వ్యక్తిగా మన సంఘంలో ప్రాధాన్యం లేదు. ఈ విషయంపై మన సంఘంలో అనేక ఆచారాలూ, పద్ధతులూ, మన సాంప్రదాయం, ఆధారపడివున్నవి.

స్త్రీలు ప్రకృతి సిద్ధంగా ఒకరిచేరక్షింపబడి, ఆదరింపబడి, పోషింపబడ గోరుతారు. తమ బాధ్యతలను ఒకరు వహించాలని కోరుతారు. ఇది వారికి సహజసిద్ధమగు వాంఛ. అట్టి తమ నైజానికి లోబడి, పురుషుడు సంపాదనభారం వదలి తమపైగల గృహ నిర్వహణ భారం నిర్వర్తించుట స్త్రీల ప్రథమ కర్తవ్యం కాదా?

ఈనాటి వున్నత విద్యావతులగు స్త్రీల విద్యయొక్క సార్థకత విద్యవారి కివ్వగల సంస్కారంపైనా, సహృదయతపైనా, విద్య సంఘంలో వారి పరిస్థితిలో కొనిరాగల మార్పులపైనా కలదుగాని పైపై ఆడంబరాలోనూ, బాహ్య చిహ్నముల పైనా ఆధారపడిలేదు. ఈ విషయం ఉన్నత విద్యావతులైన ఈనాటి మన స్త్రీలందరూ గుర్తించుట యెంతైనా అవసరం. ఈవిషయం విస్మరింపబడిననాడు స్త్రీల వున్నత విద్యా, తలిదండ్రుల వ్యయ ప్రయాసలూ, వృథా అని భావించవచ్చును. ★



## 'ఉన్నతవిద్య ప్రయోజనాలు



## పరిశీలించడానికై....'

ఇపుడు మనం అమలుజరుపుతున్న ప్రణాళిక, దీని తరవాత రాబోయే ప్రణాళికలూ అనుకున్నట్టు సాగాలంటే, అనేక శాఖలలో స్త్రీలు పాల్గొనడం అవసరం. అయితే వాళ్లకి కొంత చదువు ఉండాలి. అన్నిటికన్నా ముఖ్యం ఆయా పనులలో వారు తరిఫీదు అయిఉండాలి. నేర్చుకున్న దాన్ని పలుగురికి నేర్పే సామర్థ్యం ఉండాలి. ఇవన్నీ ఉన్నవాళ్ళు చాలా తక్కువమంది. అవసరంతో పోల్చి చూస్తే చదువుకుంటున్న ఆడపిల్లలు కూడా, చదువు స్కూలుఫైనలులోగాని, డిగ్రీదగ్గర గాని ఆపేసినా, వెంటనే (గుమాస్తాతప్ప) ఏదో ఒక పని చేయాల్యలంటే, అందుకు అర్హులైఉండటం లేదు. అపుడు, వాళ్ళు చేయ్యదలచుకొన్న పనిలో శిక్షణ పొందడానికి మరికొన్నాళ్ళు పట్టుతుంది. అది పూర్తిఅయి ఉద్యోగంలో ప్రవేశించాక, అంతకుముందు సంపాదించుకొన్న డిగ్రీ చదువు ఏమంత పనికొస్తున్నట్టు కనిపించదు. అటువంటపుడు ఆ లెక్కలూ, జాగ్రఫీ, లాటి వాటితో ఎందుకు అవస్థపడ్డట్టు?

ఈ ప్రశ్నకి సమాధానం తేల్చడానికి పెద్దలంతా ఒక సంఘంగా ఏర్పడి వివరాలు సేకరిస్తున్నారు. దాని పేరు జాతీయ మహిళా విద్యాపరిశీలక సంఘం. కేంద్ర స్త్రీ సంక్షేమ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ దానికి అధ్యక్షురాలు. వీరు ఆగస్టు తొలివారంలో మద్రాసులో సమావేశం జరిపారు.

పల్లెలలోనూ, పట్నాలలోనూ ఆడపిల్లలు ఎందరెందరు చదువుకుంటున్నారు, ఎందాకా చదువుకుంటున్నారు, చదివాక ఏం చేస్తున్నారు, ప్రాథమిక విద్యకి పైన వాళ్లు నేర్చుకున్న చదువుని ఎలా, ఎంతవరకు ఉపయోగించుకుంటున్నారు అనే విషయాల గురించి వీరు వివరాలు సేకరిస్తారు.

అపైన పల్లెటూళ్లలో ఆడపిల్లలు ఇప్పటికన్న ఎక్కువమంది చదువుకోడానికి ఏం చెయ్యాలో సూచిస్తారు. పల్లెలా పట్నాలా కూడా, ఆడపిల్లలు ఎన్నాళ్లు ఎటువంటి విద్య నేర్చుకుంటే బాగుంటుందో, వాళ్లకీ, దేశానికీ ఏదిమంచిదో ఇప్పటి పాఠ్య ప్రణాళిక ఆడపిల్లలకు ఉపయోగపడుతోందో లేదో పరిశీలస్తారు. లేనిపక్షంలో (లేదనీ ఈనాడు చాలమంది అంటున్నారు.) ఆడపిల్లలకు ఎంతవరకు చదువుచెప్పి, ఎక్కడనించి వృత్తి విద్యలలో శిక్షణ ఆరంభించి అందుకు సంబంధించిన విషయాలు నేర్పాలో సూచిస్తారు. ★

## రెండవ ప్రణాళికలో స్త్రీలకు ఎక్కువ ఉద్యోగావకాశాలు

రెండవ పంచవర్ష ప్రణాళిక సాగుతున్నకొద్ది స్త్రీలకు వివిధ రంగాలలో పోనుపోను ఎక్కువ ఉద్యోగావకాశాలు ఉంటాయని కేంద్ర ప్రభుత్వ కార్మికమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా గతివారం లోకసభలో చెప్పారు. రెండవ ప్రణాళికలో మొన్న ఏప్రిల్ తో రెండేళ్ళు పూర్తిఅయ్యాయి ముఖ్యంగా, నర్సులు, ఉపాధ్యాయినులు, హెల్త్ విజిటర్ లు, సంఘ సేవికలువంటి ఉద్యోగాలసంఖ్య పెరగడంద్వారా ఈ అవకాశాలు కలుగుతాయని ఆయన చెప్పారు.

కేంద్రకార్మికశాఖ, ప్రణాళికా సంఘం తాలూకు కార్మిక వ్యవహారాల మండలి వారూకలసి 1901 నుండి 1951 వరకూ రంగాలలో ఎందరు స్త్రీలు పని చేశారూ అన్న వివరాలు సేకరించారు. ఈ 50 ఏళ్ళలోను కేవలం స్త్రీల సంఖ్యను బట్టిచూసినా, పురుషుల సంఖ్యతో పోల్చి చూసినా, మొత్తం మీద (వ్యవసాయం వంటివి మినహా) స్త్రీ ఉద్యోగులసంఖ్య తగ్గినట్లే తేలిందట.

1951 నుండి 56 వరకు సేకరించిన వివరాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి. అనేకరంగాలలో స్త్రీల సంఖ్యక్రమేపీ పెరుగుతో వచ్చింది. ★

# బెంగాలీ స్త్రీలు

చాలా రోజులనుండి నేను బెంగాలివాళ్ల యొక్క ఆచారములు, వారిగురించి నాకు తెలిసినంతవరకు, రాయాలని అను కొంటున్నాను. మనము ఏ ప్రదేశములో నున్నా, అక్కడివారితో కలసి మెలసివుంటే, మన జీవితము ఆనందముగా గడచిపోతుంది. ఉద్యోగరీత్యా మన పుట్టిన ఊరువదలి, భర్తతో అనేక ప్రదేశములు చూడవలసిన అవశ్యకత ఏర్పడుతుంది.

మా అత్తవారు చాలకాలంగా ఉద్యోగ రీత్యా కలకత్తాలోనే నివసిస్తున్నారు. నాకు మాత్రము కలకత్తా క్రొత్త. వాళ్లందరికి, చిన్న పిల్లలతో సహా అందరికీ బెంగాలి వచ్చును.

బెంగాలివాళ్లకు మన తెలుగువారినిచూస్తే చాలా యిష్టం. వారు మనల్ని మద్రాసు వాళ్లని అంటారు. బెంగాలి నేర్చుకొన్న తెలుగువారినిచూస్తే వారికి ఎంతో అభిమానం. మేమున్నది బెంగాలివాళ్ల యింటి లోనే. వారు బ్రాహ్మణులు. బెంగాలి వాళ్లల్లో బ్రాహ్మణులు కూడా చేపలు తింటారు. మగవారు, ఆడవారు కూడా కాళికాదేవిని, లక్ష్మిని ఎక్కువగా పూజిస్తారు. ప్రతి యింటిలోను కాళివిగ్రహము ఉంటుంది.

బెంగాలివాళ్ళయిళ్లు చాలా శుభ్రముగాఉం టాయి. బట్టలదగ్గరనుంచి అన్నీ పనులూవారు స్వయముగా చూసుకొంటారు. ఇంటికి విజిటర్స వెళ్ళితే గౌరవముచేసి, ఆడవాళ్ళతో సహా అందరు ఆ వ్యక్తిని గౌరవించి, స్వీట్సు పెట్టి, టీ యిస్తారు. వారు ఎక్కువగా తీపి తింటారు. కారము తినరు. రొట్టెలు పప్పు ఎక్కువగా చేసుకొని తింటారు. అందుకే కలకత్తాలో తీపి వస్తువులు ఎక్కువ. రసగుల్లా, సందేష్ మొదలగునవి ప్రసిద్ధి.

వారి బొట్టు, కట్టుకూడ మనకి క్రొత్తగా ఉంటాయి. వారికి రి గజములు చీర సరిపోవును. వారికి పెండ్లికి ఖర్చు ఎక్కువ అవదు. ఒక్కగంటలో పెండ్లి జరిగిపోతుంది. పెండ్లికుమార్తె పాపిటలో పెండ్లి కొడుకుచేత సింధూరము పెట్టించి. చేతికి యినపగాజు తొడిగిస్తారు. అదే వారి పెండ్లి. పునిస్త్రీ పాపిటలో సింధూరమే అనవాలు. వాళ్లు నగలపై అంత మోజు పెట్టరు. బట్టలు మాత్రము చాలా నీటుగా వేసుకొంటారు. ఆ పనిఅయిన వెంటనే స్నేహితులకు బంధువులకు, మిఠాయి పంచి పెడతారు.

పెండ్లికుమార్తెకి అలంకరణ చాలాబాగా చేస్తారు. ఈమధ్య మా యింటికి ప్రక్కవాళ్ళయింటిలో పెండ్లి అయినది. మేము చూడ్డానికి వెళ్ళేము. మాకు బాగా మర్యాద చేసి స్వీట్సు యిచ్చేరు.

చాలామంది బెంగాలి స్త్రీలు ఉద్యోగములు చేస్తున్నారు. వారికి ధైర్యము చాలా ఎక్కువ. స్త్రీలే బజారుకు వెళ్ళి కావలసినవి తెచ్చుకుంటారు. బస్సులలోను, ట్రాములలోను స్త్రీలే ఎక్కువ. బెంగాలీ దేశములో స్త్రీని చాలా గౌరవముగా చూస్తారు. బస్సులలోను, ట్రాములలోను స్త్రీలకు చోటు యిస్తారు.

వీరికి దసరాపూజ ముఖ్యమైన పండుగ. వారు ఖర్చుపెట్టవలసిన ధనమంతా ఆరోజునే ఖర్చు చేస్తారు. ముఖ్యముగా జోళ్ళకోసము, బట్టలకోసము ఎక్కువగా ఖర్చు పెడతారు. ఆ పండుగ రోజుల్లో కలకత్తా పట్టణము కన్నులపండువుగా ఉంటుంది. రకరకాల మనుష్యులు రకరకాల అలంకరణలు. బెంగాలి స్త్రీలు కేశాలంకరణలో ప్రవీణులు. ఎన్నో రకాల హెయిర్ స్టయిల్స వారికివచ్చును. రకరకాలుగ జడలువేసుకొని ముడులు చుడతారు. చూచుటకు చాలా బాగుంటుంది.

మా యింటిచుట్టు బెంగాలివాళ్ళున్నారు. వారు మా యింటికివస్తూ ఉంటారు. మా అక్కయ్యతో మాట్లాడుతూ ఉంటారు. నేను కూడా యిప్పుడిప్పుడే నేర్చుకొంటు న్నాను. మాట్లాడుటకు చాలా సరదాగా ఉంటుంది. మనముకూడ అన్ని భాషలు మాట్లాడుటకు ప్రయత్నం చెయ్యాలి.

జయంతి రుక్మిణీదేవి, (కలకత్తా)

# స్త్రీలకు ఉద్యోగాలు చూపెట్టే సంస్థ

కొత్తపల్లి రాజ్యలక్ష్మి
(కొవ్వూరు)

అమెరికాలో మహిళలకు ఒక సంవత్సరం, అంతకు పైగాను ఉండే తాత్కాలిక ఉద్యోగాలు చూచిపెట్టడంలో అవిరళంగా కృషి చేస్తున్న స్త్రీ సేవాసంస్థ ఒకటున్నది. దీని పేరు 'కెల్లీ బాలికా సంస్థ'. 1946 లో రసెల్ కెల్లీ అనే గొప్ప వణిజుడు ఒకాయన దీనిని నెలకొల్పాడు.

డెట్రాయిట్ నగరంలో వ్యాపార సంస్థలలో తాత్కాలికంగా పనిచేయగల మహిళలు అవసరమైనప్పుడు, ఈ సంస్థలకు పని వారిని చూపడానికై యీ సంస్థ ఏర్పాటు అయింది. 1955 వ సంవత్సరం నాటికల్లా అది జాతీయ సంస్థగా అభివృద్ధిచెందినది. ఇప్పటికి ఎనభైఒక్క నగరాలలో ఆ సంస్థ కార్యాలయాలున్నవి. గతసంవత్సరం 28,000 వాణిజ్యవేత్తల కార్యాలయాల్లో 50,000 మందికిపైగా కెల్లీ మహిళలు (అంటే కెల్లీ సంస్థద్వారా ఉద్యోగాలు సంపాదించిన వారు) ఉద్యోగాలు చేశారు. ఈ సేవా సంస్థ దినదినప్రవర్ధమాన మవుతున్నది. 1958 అంతానికి దీనికి వంద శాఖా కార్యాలయాలను స్థాపించాలని అనుకుంటున్నారట.

'కెల్లీ మహిళ'లలో పద్దెనిమిది మొదలుకొని ఎనభై సంవత్సరాలవరకు వయసుగలవారున్నారు. "డెట్రాయిట్‌లో ఎనభయి ఆరు సంవత్సరాల వృద్ధురాలు ఒకామె కాంప్టోమీటర్ ఆపరేటర్ గా పనిచేస్తున్నదట. ఆమె తన పనిలో ప్రవీణురాలు అను విషయం వివిధ సంస్థలవారికి తెలుసు. అందుకే ఆమెను పంపించవలసినదిగా కోరుతుంటారు. వయసు మళ్లినా, పడుచువాళ్లకన్న చాలా చలాకీగా పనిచేస్తుంది. కెల్లీ మహిళలలో హెచ్చుమంది 32 మొదలుకొని 46 సంవత్సరాల వయసు లోపువారు. సగటున, 37 సం॥ వయసు కలిగిన వివాహితలు పిల్లలతల్లులుకూడా వున్నారు. సాధారణంగా ఒక కెల్లీ మహిళ ఒక సంవత్సర కాలంలో అయిదు వేర్వేరు సంస్థలలో పని చేస్తూవుంటుంది. వివిధ భావాలుగల మహిళలు యీ కెల్లీ మహిళాసేవాసంస్థలలో చేరుతుంటారు. వారిలో కొందరు ఏదో ప్రత్యేకావసరాలకి అదనంగా డబ్బును సంపాదించుకొనుటకు వస్తారు.

కెలీ మహిళలు చేయని పనిఅంటూలేదు. టైపిస్టు, స్టెనోగ్రాఫర్, బుక్ కీపర్, ఆఫీస్ మెషీన్ ఆపరేటరు, రిసెప్షనిస్టు మొ॥ వివిధ రకాల ఉద్యోగాలు వారు నిర్వహిస్తుంటారు. బహుభాషాకోవిదులైన వారు, ప్రత్యేక చదువులు చదివినవారు, రాయబార కార్యాలయాలలో దుబాసీలుగా పని చేస్తుంటారు. ఈ మహిళలలో అనేకమంది ప్రపంచంలో అనేక దేశాలనుంచి వచ్చినవారున్నారు. సర్వసాధారణంగా యీ మహిళలందరూ ఆఫీసులలో పైనచెప్పినతరహా ఉద్యోగాలు నిర్వహిస్తున్నప్పటికీ, ప్రత్యేక పదవులు కష్టమైన బాధ్యతలూ నిర్వహించే వారుకూడా కొందరున్నారు. ఉదా: ఒక ఇంజనీయరీ కళాశాల విద్యార్థిని ఒక భూభౌతిక పరిశోధన సంస్థలో ఇటీవల వదలిన కృత్రిమ ఉపగ్రహాల జాడలు పరిశీలించే వివరాలు సేకరించేటందుకు నియమింపబడినది. కెల్లీ కార్యక్రమాలకు పొదుపు, సౌకర్యం ప్రాతిపదికలుగా ఉంటవి. కెల్లీమహిళలకు ఎప్పుడూ, ఎక్కడో అక్కడ తాత్కాలిక ఉద్యోగాలు దొరుకుతూనే ఉంటవి. వారు మొట్టమొదటిసారి వారి శక్తిసామర్థ్యాలు చూపి పనిచేస్తే చాలు. తరువాత పరీక్షలకు కూర్చునీ ఉద్యోగాలకోరకు తిరిగి ప్రయత్నించవలసిన అవసరమే ఉండదు. "కెల్లీ మహిళలసేవ"ను తెలుసుకుంటూ వారి వారి యోగ్యతలను అనుసరించి ఏ నగరంలో నైనాసరే వారికి కావలసినవారిని ఎన్నుకొంటూ ఉంటారు. అంటే కెలీ మహిళ ఏ నగరంలో పని చేసినప్పటికీ ఆమెయొక్క సామర్థ్యం పరిశీలిస్తున్నవారు కొందరు ఉంటూనే ఉంటారన్నమాట.

(శ్రీమతి కేత్లీన్ ఐర్ష వ్యాసం ఆధారంగా)

# మండోదరి పునర్వివాహము

1

"మండోదరి రావణుని మరణానంతరం విభీషణుని యిల్లాలైంది" అని నా వ్యాసంలో నేను వ్రాసిన విషయం పైన వచ్చిన విమర్శల చదివాను. మొదట శ్రీమతి జె. వర్ధనమ్మగారు యీ విషయం తాము చదివిన అనేక రామాయణాల్లో ఎందులోనూ లేదనీ నేను ఎక్కడైనా చదివితే తప్ప లేకపోతే సరిదిద్దుకోమనీ వ్రాశారు.

ఈ విషయం 'విచిత్ర రామాయణం'లో చదివినట్లు జ్ఞాపకం వున్నా, పద్యాలు ఉదహరించేందుకు ఆపుస్తకం అప్పట్లో అందుబాటులో లేక ఊరుకోవలసి వచ్చింది. తర్వాత శ్రీ డి. కళానిధి శర్మగారు జూలై 2వ తేదీ పత్రికలో ఆ పద్యములు ఉదహరించారు. వారికి నా కృతజ్ఞత.

16వ జూలై పత్రికలో మరి యిద్దరు పాఠకులు యిదే విషయాన్ని గురించి వ్రాశారు. అందులో శ్రీమతి అల్లాడి రమ చర్చనీయాంశాలు వున్నప్పుడు వాల్మీకి రామాయణం ప్రమాణంగా తీసుకోవాలనీ, ఆర్యద్వేషులగు కొందరు దక్షిణదేశ రాజకీయ వాదులు రాముని నిందకునిగా చేసి వ్రాసిన గ్రంథం ఆధారంగా తీసికోదగినది కాదనీ, వ్రాశారు. ఈ క్రింది విషయాలు సవినయం వారి దృష్టికి తేగోరుతున్నాను.

1. విచిత్రరామాయణ కర్త గత శతాబ్దికి చెందినవాడని అంచనా వేయబడుచున్నది. ఈయన 'ఆర్యద్వేషుల'గు దక్షిణదేశ రాజకీయ నాయకుల పక్షమునకు చెందిన వాడు కాడనీ, అటువంటి రాజకీయ పక్షములు పుట్టకపూర్వమే ఆ గ్రంథం వ్రాయబడిందనీ విశదం అవుతోంది. ఇందులో రాముని నిందకునిగా చేసి వ్రాసిన భాగములు లేవు.

2. విచిత్ర రామాయణమును నేనే కాక, "భార్గవగాథాలహరి" వంటి గ్రంథముల కర్తలు కూడా అష్టాదశపురాణములతో, ఉత్తర, వాల్మీకి రామాయణములతో సమానమైన విలువగల ప్రమాణముగా తీసికొన్నారు.

3. 'విచిత్ర రామాయణము' అను పేరు వారు సూచించినట్లు 'వాల్మీకి రామాయణముతో సంబంధము లేనిది" అని కాక, ఇతర రామాయణములలో లేని, ధర్మ విరుద్ధము కాని చిత్రవిచిత్ర గాథలను కలిగియున్నదని సూచిస్తున్నది. ముఖ్యంగా ప్రస్తుత చర్చనీయాంశమైన 'మండోదరిని విభీషణుడు స్వీకరించాడనే విషయం వాల్మీకి రామాయణంలో లేకపోయినా, అలా జరిగినా ధర్మవిరుద్ధం మాత్రం కాదని వాల్మీకి రామాయణం ఆధారంగానే నిరూపించవచ్చును.

వాల్మీకి రామాయణంలో వాలి వధ ఘట్టం చూడండి:

వాలిని తాను దండించడానికి కారణం వివరిస్తూ రాముడు ఇలా అంటాడు.

అస్యత్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః
రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాపకర్మకృత్
తద్వ్యతీతస్య తే ధర్మాత్ కామవృత్తస్య వానర
భ్రాతృభార్యాభిమర్శేన దండోయం ప్రతిపాదితః

"విద్య"

(ధర్మాత్ముడగు సుగ్రీవుని భార్యయగు రుమతో నీవు రమించితివి. ఆమె నీకు కోడలుతో సమానురాలు. కామవికారమువలన నీవు పాపము చేసితివి. ఇంతటి అధర్మ కార్యమునకు పూనిన నీకు శిక్ష విధించితిని.)

ఔరసీం, భగినీంవాపి భార్యాంవాప్యనుజస్యయః
ప్రచరేత నరః కామాత్ తస్యదండో వధః స్మృతః

(తన కూతురునుగానీ, చెల్లెలు లేక అక్కనుగానీ, తమ్ముని భార్యనుగానీ కామించిన వానికి మరణశిక్ష విధింపవలయునని స్మృతులు చెప్పుచున్నవి.)

సంస్కృత వాఙ్మయ సాంప్రదాయానుసారం అనుజ శబ్దానికి తమ్ముడు అని అర్థం. అన్న అనదలచుకుంటే అగ్రజుడని చెప్పాలి. వాలి, సుగ్రీవు లిద్దరి నేరం ఒకటే అయితే (అన్న భార్యను పరిగ్రహించటంకూడా దండనార్హమైన నేరమైతే) సీతాన్వేషణలో తనకు సహాయపడతాడనే కారణంతో రాముడు సుగ్రీవుణ్ణి క్షమించాడనుకోవాలి. కాని ధర్మమూర్తి అయిన రాముడు కేవలం స్వార్థంతో, వాలి యందు సహించని యీ అధర్మాన్ని, సుగ్రీవునియందు సహించి క్షమించాడనుకోవటం పొరపాటు. అంటే రాముడే సూచనప్రకారం అన్న భార్యను తమ్ముడు పరిగ్రహించవచ్చును కాని, తమ్ముని భార్యను అగ్రజుడు స్వీకరించటం క్షంతవ్యము కాని మహాపరాధము. ఎవరెవరిని భార్యగా గ్రహించటం తగదో రాముడు స్పష్టంగా చెప్పాడు. అన్న భార్యను తమ్ముడు స్వీకరించటం దోషం కాదు కాబట్టే మిగిలిన వాటితో ఆ విషయం చేర్చలేదు. ఆ కారణం చేతనే సుగ్రీవుడిని శిక్షించలేదు. రాముడు ధర్మశాస్త్రాన్ని నిర్వచించేప్పుడు 'ఇది వానరులకు మాత్రమే వర్తిస్తుంది. ఇది నరులకు, ఇది రాక్షసులకు' అని వేర్వేరుగా చెప్పలేదు. ఇదే ధర్మసూక్ష్మాన్ని, విభీషణుని విషయంలో కూడా వర్తింపజేసి అతనికి లంకా రాజ్యంతో పాటు మండోదరిని కూడా రాముడు యిప్పించాడనుకోవటంలో అసంబద్ధ మేమీ లేదు.

ఇది (అగ్రజుని భార్యను తమ్ముడు గ్రహించటం నేరం కాదని) కేవలం నా అభిప్రాయమే కాదు. పైన వాల్మీకి రామాయణంనుంచి ఉదహరించిన భాగాన్ని, భాసమహాకవి తన అభిషేక నాటకంలో విపులీకరించి సుస్పష్టం చేశాడు. ఇది అభిషేక నాటకం నుంచి:

వాలి: భ్రాతృ దారాభిమర్శనే తుల్యదోషయో రహమేవ దండితః నసుగ్రీవః.
(సోదరుని భార్యను పొందడం దోషమే అయితే, నన్ను దండించి, సుగ్రీవుని ఎందువల్ల శిక్షించవు?)

రా: దండితః త్వం హి దండ్యత్వాత్
(నీవే దండ్యుడవు. అందువల్ల నిన్నే దండిస్తున్నాను.)

వా: సుగ్రీవేణాభిమృష్టాభూత్ ధర్మపత్నీ గురోర్మమ
(అగ్రజుడనైన నా భార్యను సుగ్రీవుడు పొందినాడు గదా!)

రా: నత్వేవహి కదాచిత్ జ్యేష్ఠస్య యవీయసో దారాభిమర్శనమ్.
(ఎక్కడా కూడా పెద్దవానికి చిన్నవాని భార్యను స్పృశించుటలేదు)

ఇక్కడ రాముని భావం అగ్రజుడు తమ్ముని భార్యతో నుండుట మహాపాపము అని.

2

క్రిందటి వ్యాసంలో స్త్రీ పునర్వివాహానికి ఉదాహరణగా మండోదరిని ఉదహరించాను. కాబట్టి వితంతు వివాహం ఎంత పురాతనమైనదో పరిశీలించటం అప్రస్తుతం కాదు.

నారద, పరాశర స్మృతులమీద వ్యాఖ్య వ్రాసిన మాధవుడు అనే ఆయన పరాశర స్మృతిలో యీ క్రింది శ్లోకం వుందన్న

(ఇప్పుడు లేకపోయినా) వ్రాశారు.
"నష్టే, మృతే, ప్రవ్రజితే, క్లీబేచపతితే పతౌ పంచ స్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే"

("భర్త కనిపించకపోయినా, మృతుడైనా, సన్యసించినా, నపుంసకుడైనా, పతితుడైనా స్త్రీలు మరొక భర్తను స్వీకరించవచ్చును.")

మండపకౌశికుడు అనే ముని ఒకప్పుడు ఇతర ఋషుల సహపంక్తిని భుజింపబోతే, వారంతా అతనిని చండాలతుల్యునిగా పరిగణిస్తారు. అతడు గృహస్థుకాకుండా బ్రహ్మచర్యాశ్రమంనుండి సరాసరి సన్యాసాశ్రమం స్వీకరించటమే తమ యీ అంతుకు కారణమని వారు చెప్పారు. ఎటువంటి మహనీయుడైనా పుత్రోదయం కానిదే మతసంబంధమైన కర్మకాండకి అనర్హుడని వారివలన విని వృద్ధుడైన మండపకౌశికుడు కన్యాన్వేషణకి బయలుదేరుతాడు. కాని ఆయన వయస్సు చూచి ఎవరూ పిల్లనిచ్చేందుకు ఒప్పుకోరు. ఆ సందర్భంలో మునులు (పైన వ్రాసిన శ్లోకం చూడండి) వితంతువుని వివాహం చేసుకోమంటారు. అతడదేవిధంగా చేసి సంతానవంతుడౌతాడనుకోండి. తరువాయి కథతో ప్రస్తుతం మనకు సంబంధం లేదు.

ఇలాగే ఋగ్వేద సంహితలో ఒకచోట ఒక స్త్రీ తనభర్తతో సహగమనం చేయబోతుంటే, 'పునర్వివాహం చేసుకోవచ్చు. లేచి రమ్మని' ఆమెకు చెప్తారు. ఆమె చేసుకున్నా, లేకపోయినా ఆ కాలంలో ఆ ఆచారం వున్నదనేందుకు ఇది ఒక నిదర్శనం.

ఐతరేయ బ్రాహ్మణములో "ఒక పురుషుడికి అనేక భార్యలు వుండవచ్చును కాని ఒక స్త్రీకి ఏకకాలంలో అనేక భర్తలుండకూడదు" అని వున్నది. అంటే వేర్వేరు సమయాల్లో వేర్వేరు భర్తలు (ఒకని మరణానంతరం మరొకడు) వుండవచ్చునని ధ్వని.

యణ గ్రంథంలో వ్రాసివుంటారు విచిత్ర రామాయణ గ్రంథకర్త. అంతేకాని కేవలం శిష్టాచారానికి విరుద్ధమైన గాథ వ్రాసి దానికి విచిత్ర మందామని వుద్దేశం అయివుండదు. ఆకారణంచేతే నేను విచిత్ర రామాయణం నుండి శాస్త్ర విరుద్ధంకాని యీ విషయం ఉదహరించటం తప్పులేదనుకున్నాను. ఇది తారను మనసులో నుంచుకుని పొరపాటున మండోదరి అని వ్రాయలేదు. ఇందు మూలముగా నేను మండోదరికేమీ అపచారం చేయలేదు. నాకు తెలిసినంతవరకూ మండోదరి సహగమనం చేసినట్లు ఎక్కడా ప్రమాణం లేదు.

ఇక శ్రీమతి ఉమాదేవి "మండోదరి రావణుని మరణానంతరం విభీషణుని భార్య అయినట్లు రామాయణంలో ఎక్కడా లేదని చెప్పగలను" అంటున్నారు. ఇంతేకాదు. ఈ విధంగా పురాణాల్ని "మార్చిపారేసే" ముందు కొంచెం చూసుకుని వ్రాయవలసిందని కూడా అన్నారు. విమర్శకులు కూడా, విమర్శ చేసేముందు విషయాన్ని సాకల్యంగా పరిశీలించి మరీ అందుకు పూనుకోవడం మంచిదని వారికి నా మనవి.



## సుబ్బారావు

క్లబ్బులో సుబ్బారావు తన వాచీగురించి గంటసేపుగా శ్రోతలను విసిగిస్తున్నాడు. తన వాచీ అద్భుతమైనదని అతని సారాంశం. ఒక శ్రోత ఇక భరించలేక "నావాచీ ముందు నీవాచీ బలాదూరు" అన్నాడు.

"ఏం?" అన్నాడు సుబ్బారావు.

"ఒకసారి నావాచీ రోడ్డు మీద పడిపోయింది. అయినా అదింకా శుభ్రంగానే ఉంది."

"ఏది, నీవాచీయే?"

"కాదు, రోడ్డు" అన్నాడు శ్రోత.



# వనితా వాణి



## పొదుపుగా ఖర్చుచేస్తే

శ్యామలాదేవిగారు వ్రాసిన "ఫస్టుకింకా ఎన్నిరోజులు" అన్న వ్యాసానికి సమాధానంగా గాయత్రిగారు వ్రాసిన "వస్తుందొస్తుందన్న ఫస్టు తారీఖు ఏం తెస్తుంది" అన్న వ్యాసం చదివేను నేను గాయత్రిగారితో ఏకీభవించలేకపోతున్నాను. గాయత్రిగారు శ్యామలాదేవిగారికి అనుభవము తక్కువ అని వ్రాసేరు. కాని గాయత్రిగారికే తక్కువ అని నా నమ్మకం లేకపోయినట్లయితే 100 రూ॥ జీతగాడికి భార్య, పిల్లవాడు తప్ప ఇంకెవరూ లేనప్పుడు, ఏ దురభ్యాసము లేనప్పుడు 100 చాలకనుట చాలా ఆశ్చర్యము.

నాకు తెలిసిన ఒక కుటుంబమున్నాది. వారిని నేను 8 సం॥గా చూచుచున్నాను. వారికి జీతం 125 రూ॥ ఇది తప్పించి వారికి ఎటువంటి రాబడిలేదు. వారికి 5 గురుపిల్లలు. అందు ఇద్దరు లోయర్ ఫారమ్సు చదువుచున్నారు. వారికి జీతం లేకపోయినా పుస్తకాలు కొనాలి. వారు ఒక్కనాడు ఏ వస్తువుకుకూడ ఎవరింటికి అప్పుకు రాగా చూడలేదు. వారు ఎప్పుడూ సంతోషంగా వుంటారు. పంచభక్ష్య పరమాన్నాలు కాకపోయినా ఎప్పుడూ వారు "తిండికి లేక మాభాగ్యాలు చంపుకొని రోడ్డప్రక్కన చెట్టుపంచన" కాలంగడపలేదు. వారు పెద్ద ఖరీదైన బట్టలు కాకపోయినా శుభ్రమైన బట్టలు వేసుకొంటారు. 100 జీతగాడు 30 రూ॥ ఇంటి అద్దె ఇవ్వటం తాహతుకు మించిన ఖర్చు. తన తాహతుకు మించిన ఖర్చుపెట్టక, సాధ్యమైనంత కష్టపడి పనిచేసుకుంటూ, ఏ ఖర్చుపెట్టినా ముందూ వెనకా ఆలోచించి ఖర్చుపెడితే తప్పక నూరు రూపాయలలోను 5 రూ॥ మిగల్చవచ్చును.

ఎం. వి. లక్ష్మి, (వాల్తేరు.)

* * *

ఫస్టుకింకా ఎన్ని రోజులు అన్న వ్యాసం చదివాను. శ్యామలాదేవిగారు వ్రాసిన పద్ధతి బాగానే వుంది కాని మధ్య తరగతి కుటుంబాలు ఎలా డబ్బు నిల్వచేయాలో తెలియడంలేదు. పేరుకి 200 జీతం, ఒకటో తారీకున ఆజీతం మినహాయింపులతో ఇంటికి వచ్చేసరికి 150 రూ. లే. అందులోనే కాలేజీలో చదివే పిల్లలకి జీతం కట్టాలికదా, ఇలాటికష్టసుఖాలను యద్ర మిల్లి గాయత్రి గారు బాగా వివరించి వ్రాశారు.

శ్యామలాదేవిగారు అప్పుచేయకూడదన్నారు. బంగారు పళ్ళానికైన గోడచేర్పు తప్పదు కదా. ఎంత లక్షాధికారులకైన అప్పు చేయకుండ జరుగదు. మా అత్తగారు అంటారు: "మా కాలంలో పాతిక రూపాయల జీతంలోనే ఎంతో సంతృప్తిగా వుండేవారము. ఎన్నో రకముల బట్టలు కొనేవారము. ఈరోజులలో ఎంత తెచ్చుకొన్నా సంతృప్తిలేదు. ఎన్నాళ్ళయిన గొల్లాడి కొమ్ముకి ఎచ్చులేదు తగ్గలేదు" అని. ఇంటిలో జనాభా పెరుగుతుంది కాని జీతాలు పెరుగవు. ఈ మధ్య మన ప్రధాని నెహ్రూ కూడ "ప్రజలందరు పడే బాధ నాకు తెలుసు. ప్రతి వస్తువు ధర పెరిగినది." అని సానుభూతి వెలిబుచ్చారు ఈ రోజులలో లక్షాధికారులకూ భిక్షాధికారులకూ రోజులు వెడతాయి గాని మధ్యరకం కుటుంబాలు పడే అవస్థ ఆదేవునికే ఎరుక.

చట్టి క్రిష్ణవేణమ్మ (కాకినాడ)

* * *

## నిలవచెయ్యడంకూడా తప్పనిసరి ఖర్చే

ఒక కుటుంబాన్ని ఉదాహరణకు తీసికొని వారి ఖర్చు లిస్టు ఎలావుంటుందో వ్రాశారొక సోదరి. గుడ్డలఖర్చు, పండుగ ఖర్చులేకుండ ఇంటిఖర్చులు ఆదాయాన్ని మించాయి. ఇంటిఅద్దెకు రూ. 30/- లాగానే బ్యాంకి ఖర్చు (నిలవచేయుడం) రూ. 5/- తప్పనిసరి అని గమనించినపుడే అప్పులు తప్పుతవి.

నిజానికి మధ్యతరగతి కుటుంబాలు తెలిసో తెలియకో అనేక విషయాల్లో పొదుపు చేస్తూండడంవల్లనే ఈపాటిగానైనా సాగిపోతున్నాయి. ఇబ్బందివచ్చినపుడు అప్పు దొరక్కపోతే ఎలా సర్దుకుంటారో చేతడబ్బున్నపుడూ అలాగే కొంచెం ఆలోచించి ఖర్చుపెడితే పొదుపు కుదురుతుంది. ★

—శ్యామలాదేవి, (మాచర్ల)

* * *

గాయత్రి (మద్రాసు) గారి అభిప్రాయం ఏమిటో నాకు బోధపడకుండా వుంది. ఎవరైనా పొదుపుగా సంసారం చేసుకోండి అప్పులు చేసుకోకండి అని చెపితే నచ్చదు; మీరు తెచ్చిన వందాచాలవు మరో ఇరవయి అప్పు తెచ్చుకోండి అని చెపితే బావుంటుందేమో (ఆమె దృష్టిలో)! ఎంత చెట్టుకి అంత గాలి అని మన పెద్దలు వూరికే అన్నారా మన ఆదాయాన్ని బట్టి మన ఖర్చులుండాలి అంతేగాని మన కొచ్చే ఆదాయం తక్కువయినా మనం పెట్టె ఖర్చు ఎక్కువగా వుండాలంటే ఎలా కుదురుతుంది. గాయత్రి గారి బడ్జెట్టులో కొన్ని మార్పులు చేస్తున్నాను. ఆమె మద్రాసు రేట్లు చెప్పారు. కానీ సామాన్యపట్టణాలలో 15, 20 రూపాయలు ఇస్తే రెండు గదులువున్న ఇల్లు నిక్షేపంలా దొరుకుతుంది. బియ్యానికి పదిహేను చాలకపోతే మరో 5 వేసుకోవచ్చు.



పూజార్థం

—వేమూరి లక్ష్మి.]

నూఱు రూపాయల వుద్యోగి 15 రూపాయిలు పళ్ళకి పెట్టడం అనవసరం. కాఫీలు మానుకోవచ్చు లేదా ఒక పూటే త్రాగాలి. అందుకు అంత డబ్బు అనవసరం. తతిమా వన్నీ ఇంచుమించు అంతే ననుకోండి. ఎనభై రూపాయలు తెచ్చుకుని గుట్టుగా కాలం గడుపుకున్నవారు ఎంతో మందివున్నారు. అయితే వాళ్ళంతా అప్పులు చేసుకునే బ్రతుకుతున్నారా? రెండువందలు తెచ్చుకున్నవారు అప్పులు చేసుకుంటే వారికి చాలక చేసుకున్నారు అనుకోవాలా? అప్పు చేసుకోవడం మానడం అనేది. సంసారభారం నిర్వహించే భార్యాభర్తల పొదుపునిబట్టి వుంటుంది. ఇద్దరూ పొదుపుగలవారయితే ఆ సంసారం ఎంతో చక్కగా దిద్దుకుంటారు. అందులో ఏ ఒక్కరికి పొదుపు లేకపోయినా ఫలితం శూన్యం. ఇంటి యజమానికంటే గృహిణికి పొదుపుగా సంసారం సాగించడంలో నేర్పు వుండాలి. కంటికి నదరుగా ఉన్న ప్రతిదీ, పొరుగావిడకున్న ప్రతిదీ, 'తరువాత చూసుకుందాం ముందు అది కొనేద్దాం' అని కొనేస్తే ఎలావుంటుంది. ఎవరి సంసారానికి తగ్గ లోటు వారికి వుంటుంది. కాని అందులోనే కొంత తెలివి వుపయోగించాలి. సామాన్య గృహిణి కట్టుకోవడానికి శుభ్రమైన చీరలేదో అంటే ఓ ఆఫీసర్ భార్య తన పాప పుట్టినరోజుకి ఒక రెండు వందలైనా ఖర్చుపెట్టకపోతే ఎలా అనుకుంటుంది. గంజిలోకి వుప్పులేని ఇల్లాలూ ఏడ్చింది; పరమాన్నంలోకి పంచదారలేని ఇల్లాలూ ఏడ్చింది" అని మా మామ్మగారు సామెత చెపుతారు అలా వుంటుంది.

బలభద్రుని వరలక్ష్మి (విజయనగరం)

* * *

## కారణం

యర్రమిల్లి గాయత్రిగారు వ్రాసిన "...స్తం దొస్తుందన్న ఘనుశారీకు రోమి అస్తుంది" అన్న వ్యాసంలో మధ్యతరగతి సంసారములస్థితి చాలా చక్కగా వివరించారు. ప్రస్తుతపు లోకంతీరుచూస్తే వారికి తోచిన ఆఖరి మార్గంకూడా సాగిరాదు. ఈ బస్తీలలో, మానాభిమానలు వదలి, ఏ రోడ్డుప్రక్కనో. చెట్టుపంచనో కాలం గడుపుదామన్నా, చౌకీదార్లు, గవర్నమెంటువారు అచ్చటకూడా వుండనీయరు. ఈ కష్టాలకన్నింటికి ముఖ్యకారణం పల్లెటూర్లు వదలి బస్తీలలో సుఖములకొరకు ప్రాకులాడడమే.

—వల్లూరు హైమావతి హైదరాబాద్.]

* * *

## డిగ్రీలు

డిగ్రీలగురించి ఒకరిమీద ఒకరు చేస్తున్న విమర్శలు బాగులేవు. నామటుకు నాకు నాకు డిగ్రీలేకాదు, డిగ్రీచదువులోకూడ నమ్మకం లేదు. డిగ్రీచదువుకంటే, సొంతంగా ఎన్నోరెట్లు ఎక్కువగా చదువుకోవచ్చు. నేనలాగే చేశానుకూడాను, దయచేసి ఇకనించి ఇలాంటి పనికిరాని, జవాబులు తగ్గించి, తీరికఉన్నవాళ్ళు, ఆదర్శమహిళల జీవితాలు ప్రచురించగలిగితే చాలసంతోషం. మనం నేర్చుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి.

—ఎం. విమల, (వాల్తేరు.)

* * *

## ఆడపిల్ల

సి. రాధగారు (20-8-58)లో వ్రాసిన 'ఆడపిల్ల పుట్టింది' అను వ్యాసం చదివాను చాలా బాగావుంది.

ఎస్. శంకరి (చిత్తూరు).

* * *

నేటి సమాజంలో తరహాలను చక్కగా చిత్రించారు. కాని చివరికి కన్నతల్లి కూడా ఆడశిశువు కన్నందుకు మనస్సు నొచ్చుకున్నట్టు రచించారు. ఇది కొంచెం అసహజంగా అగుపించింది.

తటవర్తి శ్రీనివాసులు (సికిందరాబాదు).

* * *

కుటుంబరావుగారు వ్రాసిన "పరిశోత్త పాతకోణం" అను వ్యాసం చదివిన వెంటనే, తిరుగువ్యాసము వ్రాయాలని మనస్సు ప్రేరేపించినది. కాని ఇంతలో టి. జయశ్రీగారు వ్రాసిన 'మాధవన్ముకాలు, ముండిపట్టుదలలు' గురించి చదివేను.

—బి. కృష్ణవేణి సింగవరం.]

* * *

వనితాలోకంక్రింద వంటలు వగైరా శీర్షికలు వేసినట్లుగానే, యింగ్లీషు, హింది వారమున కొక పాఠముచొప్పున వేస్తే బాగుంటుందని నా అభిప్రాయము.

—హెచ్. లలిత.]

* * *

"మనసుకు దగ్గరగా, మనిషికి దూరంగా" అన్నవ్యాసం చదివాను. ఉన్న కొన్ని పరిస్థితులను ఉదాహరణలతో చాలా బాగా విమర్శించినందుకు శ్రీమతి బి. యస్. లక్ష్మిగారికి నా అభినందనలు వనితాలోకం ద్వారా అందజేస్తున్నాను.

—కె. సుశీలాదేవి, మంగళిదర్ల]





# జీవనలీల



(17-వ పేజీ తరువాయి)

మీద పెట్టి వచ్చింది మాడిపోతుంది"

"రేపు వస్తారుగా చినబాబూ, మతిని చూడటానికి?"

"వస్తాను. ఎలా ఉన్నదీ ప్రొద్దున్నే మాత్రం కాస్త కబురు చెయ్యి. ఏం?"

"రోజూ ఒకసారివస్తే పోతుంది. జ్వరంతో ఉన్నది కదా మతి? వచ్చి చూసి వెళ్ళటం మంచిది. ఆ మధ్య రావటం మానెయ్యటంతో ఇంట్లోవాళ్ళంతా ఎన్నెన్ని అన్నారనుకున్నారు? 'మన శశి చాలా పెద్ద డాక్టరయిపోయాడు, పిలిస్తె కాని రాడు' అన్నారు. మతి ఏమన్నదో తెలుసా? చినబాబుకి గర్వం' అన్నది."

శశి వెళ్ళిపోదామనే ఉద్దేశ్యంతో - "నాకిప్పుడు పని ఉంది కుసుమా? రేపు వచ్చి వింటానులే నువ్వు చెప్పే అబద్ధాలన్నీ..." అన్నాడు.

"అబద్ధాలు కావు. నిజంగా అబద్ధాలు కావు."

శశి వెళ్ళిపోయాక, కుసుమ చీకట్లో వంగచెట్లో నుంచుని-మెల్లిగా నవ్వింది. ఎదుటి చెట్ల చిటారు కొమ్మలమీద కొంచెం వెలుతురు కన్పించింది. అక్కడికి వెన్నెలవచ్చిందని కుసుమకి తెలుసు. చంద్రుడుదయించినా, చంద్రుడుదయించబోయే వెలుగు కన్పించినా కుసుమ చెవుల కేదో విన్పిస్తున్నటుంది.

చీకట్లో తేరిపారచూసి, వాసుదేవ వంద్యోపాధ్యాయ్—"శశివికదూ? ఆఁ నీకోసమే గాలిస్తున్నాను నాయనా! భూతో అదోలా అయిపోతున్నాడు శశీ! వాళ్ళమ్మ రాగాలు మొదలెట్టింది. నువ్వువచ్చి ఒక్కసారి చూసి వెళ్ళుబాబూ!" అన్నాడు.

"పదండి" అని శశి అతడివెంట నడుస్తూ-"'బెనర్జీగారింటికి అన్నిసార్లు వెళ్ళి వస్తూ ఉంటావ్ కదా—డబ్బు ఏమైనా ఇచ్చాడా ఆయన?' అని నాన్న ఎన్నోసార్లు అడిగాడు. రెండో మూడో యివ్వకపోతే నేను చాలా ఇరుకున పడాలి బాబయ్యగారూ! నాన్నదగ్గిర ఎన్నిసార్లని చెప్పను అబద్ధాలు? డబ్బు—వ్యాపారం తెలిసిన వాడు నాన్న. ఒక్క కానీ అయినా వీరుపోనీయడు" అన్నాడు.

వాసుదేవ్ సిగ్గుపడుతూ చెప్పాడు—శశి కివ్వవలసిన డబ్బు రేపే అతనింటికి పంపిస్తానని—వీలైనంతవరకు స్వయంగానే వచ్చి యిస్తాననికూడా చెప్పాడు. 'అయిచ్చేది ఇవాళే ఎందుకు యివ్వకూడదు?' అనుకున్నాడు శశి తనలో. పైకిమాత్రం ఏమీ అనలేదు. వాసుదేవ్ యిల్లు దగ్గిరేం కాదు. శ్రీనాథ్ దుకాణందాటి, రజనీ సర్కార్ లోగిలిప్రక్కనుంచి, బ్రాహ్మణ వీధిదాక ఉన్న వంకర టింకర దారిలోంచి-కుడివైపున గుబురుగా పెరిగిఉన్న మొక్కలోంచి—మైదానంలోకి వెళ్ళే సన్నటి కాలిబాట వుందే—ఆ బాటనే పడితే చివరియిల్లు. ఈ మధ్య వర్షాలేం లేవు. ఈయేటి కివా వానలు వెనక్కి పట్టేసినట్లే—అయినా దారిలో బురద ఇంకా ఎండలేదు. జోళ్ళు విడిచి చేతో పట్టుకుని, శశి వాసుదేవ్ బెనర్జీయింటికి వచ్చాక కాళ్ళు కడుక్కున్నాడు. వాసుదేవ్ చిన్నకొడుకు భూతో కి పదేళ్ళుంటాయి. ఏడెనిమిదిరోజుల క్రితం జామచెట్టు ఎక్కి, చిటారు కొమ్మమీదనుంచిపడి, కాళ్ళు చేతులు విరగ్గొట్టుకున్నాడు. తర్వాత జ్వరంవచ్చి, స్పృహ తప్పి చావుబ్రతుకుల సంధిదగ్గిరకు వచ్చి చేరుకున్నాడు. శశి అతణ్ణి పెద్ద ఆస్పత్రికి పంపమని మొదట్లో చెప్పాడు—కాని వాళ్ళు ఒప్పుకోలేదు. ఆస్పత్రిపేరు ఎత్తేసరికి భూతో తల్లి వెక్కి వెక్కి ఏడ్చి, పిల్లవాణ్ణి గడపదాటించి తీసుకెళ్ళారంటే — గరళం తాగి ఛస్తానన్నది. తర్వాత ఇహ శశే తనశక్తిఅంతా ధారపోసి భూతో కి చికిత్స చేయటం మొదలెట్టాడు. రోజుకి రెండు మూడుసార్లు వస్తాడు.

భూతో తలంపిదిక్కున తల్లి లక్ష్మమణి కూర్చుని కుమిలి కుమిలి ఏడుస్తోంది. పెద్దవాళ్ళిద్దరు కొడుకులు. ఇద్దరు పెళ్ళిఅయిన కూతుళ్ళు ఉన్నారు. ఆడవాళ్ళంతా ఆ గదిలో గుంపు కూడారు. పెద్దకోడలు విధవ. ఆమే భూతో కి చెంగుతో విసురుతూ దగిర కూర్చుంది. తలి తర్వాత ఈ గుడుకుపిల్లవాడంటే ఆమెకే ఎక్కువ అపేక్షలా ఉంది. ఆమె కళ్ళవెంట బొటబొట కన్నీళ్ళు కారుతున్నాయి.

భూతో స్థితి చూసేసరికి శశి ముఖం వాడిపోయింది. కుర్రవాడు బ్రతకడేమో అని అతడికి అనుమానంకద్దు అయినా మధ్యాహ్నం వచ్చి చూసి వెళ్ళినప్పుడు అతడికి రవంత ఆశ లేకపోలేదు. ఒక్క పూటలో వాడి స్థితి ఇలా పరిణమిస్తుందని అతడు ఊహించలేకపోయాడసలు. కుర్రవాడికి ఒంటినిండా తానే కట్లుకట్టాడు. కదిలేందుకు వీలేదు. ఇప్పుడు మధ్య మధ్య కుర్రవాడి ముఖం కళ తప్పిపోతోంది...అసలే నెమ్మదిగా మాట్లాడుతున్న శశి గొంతు మరింత తగ్గించి,"కొంచెం నిప్పు కావాలి-నీళ్ళు పెట్టి కాపు కాయటానికి. కాస్త కాలువముక్కలాంటి దేదయినా ఉందా?" అని అడిగాడు.

విధవ కోడలు కుంపటి తెచ్చి వెలిగించింది. ఓ పాతపట్టుగుడ్డ ముక్క తీసుకొచ్చి శశి చెప్పిన ప్రకారం గుండెలకి కాపుకాయటం మొదలెట్టింది. శశి కుర్రవాడి కొక ఇంజక్షన్ యిచ్చి, కాసేపు చూశాడు. కళ్ళలోకి పదే పదే పరిశీలనగా చూశాడు; నాడి చూశాడు; తర్వాత మెదలకుండా అక్కడనుంచి లేచి వచ్చాడు. అందరూ ఇప్పటివరకూ ఊపిరి బిగపట్టుకుని ఉన్నారు. శశి లేచి రాగానే అప్పటివరకు ఆపుకున్న వాళ్ళందరి ఏడుపూ ఒక్కసారిగా పైకి పొంగివచ్చేసింది.

విధవ కోడలు పిచ్చిదానిలా పరుగెత్తుకుంటూ శశి దారికి అడ్డంగా వచ్చినుంచుని, "అహాఁ. నువ్వు వెళ్ళటానికి వీల్లేదు శశీ! మా భూతోని బ్రతికించి మరీవెళ్ళు. మాభూతోని బ్రతికించి వెళ్ళు. అతడు నాకు జామకాయలు తెచ్చిపెట్టబోయే చెట్టెక్కాడు శశీ!" అన్నది.

శశి ఏం మాట్లాడతాడు? గంభీరంగా ఊరుకున్నాడు. తర్వాత ఆమె దారివదిలాక బయటికి వెళ్ళాడు. జోళ్ళు విడిచి చేత్తో పట్టుకుని, వీధిలోకి వచ్చాడు. ఆ వీధి చివరకి వచ్చేంతవరకు ఏడుపు విన్పిస్తూనే ఉంది.

(ఇంకా వుంది)

# ఏకోదరులు

(31-వ పేజీ తరువాయి)

అంటూ తన హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు. ఆయన కళ్ళవెంబడి ఆనందాశ్రువులు జలజల రాలాయి. సోమయ్య—సోమయ్య కాదు, రంగారావు—"అన్నయ్యా" అంటూ ఆయన హృదయం మీద వాలిపోయాడు. పాతిక సంవత్సరాల దీర్ఘ వియోగానంతరము కలుసుకొన్న ఏకోదరుల వక్షస్థలాలు ఒండొరుల ఆనందాశ్రువులతో తడిసిపోయాయి. ఆ స్థితిలో వారిద్దరూ ప్రపంచాన్నే మరచారు.

రంగారావు పారిపోయిన తరువాత గోదావరిలో ఒక శవం తేలడమూ, ఆ శవం రంగారావుదేనని తానక్కడ ఉన్నవారిని నమ్మించి పెట్టడమూ ఎలా జరిగిందో జడ్జీగారు చెప్పారు.

"అందుకే నన్ను పట్టుకొనేందుకు ఎవరూ ప్రయత్నించినట్లు కనపడదు," అన్నాడు రంగారావు.

రంగారావు యీ యిరవై అయిదేళ్లలోనూ తన జీవితగమనం ఎలావుందో కథగా చెప్పేడు. ఆయన బదిలీమీద యీ వూరు వచ్చిన విషయం, పకోడీలు కట్టిన దినపత్రిక కాగితంలో తను చూసినట్టూ, అందుకే అన్నను వెతుక్కుంటూవచ్చినట్లూ చెప్పాడు. దీర్ఘ వియోగానంతరం మనసులు విప్పి చెప్పుకుంటూన్న వాళ్లిద్దరూ తెల్లగా తెల్లవారేవరకూ కాలగమనాన్ని గుర్తించనేలేదు...

ఆరోజు నాగులు కేసులో తీర్పు చెప్పవలసిన దినం. జడ్జీగారు న్యాయపీఠాన్ని అధిరోహించారు. ఎసెసర్ సభ్యులు జడ్జీగారికి వెనుకవైపు వేదికమీద ఉపవిష్టులయారు. ముద్దాయి నాగులు రక్షకభటుల అధీనంలో ఒకవైపు నిల్చున్నారు. కోర్టు హాలు నిశ్శబ్దంగా వుంది.

జడ్జీగారు ఒకసారి కళ్లజోడు తీసి సాలోచనగా రుమాలుతో తుడిచి, మళ్ళీ తగిలించుకుంటూ గంభీరంగా యిలా అన్నారు:

"జెంటిల్ మెన్! మీరు యీ అభియోగాన్ని దానిమీది ఆక్షేపణలను అర్థం చేసుకున్నారు, సాక్ష్యాలను ఆసాంతం విన్నారు. ఈ హత్యాభియోగంలో మీ అంతిమ నిర్ణయాలను రూపొందించుకునేందుకు అవసరమయిన విషయ పరీక్ష ముగిసింది. మీ న్యాయ పరీక్షలో ఏవిషయంలో నయినా, ఏమాత్రం అనుమానమున్నా, ఆ అనుమానాన్ని అపరాధికి అనుకూలంగాఅన్వయిస్తూ, (బెనిఫిట్ ఆఫ్ డౌట్ను కలుగజేస్తూ) మీ అంతిమ నిర్ణయాలను వినిపించండి."

ఎసెసర్ సభ్యులు పరస్పరం చర్చించుకుందుకు వేదిక దిగి ప్రైవేటు గదిలోకి వెళ్లారు.

జడ్జీగారి మనసులో ఝంఝామారుతం వీస్తోంది. ఆయన గంభీరంగా ఆలోచిస్తున్నారు. ఆయన కళ్లముందొక తులాయంత్రం కనిపిస్తోంది. దానికి రెండు తూనికచిప్పలున్నాయి. ఒకదానిలో 'సత్యం' మరొకదానిలో 'సాక్ష్యం' ఉన్నాయి. మొగ్గ ఏవైపున ఉన్నదో వని మీదనున్న ముల్లువైపు చూశారు. ముల్లు సాక్ష్యంవైపు మొగ్గుతూంది. సత్యానికి యీ బూటకపు ప్రపంచంలో తావులేదని తెలియజేస్తూన్నట్లు ముల్లు 'సాక్ష్యం' వైపే మొగ్గుతూంది.

ఆ రాత్రి జరిగిన సంఘటన యింకా తన మనస్సులో మెదుల్తూనే వుంది.

హత్యచేసి పారిపోతూన్న వ్యక్తిని తను కళ్ళారా చూడడం జరిగింది. వాడు మెలిదిరిగిన కండలతో భీకరంగా వున్నాడు. రమారమి ఆరడుగుల ఎత్తున్నాడు. నడివయసువానిలా కనబడాడు. వాడి రూపురేఖలు తన మనఃఫలకంమీద స్పష్టంగా ముద్రింపబడి యింకా చెరిగిపోలేదు. — కాని యిప్పుడు తన ఎదురుగా నిల్చున్న ముద్దాయి? ఇరవై ఏళ్ళయినా సరిగా నిండని అర్భకుడు. సంస్కారమూ, సరియైన పోషణా లేక, బడుగుదేహంతో బ్రతుకుతూన్న నిర్భాగ్యుడు. రూపురేఖల్లోనే వాళ్ళిద్దరికీ హస్తికీ మశకానికీ ఉన్న అంతరం వుంది. తను అసలు నేరస్థుణ్ణి కళ్ళారా చూడకపోతే సాక్ష్యాన్ని బట్టి యీ ముద్దాయే నేరస్థుడని నమ్మేవాడేమో! అయినా న్యాయానికి కళ్లు లేవు. చెవులే వున్నాయి. తీర్పుకి సాక్ష్యమేకదా ముఖ్యాధారం?

అయితే నేరం ఒకరిదీ, శిక్ష మరొకరిదీనా? ఆయన అంతరాంతరాల్లోని అంతర్వాణి ఏదో "అంతేకదా, మరి!" అని గొణిగింది. నేరం చేసేది ఒకడైతే దానికి శిక్ష అనుభవించేది మరొకడు — అనే విషయం తన జీవితసత్యాలలోనే యిమిడి వుంది. దానివల్ల కలిగే మనోవ్యథ కూడా తనకు బాగా అనుభవమే!—ఇలా ద్వైధీభావంలో పడ్డ ఆయన మనసు అల్లకల్లోలమవుతూంది.

ఎస్సెసరు సభ్యులు ఎవరిస్థలాల్లోకి వచ్చి వాళ్ళు కూర్చున్నాక జడ్జీగారు వాళ్ళవైపు ప్రశ్నార్థకంగా చూశారు.

"ముద్దాయి హంతకుడనే మేమంతా నమ్ముతున్నాము" అని వారు ఏకగ్రీవంగా తమ నిర్ణయాన్ని తెలియపరిచారు.

వారి నిర్ణయం ఎలా వుంటుందో జడ్జీగారికి ముందే తెలుసు. అందుచేత ఆయనేమీ ఆశ్చర్య పడలేదు. నిదానంగా, గంభీరంగా ఆయన తమ తీర్పును వినబర్చారు.

"ఎస్సెసర్ సభ్యుల నిర్ణయంతో నేనేకీభవించలేను. ముద్దాయిని నిర్దోషిగా పరిగణించి అతనిని విడుదల చేస్తున్నాను."

ఈ తీర్పును విన్న ప్రేక్షకులంతా ఆశ్చర్యపోయారు. జనంలో గుసగుసలు బయలుదేరాయి. ఈ తీర్పు వాళ్ళ అంచనాలకు అందడం లేదు. 'నాగులు వంటి హంతకుణ్ణి' విచ్చలవిడిగా విడచిపెట్టెయ్యడం వాళ్ళ కిష్టంలేదు. నాగులే తప్పకుండా హత్యచేసివుంటాడనివాళ్ల దృఢమైననమ్మకం.

జడ్జీ గారు వేదికదిగి తమ ప్రైవేటు గదిలోకి వెళ్లారు. ఆ క్షణంలోనే తమ పదవికి రాజీనామా కాగితం వ్రాశారు.

తనతీర్పు నిష్పాక్షికమే అయినా ప్రజల దృష్టిలోమాత్రం పాక్షికంగానే కనిపిస్తుంది, ప్రజల సానుభూతి లేనిపదవిని నిర్వహించడం తనకూ కష్టమే! నిజం తనకు తెలియకపోతే నిష్కారణంగా తన చేతులమీదనే తన తమ్ముడికి అన్యాయం జరిగిపోయేది. అలా అన్యాయం చెయ్యకుండా తప్పించుకోగలగడంలోనే తనకు తృప్తివుంది. ★

# బాలసాహితి

## శాస్తి

క్రోటికి పడగెత్తిన యొక

కోటీశ్వరు డుండె నతడు

ఎట్టినా ముల్లె పెంచు

టే పరమార్థముగ నెంచు

ఒకరోజున బాజారున

చకచకనడచుచు పాపము

వేయికాసు లున్నసంచి

వీథి జారవిడుచుకొనెను.

ఇంటికి జేరిన వెంటనె

ఈసంగతి తెలుసుకొనీ

గుండె బాదుకొనుచు నేడ్చి

కుమిలి కుమిలి కొంతసేపు,

వీధు లన్నియును వెదకీ

విసిగి డస్సి కడకు గ్రామ

పెద్ద చెంతకేగి మొర

పెట్టుకొనెను దైన్యముతో:

"పోయిన సంచిని యిచ్చిన

పుణ్యాత్మునకే నిచ్చెద

బహుమతి నల్వదికాసులు;

ప్రతినతప్ప"ననుచు బలికె.

గ్రామ పెద్ద బహుమతి సం

గతి చాటింపించెనూర.

చాటింపును వినివచ్చెను

వరగుననమునలమ్మ యొకతె.

"అయ్యా సంచిదిగో నాకు

అగుపించెను నడివీధిని,"

అను నవ్వ నిజాయితిగని

అద్భుతపడె గ్రామపెద్ద.

★

పేదరాలు పాప మవ్వ!

పెండ్లీడు కుమార్తె గలదు!

ఎవరైనా చేజిక్కిన

నింత సొమ్ము వదలుదురా!

కబురంపగ వణిజుడు శీ

ఘ్రముగా నట కేగుదెంచి,

అమితముగా సంతసించి,

అందుకొనెను తన సంచిని.

లెక్కించెను మూడుమార్లు,

లెక్కకు సరిపోయె సొమ్ము;

బహుమతి జ్ఞప్తికిరాగా

వన్నె నొక కుయుక్తి వేగ.

"అయ్యా యిం[illegible]ండవలయు

అదనముగా రూపాయలు

నాలుగువందలవర"కని

నాడెముగా బొంకి, పయిని:

"అవ్వా రూపాయలేమి

యయ్యె"ననుచు గద్దించెను.

అవ్వకు మతిపోవునంత

యై యేడ్చుచు పలికెనంత:

"ఏపాపం బెరుగను, ఆ

శ్రీపతిసాక్షిగ జెప్పెద;

దొరకిన సంచిని తెచ్చితి,

దొరకిన వెంటనె వచ్చితి."

అనవిని కోమటిమానము

అవగాహన జేసికొనీ

గ్రామపెద్ద పలికె నిటుల;

గంభీరస్వరము మివుల:

"ఇతనిమాట కల్లయనుట

కేమాత్రము వీలు లేదు.

అంతసొమ్ము లేనిమాట

అతనిది కాదన్నమాట.

ఎవ్వరిదో పాపము న

శ్వేశ్వ[illegible]డు అవ్వకిడెను.

తనకూతురు పెండ్లి దీన

కొనసాగగ చింతమాన.

అవ్వా! కొనిపొమ్ము దీని

అసలు మాటదొరకనేని

వణిజున కందీయవమ్మ!

బహుమానము కోరకమ్మ"

ఈవిధి తీర్పును జెప్పిన

'హా విధి'యనుకొని వణిజుడు

తోక ముడుచుకొనుచుపోయె

ద్రోహమునకు శాస్తియాయె. ★

కోటయ్య



# రెండు ధాన్యపు గింజలు

చాలాకాలం క్రిందట విజయసింహు డనే రాజు వొక రాజ్యాన్ని పరిపాలించేవాడు. విజయసింహుడు చాల వుత్తముడు. ప్రజలను కంటికి రెప్పలా కాపాడేవాడు. అన్ని విద్యలూ, అన్ని భాషలూ చిన్నతనంలోనే నేర్చుకొని యెంతో జ్ఞాని అని పేరు ప్రఖ్యాతులు గాంచినవాడా విజయసింహుడు.

ఒకనాడు మహారాజు తన వేసవి మందిరంలో రాణిగారితో కలిసి విహరిస్తున్నాడు. రాజుగారూ, రాణీగారూ చాలా సరదాగా కబుర్లు చెప్పుకుంటున్న సమయంలో "కిచకిచ" మన్న శబ్దం వినిపించింది. రాజుగారు తలెత్తి నలువైపులా కలయ జూచారు.

రాజుగారి వేసవి మందిరంలో వొక మూలనున్న దూలంపైని పిచ్చుకలగూడొకటి కన్పించింది. ఆదూలంపైనే రెండు పిచ్చుకలు, వొకటి ఆడది, రెండోది మగది—రాజూ రాణీల మల్లే సరదాగా మాట్లాడుకుంటున్నాయి.

"అయితే మనకు త్వరలోనే వొక చిన్న పాపాయి వస్తుందన్న మాట" అని కిచకిచమంటూ అన్నది మగపిచ్చుక. ఆడపిచ్చుక సిగ్గుతో తలవాల్చి ముక్కుతో మగపిచ్చుక ముక్కు పొడవసాగింది.

పిచ్చుకలభాష గూడా తెలిసిన విజయసింహు డామాట వినగానే ఫక్కున నవ్వేడు. ఆనవ్వువిని పిచ్చుకలు రాజుగారివైపు ఆశ్చర్యంగా చూచాయి. వెంటనే ఆ పిచ్చుకలకు తెలిసింది, రాజుగారికి తమ భాష తెలుసునన్న విషయం.

"ఎందుకు నవ్వుతున్నారు?" రాణీ అడిగింది.

"అటు చూడు రాణీ! ఆ పిచ్చుకల జంటకు త్వరలోనే పాపాయి పుడుతుందట. మన కెప్పుడో ఆ అదృష్టం?" అన్నాడు విజయసింహుడు పిచ్చుకల్ని చూపిస్తూ.

రాజు యెందుకు నవ్విందీ పూర్తిగా అర్థమయిందా పిచ్చుకలజంటకు. కోపంగా రాజుగారివైపు చూచి

కె. హసన్నా

తుర్రున యెగిరిపోయాయా రెండు పిట్టలూ.

విజయసింహు డన్న మాటకు రాణీ సిగ్గుపడింది. దుఃఖం గూడా వచ్చింది. తనకంటే గొప్పవిగా భావించి ఆ పిచ్చుకల జంటవైపు అసూయతో చూస్తుండగానే అవి యెగిరిపోయి ఆకాశంలోకిపోయాయి.

ఇది జరిగిన మరుక్షణంలోనే రాజుగారా విషయాన్ని మర్చిపోయారు. కాని పిచ్చుకల జంట మాత్రం ఆ సంఘటన మరువలేదు.

"మనం సరదాగా మాట్లాడుకుంటుంటే మహారాజామాటల్ని విన్నాడు. మన భాష తెలియడంవల్లనే గదా అలా వినగలిగాడు. అంతే గాదు యెగతాళిగా నవ్వేడు చూశావా?" అని మగపిచ్చుక ఆడపిచ్చుకతో అంది. అందుకు ఆడపిచ్చుక యిలా అంది.

"అంతేనా! మన రహస్యం తెలుసుకున్నది గాకుండా తన భార్యతో గూడా చెప్పేడు మహారాజు. నాకు చాలా సిగ్గేసింది. కోపంగూడా వచ్చింది."

"అయితే మహారాజుకు తగిన శాస్తి చెయ్యాలి.

"ఏం చేద్దాం?" అన్నది మగపిచ్చుక. ఇలా కొన్నిగంటలసేపు ఆలోచించి ఆ పిచ్చుకలు రెండూ వొక నిర్ణయాని కొచ్చాయి. వెంటనే ఆ రెండు పిట్టలూ రుయ్ మంటూ యెగిరి దేవాలయం దగ్గిర వాలాయి. దేవాలయంలో వున్న ధాన్యపు గది దగ్గరకు వెళ్లి ఆ రెండు పిచ్చుకలూ చెరొక ధాన్యం గింజ ముక్కుతో కరచుకొని తిరిగి గాలిలో కెగిరిపోయాయి. అలా తిన్నగా వెళ్లి ఆ రెండు పిచ్చుకలూ తాము దేవాలయ ధాన్యాగారంనుండి తెచ్చిన ధాన్యపు గింజలు రెంటినీ రాజుగారి ధాన్యాగారంలో పడేశాయి. అంతే!

ఆరోజు మొదలుకొని రాజ్యంలో కరువు కాటకాలు హెచ్చిపోయాయి. వర్షాలులేవు. పంటలు పండలేదు. తినడానికి గింజలులేవు. ప్రజలలో కల్లోలం బయలుదేరింది. శిస్తులు వసూలు చెయ్యాలంటే యెవరు యిస్తారు? ఎవరి దగ్గరా దమ్మిడీ లేదు. పైపెచ్చు అంతా రాజుగారి దగ్గరకొచ్చి మొరపెట్టుకున్నారు. రాజుగారి ధనాగారం నానాటికి

ఖాళీ కా జొచ్చింది. రోజు రోజుకూ బీదవాడయిపోతున్నాడు. ప్రజలు రోజుకు రోజు నశించిపోతున్నారు. మహారాజు కేదో వింతగా తోచింది. వెంటనే ప్రముఖ జ్యోతిష్యులను, తత్వవేత్తలను పిలిపించి చర్చించాడు. కాని యెవ్వరూ యీ కరువుకు కారణం చెప్పలేకపోయారు. మహారాజు విచారంతో క్రుంగిపోయాడు.

అదృష్టవశాత్తూ వొక రోజున ఆరాజ్యం మీదుగా దేశ సంచారానికి పోతున్న త్రికాలజ్ఞుడయిన మునీశ్వరు డొకడు అక్కడి ప్రజలను చూచి వారి కష్టసుఖాలనువిన్నాడు. వెంటనే ఆ మునీశ్వరుడు రాజభవనానికి వెళ్లి మహారాజుచేత మర్యాదలు పొందాడు.

అతిథి సత్కారాలన్నీ ముగిసిన తరువాత విజయసింహుడా మునివర్యునితో తమ రాజ్యంలోని బాధలన్నింటిని వివరించి అందుకు కారణమేమిటో శలవియ్యమన్నాడు. రెండు క్షణాలు ఆలోచించి, ఆముని యిలా అన్నాడు:

"విజయసింహా! ఈకష్టా లన్నింటికీ నువ్వేకారకుడవు."

ఇలా అనే సరికి మహారాజూ, మహామంత్రి, సేనాధిపతి, వగైరా వుద్యోగస్థులూ అందరూ ఆశ్చర్యంగా చూశారాతనివైపు.

"నేనా? అదెలా స్వామీ?" అన్నాడు విజయసింహుడు వినయంగా.

"నువ్వే దీనికి కారకుడవు. కారణం చెప్తాను విను. నువ్వు నీరాణీతో కలసి వొకనాడు నీవేసవిమందిరంలో విహరిస్తుండగా, వొక పిచ్చుకల జంట సరదాగా ఆడుతూ పాడుతూ వుండగా చూశావు. అవి మాట్లాడుకుంటుంటే విని నువ్వు నవ్వేవు. అవునా? అని మునివరేణ్యుడనే సరికి విజయసింహుడు జ్ఞాపకం తెచ్చుకొన్నాడు.

"అవును మహాత్మా! అదినిజమే" అన్నాడు.

"అదే, అంటే నువ్వు వాటి సంభాషణ విని నవ్వడమే యీ కరువుకు కారణం" అని ఆముని ఆపిచ్చుకల జంట ప్రభుత్వ ధాన్యాగారంలో దేవాలయానికి చెందిన ఆస్తియైన ధాన్యపు గింజలను తెచ్చి కలిపివేసిన విషయం చెప్పి, యిలా అన్నాడు :

"భగవంతుని సొమ్ము నీ ధనాగారంలో చేర్చబడినందున నీకూ, నీ ప్రజలకూ యీకష్టాలన్నీ కలిగాయి. అయినప్పటికీ వీరసింహా! నీవు మర్చిపోయావుగాని, నీకు పక్షుల భాష నేర్పినపుడు నీ గురువుగారు చెప్పిన విషయ మేమిటి? "పక్షుల భాషలు తెలిసినా, తెలిసినట్లుగా పక్షులకు తెలియనీయరాదు" అన్న విషయం జ్ఞాపక ముందా?" అనే సరికి మహారాజు కంతా జ్ఞాపకం వచ్చింది. వెంటనే తన తప్పు తాను తెలుసుకున్నాడు.

"అయితే తిరిగి మా రాజ్యం సుభిక్షం కావాలంటే యేం చెయ్యాలో శలవిస్తారామహర్షీ" అంటూ ప్రార్థించాడు విజయసింహుడు.

"దాని కేముంది? తక్షణం నువ్వు వెళ్లి ఆపిచ్చుకల్ని ప్రార్థించు నీ రాజ్యాన్ని నీ ప్రజలను, నిన్నూ కాపాడ గలిగేవి ఆ రెండు పిట్టలు మాత్రమే" అని ఆ మహానుభావుడు చెప్పి మహారాజు దగ్గర శలవు తీసుకొని వెళ్లిపోయాడు.

వెంటనే మహారాజు, తను చేసిన తప్పుకు చాల బాధపడి, వేసవిమందిరానికి ప్రయాణమయ్యాడు. కాని ఆశ్చర్యం! ఆ పిట్టలూ లేవు, గూడూ లేదు. వెంటనే మహారాజు తన గుర్రాన్ని దేవాలయంవైపు పోనిచ్చాడు. దేవాలయంలో వొకమూలనున్న చిన్నగదిలో వొక గూడు కన్పించింది మహారాజుకు. అదే ఆ పిచ్చుకలగూడు. ఆగూటిలో యిప్పుడు ఆ జంట మాత్రమేగాదు, మరో చిన్న పసికూనగూడా వుంది.

సంతోషంతో మహారాజు




"...అలాగా? నాకు తెలియదులే! ఎవరికొరడా వాళ్లే తెచ్చుకోవాలన్నమాట!"

గూటిని సమీపించి, పిచ్చుకల భాషలో వాటిని పిల్చి, తన తప్పు క్షమించి తన్నూ, ప్రజలనూ కాపాడమని వేడుకున్నాడు.

తప్పు తెలుసుకొని పశ్చాత్తాప పడుతున్న మహారాజును చూచి జాలి కలిగిందా జంటకు. వెంటనే "అలాగే" అంటూ రివ్వున యెగిరి పోయాయి. సంతోషంతో రాజుగారు గుర్రం యెక్కి వెనక్కు పోనిచ్చారు. రాజుగారి గుర్రం యింకా కోటకు చేరకముందే రాజుగారి కెదురుగా ఆ పిచ్చుకల జంట వచ్చాయి. వాటి ముక్కులతో చెరొక ధాన్యపు గింజ పట్టుకుని వెళ్తున్నాయి.

"మహారాజా! ఇదుగో యీ రెండు గింజలూ, భగవంతునిసొమ్ము. ఇవి యిన్నాళ్ళూ నీ ధాన్యాగారంలో నీ ఆస్తితో చేర్చబడినందున నీకీ కష్టాలన్నీ కలిగాయి. ఇక యే కష్టాలూ వుండవు," అంటూ అపిచ్చుకల జంట యెగిరిపోయింది. సంతోషంతో పొంగిపోయాడు విజయసింహుడు. తరువాత మహారాజువిజయసింహుడు చాలాకాలం రాజ్యాన్ని పాలించాడు. ఆ రాజ్యంలో ఆ తరువాత యెన్నడూ యే బాధలూ కలుగలేదు. ధర్మం నాలుగుపాదాలా నడిచింది. ★

## మనిషిలో మనిషి

(22-వ పేజీ తరువాయి)

వుండాలి... నేను లేవను. లేవాలని లేదు నాకు...

[తలుపు చప్పుడు]

లేవాలని లేదు-లేవను.

[మళ్ళీ తలుపుచప్పుడు.]

ఆల్ రైట్ - ఆల్ రైట్ - ఉండవయ్యా కాస్త...!

[హాలులో లైట్లకాంతి గబగబా క్రమంగా హెచ్చుఅవుతుంది. రఘు సోఫాలోపడి నిద్రపోతున్నాడు. ఎవరో వంటింటివైపు తలుపు తట్టుతున్నారు. రఘు లేచి, కళ్ళు తెరిచి, చూడలేని చూపులతో శూన్యదృక్కులతో చుట్టూ చూస్తాడు.]

(నిద్రమత్తుతో) మీనా...మీనా...

[ఆటోమేటిక్ గా లేచి వెళ్ళి తలుపు తెరిచి ఇంకా మూసుకుపోతున్న కళ్ళలో వెనక్కి తిరిగివచ్చి సోఫాలో కూలబడతాడు. రంగడు నెమ్మదిగా లోపలకొస్తాడు.]

(ఇంకా మైకంతోనే పడకగదివైపు చూస్తూ) మీనా!...

[వున్నట్టుండి జ్ఞాపకంవస్తుంది. హఠాత్తుగా మేల్కొంటాడు. పడకగదివైపు చూస్తూ-]

మీనాక్షీ...మీనాక్షీ...[తలయెత్తి రంగడివంక చూస్తాడు]

యేమిట్రా?

రంగడు: ఏమిటి బాబూ ఇల్లెగిరిపోయేట్టు కలవరిస్తున్నారు? భయమేసి లేపానుబాబూ.

రఘు: కలవరించానా? నేనెందుక్కలవరిస్తాన్రా? నీకేమన్నా మతిపోయిందా? అసమర్థులు-పిరికిపందలు-గుండెనిబ్బరం లేనివాళ్ళురా కలవరించేది-

రంగడు: మీరేబాబూ-

రఘు: యూ రాస్కెల్-నే కలవరించావంటావ్-

[లేచి కొట్టబోతాడు-రంగడు పారిపోతాడు.]

* తెర *

(ఇంకా వుంది.)

# కొందరు సభ్యుల పేర్లు

(9-వ పేజీ తరువాయి)

ఇంజమూరి వెంకటరఘుపతిరావు (బళ్లారి) 237, ఇందుపూరు గోపాలరావు (పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా) 238, నూరి అరవిందబాబు (రాజమండ్రి) 239. జయంతి నాగమణి (హైదరాబాదు) 240. మాడభూషి దినకర బాబు (విజయవాడ.)

241. జి. జగదీశ్వర్ (కామారెడ్డి నిజామాబాద్ జిల్లా) 242. జి. లక్ష్మీపతి (కామారెడ్డి నిజామాబాద్ జిల్లా) 243. సందా ప్రమీల (హైదరాబాదు, 244. సందా పార్వతి (హైదరాబాదు) 245. గాయక శివప్రసాద్ (విజయవాడ) 246. పెట్ల లింగరాజు (భువనేశ్వర్, పూరిజిల్లా) 247. పెట్ల మోహన్‌రావు (భువనేశ్వర్, పూరీ జిల్లా) 248. వడిమింటి విజయలక్ష్మి (విశాఖపట్నం) 249 పోతాప్రగడ లలితా కుమారి (రాజమండ్రి) 250. పోతాప్రగడ లలితాకుమారి (రాజమండ్రి) 250 పోతాప్రగడ తేజస్సు (రాజమండ్రి) 251. చింతలపూడి రాధాక్రిష్ణ (హైదరాబాదు) 252. నిడుప్రోలు జనార్ధనరావు (ఊరందూరు, చిత్తూరుజిల్లా) 253. ఎమ్. గోపాల్ కిషన్ రావు (సంగారెడ్డి, మెదక్ జిల్లా) 254. కె. యాదగిరి (హనమకొండ, వరంగల్ జిల్లా) 255. కొత్తపల్లి రవీంద్రబాబు (పెంటపాడు ప. గో. జిల్లా) 256. సగరం ఉమాదేవి (మధిర, ఖమ్మంజిల్లా) 257. భాగవతుల రవీంద్రనాథ్ (ఆదోని, కర్నూలు జిల్లా) 258. బందాలక్ష్మి నరసింహారావు (మదరాసు) 259. ఉన్నవ నాగలక్ష్మి (మద్దిపాడు గుంటూరుజిల్లా) 260. మెంగలి రాజు మనోహరరావు (కొల్లూరు, గుంటూరు జిల్లా.)

261. పూసర్ల రమణమ్మ (చోడవరం, విశాఖజిల్లా) 262. కోక రత్నమాల (ఖమ్మం, ఖమ్మంజిల్లా) 263. మోదేకృతి కృష్ణకుమారి (విజయనగరం) 264. అంగర వరహాకుమార్ (సింద్రీ, బీహారు) 265. కేశిరాజు వెంకటసుబ్బలక్ష్మి (మోచంపేట,








కడప జిల్లా) 266. చందు సరోజనీదేవి (పామర్రు క్రిష్ణాజిలా) 267. కొన్‌రాటి చంద్రశేఖరరావు (నౌపాడా, ఒరిస్సా) 268. దేవకీప్రసన్న (విజయవాడ) 269. అవసరాల శ్రీధర్ (ఏలూరు) 270. కోటికల పూడి రామలక్ష్మీనరశింహం (టాటానగర్) 271. తాతా సుధాకర్ (బరంపురం) 272. దామోజీపురపు సుభద్ర (గుంటూరు) 273. పంపనమంగాయమ్మ (తాళ్లరేవు, తూ. గో. జిల్లా) 274. కుమ్మర సత్యవతి (వీరవాసరం ప. గో. జిల్లా) 275. ఓరు సీతామహాలక్ష్మి (తెనాలి) 276. చక్రవర్తుల వెంకటరావు (దంగేరు. తూ. గో. జిల్లా) 277. మల్లెల లక్ష్మి శైలజ (ఇబ్రహీంపట్నం క్రిష్ణాజిల్లా) 278. చెర్వు నారాయణమూర్తి (బందరు) 279 కొల్లి నవరత్నం (మొవ్వ. క్రిష్ణాజిల్లా 280. వి. శరత్ కుమారి (హన్మకొండ వరంగల్ జిల్లా.)

281. దాసు శివరామప్రసాద్ (బందరు) 282 ఎమ్. హెచ్. సీతారామయ్య (విజయవాడ) 283 అన్నముల లక్ష్మిశివప్రసాద్ (గుంటూరు) 284 యారగడ్డ వెంకటకృష్ణారావు (నిమ్మకూరు, కృష్ణాజిల్లా) 285. పి. ఎస్. కె. సోమయాజులు (విశాఖపట్నం) 286. మారెళ్ళ వెంకట మాచిరాజు (బరంపురం, గంజాం జిల్లా) 287. అలాశి సుభాష్ బాబు (అనకాపల్లి, విశాఖజిల్లా) 288. వీర మాచనేని రామమోహనరావ్ (ఏలూరు) 289. పుణురుపల్లి సూర్యప్రభజన (మాచెర్ల, గుంటూరు జిల్లా) 290. జంగా రామకృష్ణారెడ్డి (మైలవరం, కృష్ణాజిల్లా) 291 సి. ఆర్. ప్రభాకర్ (నగరంపాలెం, గుంటూరు జిల్లా) 292. చిలకమర్రి అనంత లక్ష్మి మాచవరం, (తూ॥ గో॥ జిల్లా) 293. వడ్డాది అరుణకుమార్ (కాకినాడ) 294. ఎస్. దామోదరరావు (హైదరాబాదు) 295. కంభట్ల రామచందర్ (విశాఖపట్నం) 296. టి. విజయకుమారి (కాకినాడ) 297. బి. విజయలక్ష్మి (ఘండుగొలను ప. గో. జిల్లా 298. ఈజర్ల భద్రిశాథ్ (పామిడి, అనంతపురం జిల్లా) 299 వంకధార లీలావతి దూబచర్ల, ప.గో. జిల్లా) 300. బాలదారి వెంకట లక్ష్మి (కొవ్వూరు, ప. గో. జిల్లా)

301. ఎమ్. జానకిరత్నం (వాకతిప్ప తూ. గో. జిల్లా) 302. పొదిలసీతారామాంజనేయ శర్మ (విశాఖపట్నం) 303. ఏకాశాయి కుమారి (వరంగల్) 304. కొంపెల్ల వెంకటేశ్వరరావు (పూబలంక తూ. గో. జిల్లా) 305. తోటలక్ష్మి (అనంతపురం) 306. జరుకుమిల్లి జానకి (సికింద్రాబాదు) 307. మాదిరాజు వెంకటనరసింహారావు (గూటాల, ప. గో. జిల్లా) 308. బేగూరు కళావతి (పెనుగొండ, అనంతపురంజిల్లా) 309 ఎర్రాప్రగడ మహాలక్ష్మి (పాశర్లపూడి, తూ గో. జిల్లా) 310. కోట బాలసుబ్రహ్మణ్యం (వరంగల్) 311. పెనమాక మాణెన్ (విజయవాడ) 312. ఎమ్. జె. ఆర్. మోహనరావు (గూటాల, ప. గో. జిల్లా) 313. గాదెరాజు రామగోవిందు (విజయనగరం) 314. మండపాక గాంధి (పుంద్రపూడి క్రిష్ణాజిల్లా) 315. పవులూరి క్రిష్ణబాబు (గోవాడ, గుంటూరుజిలా) 316. మాధవరపు శ్రీనివాసరావు (ఆలమూరు తూ. గో. జిల్లా) 317. కేదారిశెటి కిషోర్ (అమలాపురం తూ. గో. జిల్లా) 318. జాగొడ్డు మరిడెయ్య (పెద్దాపురం తూ గో. జిల్లా) 319. గరికిపాటి అప్పయ్యశాస్త్రి అగిరపల్లి (క్రిష్ణాజిల్లా) 320. రావి సుబ్బారావు (దోసకాయలపలి తూ. గో. జిల్లా).

321. వరదా సత్యవతి(జట్లపాలెం, ప.గో. జిల్లా) 322. అంగర సాగర్ కుమార్ (గ. మేడపాడు, తూ.గో. జిల్లా) 323 బి. శ్యామల (కొందుర్గు మహాబూబ్‌నగర్ జిల్లా) 324. రుద్రరాజు వరలక్ష్మి(లంకలకోడేరు, ప.గో. జిల్లా) 325. పిళ్లారిశెట్టి రంగారావు (విజయవాడ) 326. మామిడి రాధాక్రిష్ణమూర్తి (చెరుకుపల్లి, గుంటూరుజిలా) 327. ఎమ్. కోటసుబ్బారావు (విజయపురి) 328. కొలూరి కామేశ్వరి (ఖరపూర్) 329. పి. ఝాన్సీరాణి లేకలక్ష్మి (చిక్కడపల్లి హైదరాబాదు) 330. ఒంటెద్దు శివరామజోగారావు(విజయనగరం) 331. పాలేటి శ్రీరామచంద్ర (శక్కర్ నగర్, నిజామాబాద్ జిల్లా) 332 మోటూరి జయకృష్ణప్రసాద్ (పుయ్యూరు క్రిష్ణాజిల్లా) 333. భమిడిపాటి సుబ్బలక్ష్మి (వాత్తేరు) 334. ఆకొండి రామమోహన్‌రావు (పిఠాపురం, తూ.గో. జిల్లా) 335. అణివిళ్ళ సీతారామమూర్తి (మెరకచామవరం, తూ.గో. జిల్లా) 336. జి. బాలామణి(సికింద్రాబాదు) 337. గన్నమని విజయమోహనరావు (అవంతిపల్లి, ప. గో. జిల్లా) 338. రాయప్రోలు శాంతి (విజయనగరం) 339. మాచిరాజు రామలింగేశ్వరస్వామి (విజయవాడ) 340. తాడేపల్లి జానకిరామ బాబూజీ (బందరు).

341 వెల్లటూరి ఉమేష్‌బాబు (వెల్లటూరు, గుంటూరుజిల్లా) 342 వాడేపల్లి సూర్యనారాయణ (విజయనగరం) 343 పేరి సీతారామశర్మ (పేరూరు, తూ. గో. జిల్లా) 344 పుటుంబాక కుశలవప్రసాద్ (గుంటూరు) 345 చింతలూరి రత్నకుమారి (రాజమండ్రి) 346 మామిడన్న సుబ్బలక్ష్మి (దొమ్మేరు ప. గో. జిల్లా) 347 అయ్యగారి కామేశ్వరి (నర్సాపురం ప. గో. జిల్లా) 348 కవులూరు రామమోహనరావు (విజయవాడ) 349 టి. బి. చంద్రలేఖ (నెల్లూరు) 350 శ్రీ పండితారాధ్యుల మల్లికార్జునరావు (విజయవాడ) 351. కొమాండూరి రంగసాయి (దొడ్డిపట్ల ప. గో. జిల్లా) 252 పాతులూరు పేరుందేవితాయారు (కలకత్తా) 353 లెలిచేటి కృష్ణప్రియ (పునా 2) 354 కోడూరి సోమేశ్వరరావు (అయినవిల్లి తూ. గో. జిల్లా) 355 పైరిపి అప్పారావు (విజయవాడ) 356 కోడపాటి క్రిష్ణవేణి (మద్రాసు) 357 దామెర వెంకటరావు (కాకినాడ) 358 కాండూరి వెంకటరమణాచార్యులు (చీరాల, గుంటూరు జిల్లా) 359 జిమరాధ (రేపల్లె గుంటూరు జిల్లా) 360 ఆకుల వీరవెంకటసత్యనారాయణ (రాజమండ్రి).

361. ఎన్. వి. చలం (పుత్తూరు చిత్తూరు జిల్లా) 362. తేరాల ఆంజనేయులు (హైదరాబాదు) 363. సంకా వెంకటసీతారామమ్మ (ఆదంకి గుంటూరుజిల్లా) 364. చెన్నుభొట్ల ఉమాదేవి (తుని తూ. గో. జిల్లా) 365. ఎస్. హనుమాన్‌ప్రసాద్ (విజయవాడ) 366. జాస్తి సీతారామారావు (పెనుమత్తేవి కృష్ణాజిల్లా) 367. గోవిందరాజుఅరుణ (గుర జాడ క్రిష్ణాజిల్లా) 368. తాడినాడ ఆదినారాయణరావు (నూజివీడు క్రిష్ణాజిల్లా) 369. అనిల్ చంద్రగౌడ్ (హైదరాబాదు) 370. భాగవతుల మోహనరావు (గుంటూరు) 371. వెంపటి సరోజిని (మంగళగిరి, గుంటూరుజిల్లా) 372. పుల్పి జ్వాలారెడ్డి (ఒంగోలు) 373. జంధ్యాల వెంకటేశ్వర ప్రసాద్ (విజయవాడ) 374. పరిగె వేంకట తిరుమల హనుమంత (ఏలూరు) 375. మాగంటి విజయలక్ష్మి (పెదకొండూరు గుంటూరుజిల్లా) 376 ఉద్ది గోపాల్ (విశాఖపట్నం) 377. పత్తి వెంగన్న తురిమెళ్ల. కర్నూలుజిల్లా) 378. ఆర్. కేశవరాజా బాబు (హైదరాబాదు) 379. చామర్తి వెంకటసుబ్బారావు (వీరంకిలాకు కృష్ణాజిల్లా) 380. సముద్రాల నాగేంద్రకుమార్ (హైదరాబాదు).

381. బి. ఒనకరరెడ్డి (పెద్ద కొదులూరు ఆదోని తాలూకా( 382. ఎమ్ కృష్ణమోహన్ (నెల్లూరు) 383. చింతకుంట సత్యనూరుతి (బాపట) 384 మందరపు రామరాజ్యం (విజయవాడ) 385. గూడవల్లి రత్నజయంత్ (గుంటూరు) 386. ఎమ్. శ్రీరామచంద్రమూర్తి (విజయవాడ) 387. గోపరాజు వెంకట అరుణకుమారి (తెనాలి) 388. పేరి వెంకట రమణమ్మ (పేరూరు తూ.గో.జిల్లా) 389. కొల్లా బాపయ్య (పెద్దమక్కెన, గుంటూరుజిల్లా) 390. తడకమళ్ల వెంకట రత్నం (పెద్దాపురం తూ. గో. జిల్లా) 391. మారిశెట్టి సదాశివరావు (గుంటూరు) 392. ఎస్. వెంకట రమణారావు (రాజమండ్రి) 393. వి. ఉపేందర్ రావు [వరంగల్) 394. నండూరి కాంతకుమారి (పులిగడ్డ,కృష్ణాజిల్లా) 395. కొండా శేషగిరిరావు (జగన్నాధపురం కాకినాడ) 396. వేదుల సరస్వతి (కలకతా) 397. ముంజులూరి భ్రమరాంబ (మచిలీపట్నం) 398. డి. రమణారావు (న్యూఢిల్లీ) 399. కొత్తపల్లి వెంకట గోపాల క్రిష్ణమూర్తి (నిడుబ్రోలు, గుంటూరుజిల్లా) 400. జయంతి కామేశ్వరి (విశాఖపట్నం).

—వచ్చేవారం మరికొన్ని]






చిత్ర నిర్మాణంలో, కథలగురించి వచ్చే కమామిషులలో శ్రద్ధతీసుకోవలసిన మొదటివిషయం పాత్రల రూపకల్పనకూడా. తెలుగు సినిమాలో ఈనాడు అష్టకష్టాలూ పడుతోంది. అరిష్టసూచకమైన ఈ స్థితికి మొదటి కారణం కథలో ప్రమేయం లేకుండా పాతమూసల ప్రకారం శాలీలకు ముక్కుమొహం దిద్దేసి ముస్తాబు చేసెయ్యడం. రెండుమూడు మినహా, మిగతావన్నీ సాధారణంగా నవరసాలతోను ఉంటాయి. మిగతా రెండూ నీరసంగా ఉంటాయి. ఈమనుషులు ఎప్పుడూ, ఇదివరకటి హిట్ చిత్రాలలో లాగే తిరుగుతారు, తింటారు, నవ్వుతారు, నవ్విస్తారు, ఏడుస్తారు. డైలాగు చాలాకూడా దాదాపు పాతవే తోడుక్కువచ్చేస్తారు. పాత్రల ప్రయోగంకూడా అలాగే ఉంది. డైరెక్టరు ఎప్పుడురమ్మంటే అప్పుడు వస్తారు; వద్దంటే పత్తాలేకుండా వెళిపోతారు. అంతే తప్ప, కథలో వాళ్ళకి పని ఉండి రావడం వెళ్ళడం అనేది తగ్గిపోతోంది.

ఫలానా సన్నివేశంలో నాగేశ్వరరావు ఉంటే, కథ కట్టు తప్పిపోతుందని భయం వేసే, నాగేశ్వరరావుని రావద్దంటారు. ఇక్కడ ఈ ఘట్టంలో ఫలానాపాత్ర చెప్పినట్టు వినటం లేదు. కాబట్టి, కాస్త భయం

## కథా - కమామిషూ

చెప్పడానికి ఎన్. టి. రామారావుని తీసుకురావాలనుకుంటే, బతిమాలి తీసుకువస్తారు. నిజానికి ఈలోపాలన్నిటికీ కథలో లోపాలు కారణం, అయితే పాత్రల కనుముక్కు తీరు సవ్యంగా అమర్చి, వాళ్ళలో పంచప్రాణాలూ ప్రతిష్ఠించి సహజం, న్యాయం అనిపించే పద్ధతిలో పాత్రల రాకపోకలకు 'ట్రాఫిక్ కంట్రోలు' పెడితే, కొంత రక్షకట్టవచ్చు. ఈ ప్రమాదం జరగకుండా అసమగ్ర రూపకల్పనతో, అపప్రయోగంతో యథాశక్తిని మన చిత్రాల నాణ్యాన్ని కంట్రోలు చేస్తున్నారు కొందరు. వాళ్ళు అది తెలిసి చేయకపోవచ్చు. అందుకు కొందరే బాధ్యులు కాకపోవచ్చు. చిత్రనిర్మాణంలో ఉండే సవాలక్ష సమస్యలు, ఇబ్బందులూ కళాకారుల ఆశయాలను భగ్నం చేస్తూ ఉండవచ్చు.

అయినంతమాత్రాన ఇది ఆనందానందకరమైన విషయం అని చెప్పుకుని మనం ఉప్పొంగిపోలేము.

ఈ దశకంలో, సమర్థులైన నటులు, ఎన్నడూ లేనంతమంది సమకూరారు. బాక్సాఫీస్ దురభిప్రాయాలకిందపడి వీళ్ళ ప్రజ్ఞ చితికిపోతోందనిపిస్తుంది. బాక్సాఫీస్ సూత్రాలు వీళ్ళలో ఒకొక్కరిని ఒకొక్క 'రకం' పాత్రకు బిగించి కట్టాయి. వాళ్ళు చేసిన అకార్యం, ఆయా పాత్రలను తొలిసారి నిర్వహించినపుడు, ఆ పనిని చాలా సామర్థ్యంతో చేసి అందరి మెప్పులూ పొందడం. ఇపుడు వాళ్ళకి ఆ తరహాలో ఏ పాత్రవచ్చినా, ఆ 'తరహాది' అనకుండా 'అదేపాత్ర' అయిపోతోంది. దీనివల, కొత్త చిత్రానికి కొత్తకథ కట్టేనపుడు పుట్టిన కొత్త పాత్ర, ఆ తరహాపాత్రలలో ప్రత్యేకత వహించిన నటుడి చేతికొచ్చేసరికి, మూస పోసిన, మాసిపోయిన మామూలు శాలీయే అయిపోతుంది. దాంట్లో అంతర్గతం రోజు వరకు ఉన్న స్వతంత్ర వ్యక్తిత్వం శక్తిహీనమై చిక్కి సగమై శల్యమై హరించిపోతుంది. దాని సొంతభావాలు పోపులో ఆవాలలా పేలిపోతాయి. చివరకి మిగిలేవి డైలాగులు.

ఈ పరిస్థితిని పరిశీలిస్తే, బాధ్యతపూర్తిగా నటులది కాదనవచ్చును. అయినా ప్రేక్షకులు వేలిక చేసేది వాళ్ళనే. నిజానికి వీళ్ళంతా ఇప్పుడు స్పెషలిస్టులు అనిపించుకుంటున్న వాటికి పూర్తిగా భిన్నమైన పాత్రలను కూడా అవకాశం వుంటే, ఇంతకన్నా బాగా నటించగలరు. లేనిదల్లా అవకాశమే. ఇది నాయికా



శ్రీ వెంకటేశ్వరవారి 'సతీ సుకన్య'లో అమరనాథ్, కృష్ణకుమారి.



మహారాజులలాగే అత్తలకూ ఆగ్రహం కలిగినా ముప్పే అనుగ్రహం కలిగినా చిక్కే.. అనుగ్రహానికి గురిఅయి అవస్థపడి, అందులో వాటా భరించమని 'భర్త'ను అడుగుతున్న గిరిజ; జగ్గయ్య - అనుపమావారి 'అత్తా ఒకింటి కోడలే' చిత్రంలో

నాయక పాత్రధారుల దగరనుండీ అందరికీ వర్తిసుంది.

పరిశ్రమ స్వభావాన్ని బట్టి ఏ దేశంలో నైనా ఇలాటివి కొన్ని తప్పనిసరి కావచ్చు. అయితే, ఇతరులకూ మనకూ తేడా ఒకటే: ఇతర దేశాలలో కొందరికయినా నిండు ప్రాణం, స్వంత దృక్పథం జీవితానికి దగర తనం ఉన్న పాత్రలు రూపొందుతున్నాయి మనసీమలో దాదాపు అందరూ ఒకేవిధమైన స్థితిలో పడుతున్నట్లు కనిపిసుంది.

బ్రిటిషు నటుడు అలెక్ గినెస ఈనాటి వరకూ ధరించిన పాత్రలో దేనికీ మరొక దానితో పోలిక లేదు. హాలీవుడ్‌లో గాంగ్‌స్టర్ చిత్రాలలోనూ, వెస్టర్న్ చిత్రాలలోను వంటు తప్ప ఇంకెందుకు పనికిరాడనుకొన్న ఎర్నెస్ట్ బోర్గ్‌నైన్, రెండేళ్లనాడు 'మార్టీ' అనే చిత్రంలో బడిపంతులుగా నటించి అకాడమీ అవార్డు సంపుకున్నాడు.

కాబట్టి ఇప్పటినుంచి, పెద్దమనుషులు రేలంగి చేవదూ, రేలంగికి ఆర్. నాగేశ్వరరావు పాత్ర, సూర్యకాంతానికి సక్కుబాయి భూమికా ఇచ్చి పరీక్షించాలని కాదు.

వాళ్లంతా తమతమ భూమికలను కాల్షీట్ ముగిసేదాకా ధరిస్తున్నారు కాబోలని గాక, వాటిని ధరించి, మనకి ఒక జీవితకళలాన్ని చూపించుతున్నారన్న భావం నమ్మకం కలిగించమని. ★

# అత్తా కోడళ్ల కొత్త కథ

అత్తా కోడళ్ల కథలు కనే వినేవారిని ఎంత ఏడిపిస్తారో అంతా నవ్వించగలవు. ఎటొచ్చీ ఇన్నాళ్లూ అవి ఈ రెండో భాగాన్ని అనులుపరచలేదు. దర్శక నిర్మాత కె. బి. తిలక్ ఇప్పుడు మూడో నాలుగో తరహాల అత్తా కోడళ్లతో మూడు నాలుగు అందమైన హాస్యరసం తయారుచేసి వాటిని ఆహ్లాదకరంగా కలుపుతున్నారు. అచిత్రం పేరు 'అత్తా ఒకింటి కోడలే'

ఇంతవరకు తయారైన భాగాలుచూసే తెలుగు సినిమాప్రగతిని శ్రద్ధగాగమనించే వారికి ఇది సినీ జనపరిభాషలో చిన్న 'సర్‌ప్రైజ్ పాకెట్' గా కలదనిపిసుంది.

తెలుగు సినిమాప్రేక్షకులు, కొందరు నటులను ఒకవిధమైన పాత్రలలో నే ఊహించుకోడానికి దాదాపు అలవాటు పడిపోయారు ఆనటులు చాలమంది ఇందులో కొత్తగా కనిపిస్తారు. వాళ్ళ నటనకూడా కొత్తసాయిని అందుకున్నట్టు కనిపిస్తుంది. అలాగే కథన శిల్పంలోకూడా కొత్తదనం కనిపిస్తుంది.

ఇందులో సూర్యకాంతం, ప్రమీల, హేమలత, గిరిజ, జగయ్య రమణమూర్తి, రమణారెడ్డి, కుటుంబరావు, సీత మొదలైన వారు నటిస్తున్నారు మాటలు పినిశెట్టి, పాటలు ఆరుద్ర వ్రాశారు. సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు ఇందులో కమ్మటి పాటలు తొమ్మిది వినిపిస్తున్నారు. ఘంటసాల, శ్రీనివాస్, సుశీల పాడుతున్నారు. ★



ఎస్. అండ్ పి. ప్రొడక్షన్స్‌వారి 'వీరసింహ'లో ఉదయకుమార్, బి. సరోజా దేవి.

## ★ సినిమా వార్తలు ★

విశ్వరూపావారి, సాంఘిక చిత్రం నిర్మాణం చాలవరకూ పూర్తిఅయింది.

జగ్గయ్య, జమున, రాజసులోచన, అమర్‌నాథ్, చదలవాడ కుటుంబరావు, రమణారెడ్డి, పెరుమాళ్లు, పేకేటి శివరాం, మొదలగువారు పాల్గొంటున్న ఈచిత్రానికి శోభనాద్రిరావు దర్శకత్వం నిర్వహిస్తున్నారు. సంగీతం రమేష్‌నాయుడు, నిర్మాత శేషగిరిరావు.

* * *

టార్జాన్ ఫక్కీ చిత్ర కథగల 'సెంగోటై సింగం' చిత్రాన్ని ఎస్. అండ్. పి. ఫిలింస్ వారు తెనిగించి విడుదలచేస్తున్నారు. ఇందులో ఉదయకుమార్, బి. సరోజ బాలయ్య, వీరప్ప, సహస్రనామం పండరీబాయి, మైనావతి మొదలగువారు పాల్గొన్నారు. అరణ్యదృశ్యాలు పుష్కలంగాగల ఈ చిత్రానికి ఛాయాగ్రహణం దర్శకత్వం బి. ఎస్. రెడ్డి నిర్వహించారు.

* * *

శ్రీ వెంకటేశ్వర ఫిలింస్‌వారు 'సతీసుకన్య' నిర్మిస్తున్నారు కృష్ణకుమారి, అమర్‌నాథ్, రమణారెడి, పద్మనాభం, కాంతరావు, మిక్కిలినేని, రాజనాల, రమాదేవి, అమ్మాజీ, మీనాకుమారి నటిస్తున్నారు రచయిత రాము ('వద్దంటే పెళ్లి') చంద్, సంగీతం ఘంటసాల. దర్శకుడు చంద్రమోహన్.

ఈచిత్రం మైసూరులో తయారవుతోంది. అక్టోబరులో విడుదల కావచ్చు.

* * *

పద్మశ్రీ పిక్చర్సువారి 'జగన్నాటకం'లో కృష్ణకుమారి, అమర్‌నాథ్ నాయికానాయకులు రచయిత రామ్‌చంద్. సంగీతం అశ్వత్థామ. దర్శకుడు శోభనాద్రిరావు.

* * *

పద్మశ్రీ ఫిలింస్‌వారి 'శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం' పుల్లయ్యగారి దర్శకత్వాన తయారవుతోంది ముఖ్యనటులు సావిత్రి, రామారావు. సంగీతం పెండ్యాల.

* * *

స్వస్తిశ్రీ అనే కొత్తసంస్థ, విజయా ప్రొడక్షన్స్‌వారు కలసి 'రేచుక్క పగటిచుక్క' అనే జానపదం తీస్తున్నారు. కమలాకర కామేశ్వరరావుగారి దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో రామారావు, రంగారావు, రేలంగి, పాల్గొంటున్నారు.

* * *

సాహిణీవారి ద్విభాషా చిత్రం 'బండరాముడు' పుల్లయ్యగారి దర్శకత్వాన తయారవుతోంది. రామారావు, సావిత్రి నటిస్తున్నారు. తమిళచిత్రం త్వరలోనే విడుదల అయినా, తెలుగుచిత్రం కొత్త సంవత్సరం పుట్టినతరువాతనే వస్తుందని తెలుస్తూంది.

## 'ఏక్ కె బాద్ ఏక్'

చిత్రనిర్మాణంలో కథ చాలా ముఖ్యమైనదన్న విషయాన్ని గ్రహించే నిర్మాతల సంఖ్య నానాటికీ పెరుగుతున్నట్లు కనబడుతుంది.

ఈ విషయాన్ని తామూ పసిగట్టినట్టు ప్రకటిస్తూ తాముకూడా చాలా కట్టుదిట్టంగా కథను కట్టుకుని మరీఫిలిం తీస్తున్నామని రాజ్‌కళా ప్రొడక్షన్స్‌వారు అంటున్నారు.

దేశంలో నానాటికీ పెరుగుతున్న జనాభా కథావస్తువుగా దర్శకుడు రాజ్‌ఋషి ఈ కొత్తచిత్రానికి కథను అల్లారట. ధ్రువచటర్జీ అనే ఆయన కథాసంవిధానం నిర్వహించారు. ఉమేష్‌మథుర్ మాటలు కూర్చారు. ఈ బాలసార కురిపినమోటుట, ఈ జనాభాకథకి 'ఏక్ కె బాద్ ఏక్' (ఒకరివెంట ఒకరు) అని నామకరణంచేశారు. చిత్రం కొత్తగా ఉండాలని సంకల్పించి, ఉంటుందని చెప్పారు

ఇందులో నాయకుడు దేవానంద్. అమ్మాయిలిద్దరున్నారు. కొత్తవాళ్లు. పేర్లు శారదా, తరళా. వీళ్లిద్దరికోసం దర్శకుడు రాజఋషి దేశం అంతా ఆరునెలలు గాలించారట. మిగతానటులు రాధాకిషన్, ప్రభుదయాళ్, ఎస్. కె. ప్రేం. సంగీత దర్శకుడు ఎస్. డి. బర్మన్. ఛాయాగ్రహణం జి. కాళే.

* * *

కమల్ అమ్రోహీ, కొత్తచిత్రం 'దిల్ అప్నా ప్రీత్ పరాయీ' కిశోర్ సాహు దర్శకత్వాన తయారవుతోంది. కథకుడు కమల్ అమ్రోహీయే. నాయికా నాయకులు మీనాకుమారి, రాజ్‌కుమార్. నదీరా, షేలీనాజ్, నమ్మీ, ప్రతిమా దేవి, ఓంప్రకాష్‌లుకూడా పాల్గొంటున్నారు.

సంగీతదర్శకత్వం శంకర్, జైకిషన్‌లు నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం అక్టోబరు నెలాఖరున విడుదలఅవుతుంది.

## లక్ష రూపాయలతో రాసక్రీడ

ఎస్. డి. నరాంగ్ కొత్తచిత్రం 'ఢిల్లీకా ఠగ్'లో మొన్న జలక్రీడ సన్నివేశం ఒకటి గెవాకలర్‌లో చిత్రించారు. దేశయస్థాయిన ఎస్తర్ విలియంస్ అని సినీజనులు చెప్పుకునే 'నూతన్' అందులోని నీటికొలనులో అందంగా ఈదులాడింది. కిషోర్‌కుమార్, తనొవా అనే ఇంకో అమ్మాయి (కిషోర్‌కుమార్ కూడా అమ్మాయి అని ధ్వని లేదని గ్రహించ ప్రార్థన), నృత్యానికి

# ★ న్యూఢిల్లీ లేఖ ★

(5-వ పేజీ తరువాయి)

నాట్యప్రదర్శనాలు. (5) అక్టోబరు 19-21 ఆటవస్తువుల ప్రదర్శనం. (6) అక్టోబరు 22 దసరా—కార్పొరేషనువారు ప్రతిమలను తగలపెట్టుట. (7) నవంబరు 8-9 దీపావళి మేళా. (8) నవం 8-9 చేతిపనుల ప్రదర్శనం (9) నవం 10-11 దీపావళి దీపతోరణాలు. (10) నవం 13-14 శాస్త్రీయ నాట్యాలు (11) జనవరి 23-24 రవిశంకర్, అలీఅక్బర్ సంగీతగోష్ఠి (12) జన. 28-29 జానపద కళాప్రదర్శనం (13) జనవరి 26 రిపబ్లిక్ దినవిన్యాసాలు (14) జన. 26 రిపబ్లిక్ దినోత్సవం (15) జన. 27-28 జానపద నాట్యాలు. (16) జన. 27 "తిరోగమనం" రిహార్సలు (17) జన. 29 తిరోగమనం (18) జన. 17-30 ఆధునిక భారతీయ చిత్రకళా ప్రదర్శనం. (19) ఫిబ్రవరి 20-23 రుక్మిణీదేవి నృత్యాలు (20) ఫిబ్ర. 20-22 సైనికాశ్వప్రదర్శనం (21) ఫిబ్ర. 21. అంతర్జాతీయపుష్పప్రదర్శనం (22) ఫిబ్ర 21-22 బసంత్, హోలీ సంగీతం, నాట్యాలు (23) ఫిబ్ర. 24-26 రోషన్‌వజీఫ్‌దార్ చే భరతనాట్యం, మోహినీఆటం (24) ఫిబ్ర 23, 25, 28 పోలోపోటీలు (25) మార్చి 13-22 సంగీత నాట్య వార్షికోత్సవం (26) మార్చి 17-18 నృత్యోత్సవం (27) మార్చి 19-21 గానసభలు (28) మార్చి 20-23 త్రివేణీకళాసంఘంచే భారతీయ నాట్యాలు (29) మార్చి 24-27 సచిన్ శంకర్ లిటిల్ థియేటర్ గ్రూప్‌వారి బాలే ప్రదర్శనాలు (30) మార్చి 28-29 ఇంద్రాణి రెహమాన్ శాస్త్రీయ నాట్యం.

ఇవిగాక శీతకాలంలో ఢిల్లీ వచ్చే విదేశీ ప్రముఖ అతిథులకు పౌరసన్మానాల పరంపర చెప్పనక్కర్లేదు.

* * *

ఢిల్లీలో వరదనివారణకుగాను ప్రధాని నియమించిన సంఘం అధ్యక్షుడు, వర్క్సు మంత్రి శ్రీ కె. సి. రెడ్డి తమ ప్రథమ నివేదిక సమర్పించారు.

"వరద నీటికాలవలను జాగ్రత్తగా చూడాల్సిన అవసరం ఉందని సంఘం ఉద్ఘాటిస్తోంది.

ప్రతి ఏడూ అక్టోబరులో ఈ కాలవలను అధికారులు తనిఖీ చేస్తూ ఉండాలి, వాటికి పూడిక తీయించి, మరమ్మతులు చేయించాలి. అవసరమైన మరమ్మతులు జరిగాయో లేదో, కాలవలు సరిగా ఉన్నాయో లేదో మళ్ళీ ప్రతి ఏప్రిల్‌లోనూ తనిఖీ చేయించాలి. అలాచేస్తే వానాకాలంలో ఈ వరదకాలవలు వరదనీటిని సక్రమంగా తొలగించటానికి వీలవుతుంది.

నజఫ్‌ఘర్, అలీపూర్ బ్లాకులలో నీటి పారుదలపనిని నజఫ్‌ఘర్ నల్లా చేస్తూ ఉంటుంది. అలీపూర్ బ్లాకులోనించి, నజఫ్‌ఘర్ బ్లాకులో ఒకభాగంనుంచి నజఫ్‌ఘర్ నల్లాకు నీరు తీసుకువచ్చేవి మంగేష్‌పూర్ కాలవ, నంగోలి కాలవ, ఢిల్లీ శివార్లనుంచి ఇంకా చిన్నకాలవలనేకం ఈ రెండు ముఖ్యమైన కాలవల్లోకి నీరు తీసుకువస్తూ ఉంటాయి. ఈ రెండు పెద్దకాలవలూ కాక నజఫ్‌ఘర్ జీల్‌లోంచికూడా నీరు నల్లాలోకివచ్చి పడుతూ వుంటుంది.

ఈ కాలవలలో దిట్టంగా పూడిక ఉంది. అందుచేత వానలుబాగా కురిసినప్పుడు నీరు పొంగి చుట్టుపక్కల పైరను ముంచేస్తూ వుంటుంది. అదీగాక ఈ కాలవలు చాలా మెలికలు మెలికలు తిరిగిపోతూ ఉంటాయి.

నజఫ్‌ఘర్ నల్లాను బాగా పరిశీలించగా దాన్నిండా పూడిక ఉండటంచేత దాని డల్బు చాలా తగ్గిపోయిందని తెలిసింది. ఒక దిబ్బ కూడా ఏర్పడింది. అందుచేత జీల్‌నుంచి వచ్చే నీరు యమునలోకి ప్రవహించటానికి వీల్లేకుండా అడ్డు తయారైంది."

న్యూఢిల్లీలో వరద కాలవలను శ్రద్ధగా, ఎప్పటికప్పుడు తనిఖీ చేయటంమానివేశారని, నజఫ్‌ఘర్ నల్లా పూడిపోతుంటే చూస్తూ ఊరుకున్నారనీ దీన్నిబట్టి స్పష్టమవుతోంది. ఈ అశ్రద్ధకుబాధ్యులెవరో నిర్ణయించేపని ఈ సంఘానికి ఎందుకివ్వలేదో తెలియదు. కాని వర్క్సుశాఖ కార్యదర్శి శ్రీ సచ్‌దేవ్, ఆరోగ్యశాఖ కార్యదర్శి శ్రీ పిళ్లేల వాఙ్మూలాలను మాత్రం సంఘం వెల్లడించింది:

"కేంద్ర వర్క్సుశాఖ సిఫార్సులను ఆధారం చేసుకుని 1956 నవంబరులో న్యూఢిల్లీలో మునిసిపల్ కమిటీ ఆరోగ్యశాఖాధికారి వ్రాసిన ఒక లేఖనుగూర్చి, 1958 ఏప్రిల్ 5వ మునిసిపల్ కమిటీ కార్యదర్శి ఆరోగ్యశాఖకు వ్రాసిన ఒక ఉత్తరాన్ని గూర్చి శ్రీ సచ్‌దేవ్ ప్రస్తావించారు. ఏయే వరదకాలవలను పూడిక తీయించి, శుభ్రంచేసి మరమ్మతు చేయాలో మొదటి ఉత్తరంలో ఒకజాబితా ఇచ్చారు. కొన్ని ముఖ్యమైన మురుగు కాలవలను, నీటి సరఫరా ఏర్పాట్లను మరమ్మతు చేయటానికి ధనం కావాలని రెండో ఉత్తరంలో మునిసిపల్ కమిటీ కోరింది. శ్రీ పిళ్లే చెప్పిన దాని ప్రకారం, కేంద్ర వర్క్సుశాఖ తలపెట్టిన పనులు మంచివే, కాని వాటికి డబ్బుమాత్రం లేదు.

కేంద్ర వర్క్సుశాఖ కొత్త పనులను తలపెట్టేముందు, మురికినీటి పారుదలకు సహజంగావున్న మార్గాలను సరిగ్గా సర్వే చేయించలేదని ఢిల్లీ చీఫ్ కమీషనరు శ్రీ పండిట్ అన్నారు. ఇందువల్ల ఈ మార్గాలు పాడైపోయి మురుగునీరు నిలవ ఉండిపోయింది.

పూడిక తీయించటానికి, తుక్కు తీయించి, నీరు పారేటట్లు చేయటానికి న్యూఢిల్లీలో కేంద్ర వర్క్సుశాఖ, మునిసిపల్ కార్పొరేషన్ తగిన చర్యలు తీసుకోవాలని సిఫార్సు చేయబడింది."

ఆదర్శప్రాయమైన ప్లానింగ్ అంటే ఏమిటో ఈ సంఘం ఒక ఉదాహరణ ఇచ్చింది:

"కాందిశీకులు పునరావాసం ఏర్పరచుకున్న నివేశనస్థలాలలో సరియైనమురుగుదొడ్ల ఏర్పాట్లేమీ లేకుండానే ఇళ్ళు కట్టుకున్నారు. 1937 లో "ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టు" సంస్థ నజఫ్‌ఘర్ రోడ్డులో ఒక పారిశ్రామిక ప్రాంతాన్ని నిర్మించింది. అక్కడ మంచినీటి సరఫరాకు, మురుగునీటి పారుదలకు సరైన ఏర్పాట్లు లేకుండానే చాలా ఫాక్టరీలు లేచాయి. పశ్చిమఢిల్లీనుంచి, పాత ఢిల్లీనుంచి మురుగునీరు యావత్తూ వరద నీటి పారుదలకోసం వుద్దేశించబడిన నజఫ్‌ఘర్ నల్లాలోకి ప్రవహిస్తోంది." ★



# నేటి బాలల విహారం

(3-వ పేజీ తరువాయి)

శాఖ తాలూకు గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలలో ఇంచుమించు సగం పుస్తకాలను అమెరికా సాంకేతిక సహకార కార్యాలయంవారు 80,000 రూపాయలు పెట్టి తెప్పించి బహుమానంగా ఇచ్చా

ఆమె నాకు నూతన విద్యాబోధనా ఉపకరాలను చూపుతూ ఇలా అన్నది: "ఇవి ఈ శాఖకు ఎంతో ప్రోత్సాహం కలిగించాయి. ఈ సహాయానికి మేమెంతో కృతజ్ఞులము."

ఇవి ఇలా ఉండగా, మరొక అదృష్టం కలిగింది. గృహనిర్వహణశాఖను ప్రత్యేకంగా ఏర్పాటుచేసే నిమిత్తం ఒక భవన నిర్మాణానికి హర్‌భగవాన్‌దాస్ దనూమల్ అనే దాత లక్ష రూపాయలిచ్చారు. దాని నిర్మాణం పూర్తికాబోతున్నది కూడా. ★

## ఆకాశరామన్న ఎవరు?

[10 వ పేజి తరువాయి]

ఆఫీసరు ఒకమ టువైద్యుడిలా మొహం పెట్టి..."చాలా బలహీనంగా ఉన్నాడు. ఏమి ఇప్పిస్తున్నావు?"

"ఏదో టానిక్ ఇప్పిస్తున్నాను సార్" వివరంగా అడుగుతున్న ఆఫీసరు మొహం చూసి, తనపని అయ్యేటట్లుందనుకున్నాడు. వెంటనే ఆఫీసరు వేసిన ప్రశ్నకు తల్లక్రిందులయ్యాడు...

"నువ్వు...ఎల్.డి సి. వని మర్చిపోతావు. అందుకే అంత ఖర్చూ, చాలక పోవడమూను. నువ్వు హోమియోమందు ఎందుకు వాడకూడదు? "కాలిఫాస్...100 X" వాడు. పదిహేనురోజులు పోయాక తీసుకురా! కుర్రాడికి జబ్బుచేస్తే బదిలీ కావాలా! తెలివి తక్కువ."

సీతాపతి 'ఖర్మ' అన్నట్లు నుదుటి నొక మాటుకొట్టుకొని, కుర్ర వెధవను వెంటపెట్టుకొని వెనక్కు నడిచారు. ఖర్మ ఏమంటే, ఆఫీసరుకు 'హోమోపతీ' వైద్యంవచ్చు.

తర్వాత దారిలో కుర్రాడు "సోడా!" అంటే ఒక మొట్టుమొట్టాడు కోపంగా. వాడు కుయ్యోమన్నాడు "ఇందుకా నన్ను తీసుకువస్త అన్నటు!" తర్వాత సోడా ఇప్పించాడు. వాడు వెక్కుతూ తాగాడు.

సీతాపతి తల్లికి జ్వరం ఉవ్వెత్తుగా వచ్చింది. ఖంగుమని దగుతోంది. మూసిన కన్ను తెరవదు. మగతనిద్ర మెలుకువ వచ్చినపుడు..."సీతాపతీ! మంపూరు తీసుకుపోరా! అక్కడే చేయరా ఇంతమటి నన్ను" అనేది. సీతాపతి బాధగా నవ్వేవాడు..."అలానే ... అమ్మా! అలాగే పోదాం," అనేవాడు.

"ఏమోరా నాయనా! ఆ శ్రీరామునికి దయలేదు, వచ్చినప్పటినుంచి ఒక్కలా ఉన్నాం...ఈచలికి తట్టుకోలేకుండా ఉన్నాం. ఇదేం జ్వరంరా అబ్బాయీ!"

"భయంతో ఛస్తున్నామండీ! ఎన్నాళ్లండీ?" అనేది భార్య.

"వెళ్లిపోదాం" అంటూండగా, "నాన్నోయి! తేలు!" అని అరిచాడు రెండోకొడుకు. సీతాపతి ఒక్కమాటు ఎగిరి గంతేసి, చెప్పుతీసి, "ఏదీ"అని.

"లాంతరు ఇటుచూపు!" అన్నాడు. వెంటనే తేలును చూశాడు. చాలా భయంకరంగా ఉంది. అడవితేలు! సీతాపతికే భయంవేసింది: అది కుడితే, మరి ఆశలేదనుకున్నాడు సీతాపతి. ధైర్యం పుంజుకొని, బలం కూడకట్టుకొని, దానిమీద ఒక్క దెబ్బ పెట్టాడు.

చెమట తుడుచుకుంటూ, భార్యనుద్దేశించి "ఇదుగో చూడు! రేపే ప్రయాణం," అన్నాడు. మతిపోయినంతగా ఆశ్చర్యపడింది.

సీతాపతి, కుటుంబాన్ని స్వగ్రామంలో ఉంచి తిరిగివచ్చాడు. వచ్చిన వారంరోజులకే పూర్వపు ఆఫీసుకు తిరిగి బదిలీ చేయబడాడు. తను అనుకున్నదే. కాదంటే, తన పూర్వపు ఆఫీసుకు బదిలీ అవుతుందా కాదా అనే అనుమానం తప్పితే! అదొక్కటే, అనుకోనిది జరిగింది.

ఇకపోతే...ఆఫీసులోనివారి ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. తనకు ముందే తెలుసన్నట్లు, ఆర్డరు రాకుండానే కుటుంబాన్ని తరలించడం! అందరికంటే, ఎక్కువ ఆశ్చర్యం ప్రకటించిన సీతాపతి దేవాంతకుడనుకున్నారు. మిగతా గుమాస్తాలంతా,' ఏదో కమామిషుచేసి వచ్చాడయ్యా ఈ సీతాపతి! అసాధ్యుడు." అన్నారు.

ఇంకా అతి విచిత్రమైన సంఘటన ఏమిటంటే. 'కంప్లయింట్స ఆఫీసరు' సీతాపతి రిలీవు అయ్యాక, సీతాపతిమీద ఎంక్వయిరీకి భద్రాచలం రావడం అంతా ఆశ్చర్యపోయారు. సీతాపతి ట్రాన్స్ఫరు మినహాగా, మిగతా గుమాస్తాలతో ఎంతో చనువుగా, స్నేహంగా ఉండేవాడు. ఏదైనా కావలసివస్తే "సీతాపతిని అడగండి" అనేవారు. పైగా సీతాపతి చాలా మంచివాడు అని అందరూ అన్నదే. అట్టి సీతాపతిమీద ఎంక్వయిరీ రావడమా?

సీతాపతి మంచితనంవిన్న కంప్లయింట్స ఆఫీసరు కూడా ఆశ్చర్యపోయాడు.

"నమ్మలేకుండా ఉన్నాను. ఇందులో ఏదో గూడుపుఠానీ ఉంది" అందరి గుమాస్తాల నుద్దేశించి అన్నాడు.

"లేదు. నమ్మండి అతడు చాలా మంచివాడు. నెమ్మదస్తుడు. తుంచి మాట్లాడు. కక్కుర్తిలేదు" అని తల నెరసిన గుమస్తా అంటే...

"మరి ఈ ఆకాశరామన్న వ్రాసిన ఉత్తరానికి మీ సమాధానం?"

"ఆకాశరామన్నా?"

"అవును. సీతాపతి లంచగొండి. కోపిష్టి. దుష్టుడు!"

"వఠిది. అవన్నీ అబద్ధం. ఎవ్వరో కిట్టని వాళ్ళు వ్రాసినది" అన్నారు అంతా, ఆ ఆఫీసు యజమానికూడా చెప్పాడు! 'వ్రాసి ఇస్తాను' అన్నాడు. ఎంక్వయిరీ ఆఫీసరు సీతాపతి మంచితనాన్ని విశ్వసించాడు. ఆకాశరామన్న వ్రాత నిరాధారమని త్రోసిపుచ్చాడు.

కాని, భద్రాచలం ఆఫీసు సిబ్బందికి జవాబు దొరకని ప్రశ్న లేమంటే, సీతాపతికి కిట్టనివాడు ఉన్నాడా? అతను ఎందుకలా వ్రాసినట్లు?

సీతాపతే తనపై తాను వ్రాసుకున్నాడని అంటే, సిబ్బంది కాదు కదా, సీతాపతి భార్య అయినా నమ్మతుందా?

కధ విన్న సీతాపతి ఆరోగ్యంగా, సౌఖ్యంగా చిరునవ్వు నవ్వి, ఆ చిరునవ్వును లోపలకు మళ్ళించుకున్నాడు. అనుకోకుండా, అందరిలాగే తనుకూడా, చిన్నగా, "ఆకాశరామన్న ఎవరూ" అనేసి ఫక్కున నవ్వేశాడు! ★







ఈ రెండిటిలో ఏది కావాలో కోరుకోమని సూర్యకాంతానికి వరం యివ్వటంలేదు జగయ్య; ఒకాట 'ప్రద్యుమ్నుని' రెండోది ప్రయోగిస్తానని ఆయన తాత్పర్యం...'కోడంట్రికం పెట్టడం నా జన్మహక్కు' అని నమ్మిన అత్తగారికి, 'కాదు సుమా' అని ఘంటసాల కంఠంతో అతిశ్రావ్యంగాను, గంభీరంగాను నచ్చచెబుతున్న అల్లుడు, అత్తగారూ..భర్త కార్యక్రమానికి దర్శకత్వం నడుపుతున్న గిరిజ, ఈ బొమ్మలో అత్తగారికి కోడలు కాదు, కూతురు—'అత్తా ఒకింటి కోడలే' చిత్రంలో ఒక సన్నివేశం.

## "మేకప్" .

(58 వ పేజీ తరువాయి)

"రూపొందిన"మీదట నటుడు రంగంమీదికి వస్తాడు. అండెన్ అప్పటికీ నటుని ప్రతికదలికనూ, పరిశీలిస్తూనే ఉంటాడు. ఒక్కొక్కతడవ రంగస్థలంమీది దీపాల వెలుగులో నటుని చూచినప్పుడు అతని మేకప్‌లో కొన్నిమార్పులు చేయవలసి ఉన్నట్లు తెలియవస్తుంది. అప్పుడు అండెన్ ఆనటుని తిరిగి మేకప్‌రూమ్‌లోకి తీసుకొనిపోతాడు.

ఏదృశ్యంలో దీపాలతేజస్సు యెంతగా ఉంటుంది, యెంతెంత దూరంనుండి "షాట్లు" తీయబడతాయి, ఆదృశ్యాలు యేవిధంగా తీయబడుతాయి అన్న సమాచారం మేకప్ చేసేవ్యక్తికి తెలిసిఉండాలి. ఈ సమాచారం తెలిసినమీదటనే అతడు నటునికి మేకప్ చేయడం ప్రారంభిస్తాడు.

చలనచిత్రాలలో మేకప్‌పని చాలా క్లిష్టమైనకళ అని అండెన్‌పనివల్ల తెలియవస్తుంది. ఈకళ సినిమాకళకంటె తర్వాతగా ప్రారంభమైయింది. అందువల్ల ఈ కళ ఇంకా పెంపొందవలసి ఉన్నది. సినిమా మేకప్ కళ నాటకరంగంయొక్క మేకప్ కళ నుండే ఉద్భవించింది. కాని దానిలోని సంప్రదాయాలుకొన్ని సినిమా మేకప్‌కళకు చెల్లవు.

నటునిముఖంలోని లోపాలనూ, మేకప్‌లోని లోపాలను కెమేరా సులభంగా పట్టివేయగలదు గాబట్టి సినిమా మేకప్‌పని చాలా కష్టంతో కూడిఉంటుంది. ఈ శతాబ్దం మూడవ దశకంలో సోవియట్ సినిమారంగం అనవసరమైన శాస్త్రీయపద్ధతులు త్రోసిపుచ్చి సహజత్వాన్ని పోషించడానికి ఉపకరించే మేకప్‌ను ప్రోత్సహించసాగింది.

క్లోజప్‌లో దృశ్యం తీయబడుతున్నప్పుడు మేకప్‌లోఉన్న లోపాలు ఇట్టే తెలిసిపోతాయి గాబట్టి, దానిని సాధ్యమైనంత సహజంగా ఉండేట్లు చూడడం అవసరం

నటుడు తనపాత్రను అర్థంచేసుకొని దానిలో లీనమైపోవడానికిగూడా మేకప్ అత్యంతంగా తోడ్పడుతూ ఉంటుంది. మేకప్ సహాయంతో పూర్తి స్వరూపాన్నే మార్చివేసుకొనడంసాధ్యమవుతుంది అప్పుడు ఆపాత్రలో లీనమైపోయి, అతిసహజంగా నటించడానికి వీలుకలుగుతుంది.

మేకప్ చేసే వ్యక్తి సినిమాలోని పాత్రలకు "సృష్టికర్త" అవుతాడు. నటుడు తన పాత్రను అర్థంచేసుకొని దానిలో లీనమైపోయి నటించడానికి తోడ్పడుతాడు.

## వివిధరకాల 'మేకప్'

సినిమా మేకప్‌లో ద్రవరూపంలోఉండే రంగులుమాత్రమే ఉపయోగింప బడుతాయి. ఈ మేకప్‌లో వివిధమైనరకాలు ఉన్నాయి. నటునిముఖంలో యేదైనా లోపంఉన్నప్పుడు దానిస్వరూపాన్ని మార్చకుండానే ఆలోపాన్ని తొలగించడానికి దిద్దుబాటు మేకప్‌పద్ధతి అవలంభింపబడుతుంది. వయస్సులో భేదాన్ని చూపించవలసి వచ్చినప్పుడు మరొకరకమైన మేకప్‌పద్ధతి ఉపయోగింప బడుతుంది. వ్యాధిగ్రస్తులైనవారి ముఖాలు, నూలకాయలముఖాలు, హాస్యపాత్రల ముఖాలు రూపొందించడానికి వేరువేరు మేకప్‌పద్ధతులు ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఈ వివిధపద్ధతులు సమ్మిళితంగా అవలంబింప బడుతుంటాయి.

ఈవిధంగా చలనచిత్రంలోని పాత్రలు నటులు, దర్శకులు, స్క్రిప్టు రచయితలు, ఛాయాచిత్రగ్రాహకులచేతనేగాక మేకప్ మాన్‌ల సహాయంతోగూడా సమిష్టిగా సృష్టింప బడుతుంటాయి. 

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

# మీ సౌందర్యమే మీకు భూషణము...

## మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా ఉంచుకొనుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడండి!



తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీము జిగురుగా ఉండదు. అది రాసుకొన్న మరు క్షణములోనే కనపడకుండా పోతుంది మరియు దానిని పౌడరు అద్దుకొనే ముందు వాడుతే పౌడరును గంటల తరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

### చర్మమును శుభ్రపరచే క్రీమ్

ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును పూర్తిగా శుభ్రపరుస్తుంది మరియు చర్మములోని సూక్ష్మ రంధ్రములు పొడిగా అగుటను అడ్డుటయే కాక చర్మముయొక్క మృదుత్వము పోకుండా కూడ కాపాడుతుంది.




### ఉచిత పుస్తకము

"*Lorelier with Pond's*" అనె సౌందర్యమును గురించిన ఇంగ్లీషు పుస్తకము కావాలని వ్రాయండి. దానిలో ముఖవర్చస్సు మరియు సౌందర్య రక్షణను గురించి ఎన్నో ఉపయోగకరమైన సలహాలు ఉన్నాయి. 25 నయాపైసల తపాలా బిళ్లలు పంపుతూ ఈ ఎడ్రసుకు వ్రాయండి : ప. ఓ. బాక్సు 1612, డిపార్టుమెంట్ 26 ఏ బొంబాయి 1.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్ కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో సంస్థాపింపబడినది